ICRSA101M122

# Quick Heal®

## 9-in-1 Protection for your PC

FOR DEALER ENQUIRY
Hyderabad: 93973 46512
Vizag: 93462 01067
Vijayawada: 92464 79234
Guntur: 93912 99172

"With Quick Heal Total Security 2008 in my laptop I can now scan and clean my Mobile phone using bluetooth."




Internationally certified by






Level 2



DNAScan™
A signature free technology to outsmart spywares & riskwares

Quick Heal


**QUICK HEAL TECHNOLOGIES (P) LTD.**

Branch: 1-2-253/7, Lakshmi Narsu Mansion, 95, Parklane
Secunderabad - 3. Ph: 040-27845782, Cell: 93973 02676
E-mail: hyderabad@quickheal.co.in www.quickheal.com

# నమ్మిన సిద్ధాంతాలతోనే ప్రజ్వరిల్లిన 'జ్వాలాముఖి'



—చలపాక ప్రకాష్

ప్రసిద్ధకవి, దిగంబర కవులలో ప్రముఖుడైన జ్వాలాముఖి (వీరవెల్లి రాఘవాచారి) డిసెంబర్, 14న కన్నుమూసారు. ఏడాది కాలంగా జీర్ణకోశ వ్యాధి, మధుమేహ వ్యాధితో జ్వాలాముఖి బాధపడు తున్నారు. 1991 లో ఆయనకు ఓపెన్‌హార్ట్ సర్జరీ జరిగింది. ఈ డిసెంబర్ 9న ఆయన ఆరోగ్య పరిస్థితి క్షీణించి ఆస్పత్రిలో చికిత్స జరుగుతున్న సమయంలో మళ్లీ గుండెపోటు రావడంతో పరి స్థితి విషమించింది.

1938 ఏప్రిల్, 12న నర్సింహాచార్యులు, వెంకట లక్ష్మీనర్సమ్మ దంపతులకు జన్మించిన జ్వాలాముఖి విద్యాభ్యాసమంతా హైదరాబాద్‌లోనే జరిగింది. హేతువాద ఉద్యమంలో, కులనిర్మూలన పోరాటాలలో ఆయన ప్రముఖపాత్ర పోషించారు. భారత-చైనా మిత్రమండలిలో రాష్ట్రకమిటీ ప్రధాన కార్యదర్శిగా, జాతీయ కమిటీ ఉపాధ్యక్షునిగా బాధ్యతలు నిర్వహించిన ఆయన రెండుసార్లు చైనా లో పర్యటించారు. ఉపన్యాసాలతో ప్రజల్ని, కవుల్ని సైతం చైతన్యవంతులను చేయడం ఆయనకు వెన్న తో పెట్టిన విద్య. 1971 లో విరసం సభ్యుడిగా క్రియాశీల పాత్ర పోషిస్తున్న సమయంలో జ్వాలా ముఖిని దిగంబర కవులలోని తన సహచర కవి మిత్రులతో పాటు పీడియాక్ట్ క్రింద కేసు నమోదు చేసి ప్రభుత్వం జైల్లో పెట్టింది. అంతకు ముందు విరసం ప్రచురించిన 'ఝంఝ' విప్లవ కవితలు ఎంతో ప్రభావాన్ని చూపాయి. ఎమర్జన్సీ కాలంలో ఆయన 15 రోజులపాటు జైలులో గడిపారు. నిర్బంధాలను ఎదుర్కొంటూనే 1991 లో ఆయన గుండెకు శస్త్రచికిత్స చేయించుకున్నారు. 1958 లో 'మనిషి' అనే కవితకు కరుణశ్రీ చేతులమీదుగా ఉత్తమ బహుమతిని అందుకున్నారు. 1965-70 ల మధ్య వెల్లువెత్తిన 'దిగంబర' కవితా ఉద్యమం స్థాపించి, సహచరులతో కలిసి ఆ ఉద్యమానికి 'చరిత్ర'లో ఒక ప్రత్యేక అధ్యాయానికి, ఉద్యమానికీ తెరతీసారు. 1970 లో విప్లవ రచయితల సంఘం ఆవిర్భావంలో ముఖ్యభూమిక పోషించారు.

ఉరిశిక్షకు వ్యతిరేకంగా ఆయన రచించిన 'వేలాడే మందారం' నవల 1979 లో జ్యోతి మాస పత్రికలో ప్రచురితం కాగా, హిందీలో వేమూరి ఆంజనేయశర్మ అవార్డు అందుకున్నారు. 'మనిషి' శీర్షికతో కావ్యం, 'ఓటమి తిరుగుబాటు' దీర్ఘ కావ్యం రచించిన జ్వాలాముఖి 'శరత్‌బాబు' అనే హిందీ నవలను తెలుగులో 'దేశదిమ్మరి'గా అనువ దించారు. అటు సాహిత్యానికి, ఇటు సమాజానికీ సేవలందించిన జ్వాలాముఖి చివరివరకూ తను నమ్మిన విప్లవ సిద్ధాంతాలతోనే అలుపెరుగని పోరాటం చేస్తూ, ఆచరిస్తూ వచ్చారు. సామ్రాజ్య, ప్రాంతీయవాదాల్ని వ్యతిరేకించారు. ఎందరో యువ కవుల్ని ప్రోత్సహించారు. రాష్ట్రంలోనే కాక దేశంలోని అనేక ప్రాంతాలలో నిర్వహించిన సాహి త్య సభలలో మస్తుకవిగా భుజానికి సంచి తగిలిం చుకొని, నిండైన విగ్రహంతో దర్శనమిస్తూ తన సహజ కంచుకంఠంతో... వాగ్ధాటితో సభలను 'ఝంఝ'మారుతంగా ప్రతిధ్వనించేవారు. ఆయన 'ఝంఝ' కవితలోని –

*"విప్లవ ఆహ్వానంతో వెళ్తున్నాను*
*నా పాత్ర ముగిసింది*
*నేను సత్యం – మీరు సత్యం*
*నా మరణం అసత్యం...*
*నా కాగడా అందుకోండి*
*ఊరి చీకటంతా కాల్చివేయండి"*

అన్న వాఖ్యలు తెలుగు సాహిత్య ప్రపంచంలో పాఠకుల హృదయాలలో 'నిజం'గా మండుతూనే ఉంటాయి... మారుమ్రోగుతూనే ఉంటాయి. ●

సంపుటి : 3
సంచిక : 6

జనవరి, 2009

ఎడిటర్: యం. నాగకుమారి



మాసపత్రిక

# ప్రేమంటే ఇదేనా?

'ప్రేమ'ంటే తమకు నచ్చిన వారిని స్వంతం చేసుకోవడం... అనే భావన నేటి యువతలో బలంగా పెరుగుతోంది. 'ప్రేమ'ంటే... అది 'రెండు వైపులా' ఉండాలని, 'స్వార్థం'తో కూడి ఉండకూడదని, అవసరమైతే 'త్యాగం' కూడా కోరుతుందనీ గమనించడానికి వారు ఆసక్తి చూపడంలేదు.

ప్రేమించలేదనే కోపంతో యాసిడ్ దాడులకు పాల్పడడం, బ్లేడులతో గాయపరచడం... ఇతరత్రా ఇబ్బందులు పెట్టడం వంటి సంఘటనలు నేడు సర్వసాధారణమైపోయి, సమాజాన్ని కలవరపెడుతున్నాయి.

వరంగల్లులో ఇద్దరు యువతులు యాసిడ్ దాడులకు గురై రాష్ట్రమంతటా ఈ విషయమై చర్చ జరుగుతున్న సమయంలోనే ఇదే తరహా సంఘటనలు అనేకం వెలుగు చూడడం ఈ సందర్భంగా గమనించవలసిన విషయం.

దాడులకు గురయిన వారేకాదు... దాడులకు పాల్పడినవారు, వారి కుటుంబసభ్యులూ కూడా ఎంతటి విషమ పరిస్థితులను ఎదుర్కొంటారో ప్రతి సంఘటనా విడమరిచి చెబుతూనే ఉంది. అయినా క్షణికావేశంలో ఇటువంటి సంఘటనలు మళ్లీ మళ్లీ జరుగుతూనే ఉన్నాయి.

పోలీసులనో, విద్యాసంస్థల యాజమాన్యాలనో విమర్శించడం కాక, ఈ విషయంలో తల్లిదండ్రుల బాధ్యతను కూడా గుర్తించాలి. తమ పిల్లల ప్రవర్తన, వారి ఆలోచనా ధోరణులను నిరంతరం గమనిస్తూ, వారిని సరైన మార్గంలో నడిపించవలసిన బాధ్యత తల్లిదండ్రులదే. నిజమే... ఈ స్పీడ్ ప్రపంచంలో భార్యాభర్తలిద్దరూ ఉద్యోగాలకు పరిగెడుతూ తమ పిల్లలపై దృష్టి కేంద్రీకరించలేకపోతున్న ఈ రోజుల్లో ఇది కొంత కష్టమే. అయితే ఏవో కారణాలతో తల్లిదండ్రులు తమ బాధ్యతల నుంచి తప్పించుకోవాలనుకోవడం ఆత్మవంచనే అవుతుంది. ఇతర వ్యాపకాలకన్నా పిల్లల పట్ల 'బాధ్యత' వహించడమే ప్రధానమైనదని గుర్తిస్తే ఎన్నో సమస్యలు పరిష్కారమవుతాయి.

ముఖచిత్రం: 'సంక్రాంతి సంబరాలు' చిత్రకారుడు: ఉదయ్
కథలకు చిత్రాలు: పాణి, కొచ్చెర్ల, ఎ.వి.యం., శివాజి, రాంపా

Printed, Published and Owned by M. Rama Rao and Printed at Ratna Printing Works, 28-19-29, Janda Street, Arundel Pet, Vijayawada - 2. A.P. and Published at 29-25-43A, Vemuri Vari Street, Suryarao Pet, Vijayawada - 520 002. A.P. Editor: M. NAGAKUMARI



డిసెంబర్ 'కథాకేళి' ముఖచిత్రం చాలా బావుంది. జాతీయ సమైక్యత ఉట్టిపడేలా ఉంది. అయితే ఈసారి ప్రచురించిన కథలు మాత్రం బావున్నాయనిగాని, బావోలేవని గానీ చెప్పలేకుండా ఉన్నాయి. ఒక్క సన్మానం కథని మాత్రం బావుందని ఏ కన్ఫ్యూజన్ లేకుండా చెప్పవచ్చు. రాగద్వేషాలకు అతీతంగా, పేషెంట్ క్షేమాన్ని మాత్రమే కాంక్షించే డా॥ జయశ్రీ నిజంగా అభినందనీయురాలు. స్వయంగా డాక్టరు కావడం వల్లనేమో డా॥ జయప్రదగారు ఆ పాత్రని చాలా చక్కగా తీర్చిదిద్దారు. అభినందనలు.

– పి.వి. రమణమూర్తి, హైదరాబాద్

మధుర మధురకర మీనాక్షి... కంచిపట్టున కామాక్షీ.. నిజంగా సాయిఅయితిక గారు అందించిన మధురై విశేషాలు చదువుతుంటే ఒక అద్భుతమైన దృశ్యకావ్యం చూస్తున్నట్లే ఉంది. మనదైన సంస్కృతీ సౌరభాల్ని ఎంతో ఆస్వాదించాం. ఈ నెల కథలన్నీ బావున్నాయి.

– ఎమ్. అనూరాధ, వికారాబాద్

దేశమాత ముద్దుబిడ్డలు సైనికులు. వారి సాహస కృత్యాలు ఎవరినైనా ఉత్తేజపరుస్తాయి. 'పాయింట్ 5140' లో చూపిన సైనికుల ఘనమైన సేవలు, వారి ధైర్యం, మంచుకొండల్లో వారి ప్రయాణం – శత్రువుని మట్టుబెట్ట దానికి ఎదురొడ్డే సాహసం, అదునుకోసం వహించే సహనం, అపై వారి ఆవేశం అన్నీ కళ్లకు కట్టినట్లు – మేము అక్కడే ఉండి చూస్తున్న అనుభూతి కలిగేలా అందిస్తున్నారు కాటూరుగారు ఆ నిజజీవిత కథనాల్ని. 'కథాకేళి'లో సైనికగాథలు చోటుచేసుకోవడం మా అదృష్టం.

– జి.వి. కామేష్, హైదరాబాద్





అవసరం – అనర్థం, సేల్స్‌మన్‌షిప్ కథలు పేరులోనే అర్థాన్నంతా నింపుకున్నాయి. టెర్రరిస్ట్ దాడుల నేపథ్యంలో సమైక్యత ఆవశ్యకతతో ఇచ్చిన ముఖచిత్రం, ఎడిటోరియల్ అర్థవంతంగా ఉన్నాయి.

– సిహెచ్. ఇందుమతి, తాడేపల్లిగూడెం

నూతన సంవత్సర శుభాకాంక్షలు. వైఎస్ఆర్ వేయించిన హైకోర్ట్ దావావలన రోడ్‌షోలకు భంగం కలిగించడం అప్రజాస్వామికం. టెర్రరిజంపై ఎడిటోరియల్ స్పందన బావుంది. శాంతిపావురాలు మన దేశంలో దండిగా ఉన్నాయ్. రాబందులు పాకిస్తాన్‌లో దండిగా ఉన్నాయ్. అనివార్య కారణాలంటూ ఒక్కోనెల పత్రిక రాకపోవడం బాగాలేదు. పాము–ముంగిస చిన్న కథ బావుంది. కార్టూన్లు బావుంటున్నాయి.

– వాస్తు రామచంద్ర, నెల్లూరు

'వృద్ధాప్య ఫించన్' నేటి నిరుపేద వృద్ధుల పరిస్థితిని కళ్లకు కట్టింది. సామాన్యుల పట్ల నాయకుల, అధికారుల నిర్లక్ష్యం, ప్రభుత్వ పథకాలు సామాన్యులకు వర్తింపజేయడంలో (అది ప్రజల నుంచి వచ్చిన సొమ్మే అని మరచి) ఏదో వారి స్వంత జమానా నుంచి ఇస్తున్న ఆభిజాత్య ప్రదర్శన – భరించరానివిగా మారుతున్నాయి. ఏదేమైనా సీతారాములి ఆఖరి నిర్ణయం మాత్రం తప్పకుండా అభినందించదగ్గది. ఎవరో వచ్చి ఏదో చేస్తారని ఎదురుచూడకుండా మనకు చేతనయినది

మనమే చేసుకుందాం. అపై ఆ పైవాడి దయ. సింధూరం కథ కూడా ఈ కోవకే చెందుతుంది. డబ్బున్న భాస్కరం మామూలు విద్యార్థి అయినా కూడా పెద్ద చదువులు చదవడం, మెరిట్ విద్యార్థి అయి కూడా రాజు పడవ నడుపుకోవడంతో సరిపెట్టుకోవడం ఎంతో బాధ కలిగించింది. ఎప్పటికి తీరేనో ఈ అంతరాలు.

– కసుమర్తి శివాజి, సూర్యాపేట

– ముల్లంగి అరుణ, ఏలూరు

'సేల్స్‌మన్‌షిప్' కథ చాలా బావుంది. హాస్యం, సెటైర్ మిళితంచేసి సస్పెన్స్‌ని జోడించారు రచయిత్రి. టైమ్ అయినా కండక్టర్ బెల్ కొట్టడు. అందుకని ప్రభుత్వ బస్సులను దైవాధీనం బస్ సర్వీసంటే తప్పేమీ లేదు. రైల్వే గేట్‌ల దగ్గర ఎన్నో ప్రమాదాలు జరుగుతున్నాయి. జ్యోతిష్కులు చెప్పింది జరుగుతుందని గ్యారంటీ లేదంటూనే పొగిడించుకోవడం కొందరికి యిష్టం. అలాగే మార్కెటింగ్ చేసే వాళ్లకు వాక్చాతుర్యం కావాలని నిరూపణ చేసిన విధం బావుంది.

– ఎ.వి. ప్రియ, హైదరాబాద్

ఐతా చంద్రయ్యగారి 'విముక్తి' కథ చాలా బావుంది. భూమి పట్ల రైతుకుండే ప్రేమ యాదయ్య ప్రతీ మాటలో స్పష్టమవుతూఉంది. ఒక సంవత్సరం పంట పండకపోయినా మరో సంవత్సరమన్నా పండక పోతుందా అనే ప్రయత్నంలో యాదయ్య పడిన ఆరాటం మనసుని కదిలించింది. ప్రస్తుతమున్న పరిస్థితుల్లో ఎంతోమంది చిన్నరైతులు కూలీలుగా మారుతున్న వైనం, వారు అనుభవించే వేదన అర్థమై సెజ్‌ల పేరిట భూములను కబ్జాచేస్తున్న వైనం అసహ్యం పుట్టించింది. ప్రకృతి వైపరీత్యాల రీత్యా పంట పండక ఫ్యాక్టరీలో పనికిచేరిన యాదయ్యే అంత ఆవేదన అనుభవిస్తే, ఇక భూములు పూర్తిగా కోల్పోయిన రైతులంతా శాశ్వత కార్మికులుగా మారి ఎంత ఆవేదన అనుభస్తున్నారో అనే ఆలోచన మనసుని కదిలించింది.

ప్రతీనెలా ఇస్తున్న కథలు, కార్టూన్లూ అన్నీ బావుంటున్నాయి. నమ్మాల్సిందేనండోయ్, సిపాయి కథలు ఆసక్తిగా ఉంటున్నాయి. 'కంప్యూటర్ విజ్ఞానం', కథాకేళి... తెలుగు పట్ల మీకున్న అభిమానాన్ని చాటుతున్నాయి. ఈ మార్పు ప్రతి తెలుగువాడిలో రావాలని, తెలుగు చదివే పాఠకులు పెరగాలనీ కోరుకుంటున్నాం.

– వి. శమంతకమణి, రాజమండ్రి

– కె.వి. లక్ష్మి, రాజమండ్రి

– కె. రాజేంద్రప్రసాద్, విశాఖపట్నం

## ఈ సంచికలోని కథల వరుస

# నానాటికీ దిగజారుతున్న రాజకీయ నాయకుల ప్రసంగాలు

## "హుందాతనం..."

రాజకీయ నాయకుల డిక్షనరీల్లో నుంచి క్రమంగా తొలగిపోతున్న పదం. ఎవరు ఏం మాట్లాడుతున్నారో, ఎందుకు మాట్లాడుతున్నారో కూడా ఆలోచించకుండా తమ స్థాయిని మరిచి, ఎదుటివారిని దూషించడమే పనిగా రాజకీయ నాయకుల ఉపన్యాసాలు సాగిపోతున్నాయి. ఒకప్పుడు ఎవరైనా కొంత కటువైన పదం వాడితేనే దాని గురించి రాద్ధాంతం చేసే నాయకులు ఇప్పుడు ఎవరికీ ఎవరూ తీసిపోకుండా పోటీలుపడి మరీ ఒకరినొకరు దుమ్మెత్తి పోసుకొంటున్నారు.

అంతేనా...? కొత్త కొత్త పదాలు కనిపెట్టి మరీ తిట్టుకొంటున్నారు. ఆడా మగా బేధం కూడా లేదు. ఒకరిని మించి మరొకరు పోటీ పడుతున్నారు. అసలు ఈ పరిస్థితి ఎందుకొస్తోంది...? ఎందుకొచ్చింది...? వ్యక్తిగత ఆరోపణలు, నిందలూ అవసరమా? అసలు ఒకరి వ్యక్తిగత విషయాలలో తలదూర్చే అధికారం వేరొకరికి ఎక్కడినుంచి వస్తోంది?

## సులభమైన ప్రచారం

రాజకీయ నాయకులు ఎంత ఛోటా నాయకులైనప్పటికీ తమ తిట్లపురాణం ద్వారా వార్తల్లోకి ఎక్కవచ్చు. పత్రికల్లో ప్రధానంగా కనబడవచ్చు. టి.వి. ఛానెల్స్‌లో రోజంతా కనబడవచ్చు. ఎలాగూ అటు వైపు నుంచి ఖండనలు వస్తాయి కనుక కొంతకాలం పాటు ప్రజలందరి నోళ్లలోనూ ప్రచారం కావచ్చు.

## నాయకుల మెప్పుకోసం

అధినాయకుల దృష్టిలో పడడానికి ఇదే తేలికైన మార్గంగా చాలామందికి కనబడుతోంది. తమ తిట్లపురాణం ద్వారా వార్తల్లోకి వచ్చి, అధినాయకత్వం మన్ననలు పొందాలనేది కొంతమంది వ్యూహంగా కనబడుతోంది. నాయకుల సమర్థింపులు దీనికి ఆజ్యం పోస్తున్నాయి.

## అభిమానుల కోసం

తమ అభిమానులను సంతృప్తిపరచడం కోసం వైరివర్గాలను ఘాటుగా విమర్శించడం కూడా జరుగుతున్నట్లు కొన్ని సందర్భాల్లో కనబడుతోంది. అయితే ఇది ఎంతవరకూ సమంజసం? అసలు అటువంటి అవసరం ఉందా? ఈ ఆలోచనలు వారికి వచ్చినట్లు కనబడవు.

## ప్రజారాజ్యం పంథా ఎందుకు మారింది?

మొదట్లో 'ప్రజారాజ్యం' పంథా పలువురిని ఆకర్షించి, మెచ్చుకొనేలా కూడా చేసింది. తాము 'గాంధీగిరి' ద్వారానే విమర్శలకు సమాధానం చెబుతామని ఆ పార్టీ ప్రకటించింది. చాలా కాలం సంయమనం కూడా పాటించింది. అయితే రాజకీయాల్లో 'రెచ్చగొట్టే' అంశాలెన్నో ఉంటాయి. మరెందుచేతనో... చిరంజీవి, వారి

వర్గీయులూ కూడా రెచ్చిపోయి, తమ పంథాని మార్చేసుకొన్నారు. ఇప్పుడు 'తమ యువనాయకుడు' రెచ్చిపోతుంటే కట్టడి చేయకపోగా, ఆయన్ని సమర్థించే స్థాయికి వారి పంథాని మార్చుకున్నారు. (చిరంజీవిపై కోడిగుడ్ల దాడి తర్వాత వారు శాంతియుతంగా కోడిగుడ్లను పంచడం ద్వారా వచ్చిన అనుకూల స్పందనను మర్చిపోయినట్లున్నారు).

## ఎవరూ అతీతులు కాదు

ఈ విషయంలో ఎవరూ అతీతులు కాదనే విధంగా రాజకీయనాయకుల ప్రసంగాలు కొనసాగుతున్నాయి. నిన్నో మొన్నో రాజకీయాల్లోకి వచ్చినవారు తెలిసో తెలియకో ఏదో మాట్లాడుతున్నారనుకొంటే వేరే సంగతి. రాజకీయాల్లో తలలు పండిపోయిన నాయకులు సైతం ఏదో ఒక సందర్భంలో నోరు పారేసుకొన్నవారే. అంతవరకూ ఎందుకు? కనీసం ముఖ్యమంత్రి వై.ఎస్., ప్రతిపక్షనాయకుడు చంద్రబాబు అయినా దీనికి అతీతంగా ఉన్నారా అంటే లేదనే చెప్పాలి. వారి ఉపన్యాసాల్లో సైతం తరచుగా ఇబ్బందికరమైన పదాలు దొర్లుతూనే ఉన్నాయి.

## ప్రజల గురించి పట్టదా?

తమ ప్రత్యర్థిని తిట్టడమే ధ్యేయంగా ఆలోచిస్తున్నారుగాని, ప్రజలు ఏవగించుకొంటారని, తమ ఇమేజి సైతం ఘోరంగా దెబ్బతింటుందనీ ఈ రాజకీయ నాయకులు ఎందుకు ఆలోచించరో ఎవరికీ అర్థంకాదు. హుందాతనంతో ప్రజల హృదయాలను గెల్చుకునే ప్రయత్నం ఎందుకు చేయరో తెలియదు. అంతేకాదు... తమ మాటలతో ప్రజలలో పలుచనైపోయి, తమను అభిమానించే వారిని సైతం దూరం చేసుకొంటున్నామని ఎందుకు గ్రహించరో...

## తిట్టించుకోవడమూ సరదాయేనా?

తాము ఎవరినైనా తిడితే, అవతలి వర్గం వారు దానికి రెండింతలుగా తమని కూడా తిడతారని గ్రహిస్తే అసలు ఈ ఉదంతాలకే అవకాశంలేదు. 'పంచెలూడదతాయ'ని తిడితే 'జీన్స్ ఊడతాయ'ని తిట్టించుకోవడం ఖాయం. 'కుర్రకుంక' అని తిడితే 'ముసలినక్క' అని తిట్టించుకోవడం ఖాయం... మరి ఎందుకీ తిట్టడాలు, తిట్టించుకోవడాలూ...?

## మీడియా పాత్ర

ఈ అంశంలో మీడియాపాత్రని కూడా ప్రత్యేకంగా ప్రస్తావించాలి. ఎందుకంటే దూషణ, ప్రతిదూషణల పర్వంలో ప్రముఖ పాత్ర పోషిస్తున్నది మీడియానే. ఒక వార్డుస్థాయి నాయకుడు ముఖ్యమంత్రినో, ప్రతిపక్షనాయకుడినో విమర్శిస్తే దానిని ప్రచురించవలసిన/ప్రసారం చేయవలసిన అవసరం ఉందా? ఈ దూషణ పర్వాలను ప్రముఖంగా ప్రధాన ఎడిషన్లలో మొదటి పేజీలలో ప్రచురించవలసిన అవసరం ఉందా? వీటి తీవ్రతను అరికట్టడంలో మీడియా ప్రధాన పాత్ర పోషించలేదా? ఇవేమీ జవాబు దొరకని ప్రశ్నలు కావు. 'మితిమీరిపోతున్న శృంగారం' అంటూ సినిమాలను విమర్శిస్తూ వ్యాసం వ్రాసి, 'శృంగార దృశ్యాల' ఫొటోలతో వ్యాసం ప్రచురించడం వంటిదే ఇది కూడా. మీడియా తలచుకొని, ఈ 'తిట్ల'ను సెన్సార్ చేయగలిగితే తిట్టేవారూ ఉండరు, తిట్టించుకొనేవారూ ఉండరు.

రాజకీయ నాయకుల్లారా! ఒక్కసారి ఆలోచించండి. ఆవేశపూరిత ప్రసంగాలు మాని, ఆలోచనాత్మక విషయాలపై ప్రసంగించండి. మీ హుందాతనాన్ని కాపాడుకోండి. ప్రజలను కూడా హుందాగా బ్రతకనీయండి. ●




# 'దిద్దుబాటు'కి వందేళ్ళు!

వేదగిరి రాంబాబు

'దిద్దుబాటు' కథానికకు ముందు సాహిత్యంలో 62 సంవత్సరాల కృషి ఉంది కథ ఆధునికతని సంతరించుకోవడానికి. అలాగే గురజాడ అప్పారావు గారి అంతర్మథనం దాదాపు ఇరవై ఏళ్లు. ఈ విషయాన్ని ఆయన డైరీలు చెబుతున్నాయి.

అంతకుముందు ఆధునికత కేవలం వస్తువు వరకే పరిమితమైతే, వ్యవహారభాషోద్యమంలో గురజాడవారు గిడుగువారితో కలిసి పనిచేయడంతో 'దిద్దుబాటు'ని ముందు గ్రాంధిక భాషలో, తర్వాత తిరిగి వ్యవహారిక భాషలోకి మార్చారు. అంతకు ముందు వచ్చిన కథలకు భిన్నమైన శిల్పంతో కథని మలచిన తీరుతో ఆయన సంపూర్ణ ఆధునికతని కథకి ఆపాదించారు. దానితో 1910 లో 'దిద్దుబాటు' ని మొదటి ఆధునిక కథగా పరిశోధకులు నిర్ధారించారు. ఆంధ్రభారతి అనే పత్రిక మచిలీపట్నం నుంచి వచ్చేది. ఆ పత్రిక ఆధునిక సాహిత్యాన్ని బాగా ప్రోత్సహించింది. ఆంధ్రభారతి - ఫిబ్రవరి, 1910 సంచికలో మొదటి ఆధునిక కథ ప్రచురణ జరిగింది. ఆధునిక కథే కథానిక. 'దేవుడు చేసిన మనుషుల్లారా! మనుషులు చేసిన దేవుళ్లారా! మీ పేరేమిటి?' గురజాడ రాసిన మరో ఆధునిక కథ 'ఆంధ్రభారతి' ఏప్రిల్, మే, జూన్ సంచికలలో ప్రచురితమైంది. తెలంగాణా ప్రాంతంలో మొదటి ఆధునిక కథ మాడపాటి హనుమంతరావు రాసిన 'హృదయశల్యం' కూడా ఆంధ్రభారతి పత్రికలోనే వచ్చింది 1912 లో.

ఉపోద్ఘాతాలు, వర్ణనలూ లేకుండా గురజాడ వారు సరాసరి 'దిద్దుబాటు' కథానికని 'తలుపు... తలుపు...' అంటూ ప్రారంభించారు. కథానిక అలా ఓ దృశ్యంలా సాగిపోతుందిగానీ మధ్య లో రచయిత ఎక్కడా తన మాటలతో అడ్డుకోడు. కథానిక సంఘటన ద్వారా, పాత్రల ద్వారానే నడుస్తుంది.

తలుపులు తెరుచుకుంటాయి. లోపల చీకటి. లైటు కూడా వేసుండదంటూ రచయిత ప్రారంభించడంతో 'తర్వాత ఏమి జరుగుతుందో' చదవాలనే ఉత్సుకతని పాఠకులలో కలిగిస్తుంది కథానిక. 'తర్వాత తర్వాత పశ్చాత్తాప పడతాడు గోపాల్రావ్' అంటే గర్భంలో కరుణరసం. ముగింపులో ఊహించని విధంగా కమలిని నవ్వుతూ మంచం క్రింద నుంచి రావడం జరుగుతుంది.

వస్తువుని మలచడంలో కూడా గురజాడ వారు తమ ప్రత్యేకతని చూపించుకున్నారు. అప్పట్లో సమాజంలో వేశ్యాలోలత్వం ఎక్కువగా ఉండేది. అందుకని అబలలు సబలలుగా మారాలంటూ గురజాడవారు రాసిన కథానిక 'దిద్దుబాటు'. భర్త గోపాల్రావ్ మీద కోపంతో కొట్లాడడమో, పుట్టింటికి వెళ్లడమో చేయకుండా ఇంట్లోనే ఉండి, చిన్న నాటకమాడి భర్త చెంపలు వేసుకునేట్టు చేస్తుంది కమలిని. మొదట్లో రాసినప్పుడు ఈ కథానికకు 'కమలిని' అని పేరు పెట్టారు. ఒక పాత్ర పేరుని శీర్షికగా పెట్టడం కన్నా కథానిక వస్తువుకి తగ్గట్టు "దిద్దుబాటు" గా శీర్షికని మార్చారు. ఇలా కథానికకు శీర్షికని పెట్టడం కూడా అవసరమని చెప్పకనే చెప్పారు గురజాడవారు.

'దిద్దుబాటు' వచ్చి వందోఏడు... ఆధునిక కథ... కథానిక శతజయంతి. అందుకని ఈ సందర్భంలో ప్రత్యేక దృష్టితో 'దిద్దుబాటు'ని చదవడం అవసరం. చదవండి మరి...

తొలి తెలుగు ఆధునిక కథానిక

# 'దిద్దుబాటు'

## గురజాడ అప్పారావు

■

"తలుపు! తలుపు!"

తలుపు తెరవలేదు.

గదిలో గడియారం టింగుమని వొంటి గంట కొట్టింది.

"ఎంత ఆలస్యం చేస్తిని? బుద్ధి గడ్డి తిన్నది. రేపట్నుంచి జాగ్రత్తగా వుంటాను. యేంటినా చల్లా పోయి సానిదాని పాట సరదాలో మనసు లగ్నమై పోయింది. ఒక్క పాట సరదాతోటి కుదరలేదు. పాడే మనిషి మీదిక్కూడా మనసు పరుగెత్తుతూంది. లేకుంటే, నేను పోకిరి మనిషి లాగ పాట ముగిసిందాకా కూర్చోవడమేమిటి? ఏదో వొక అవకాశం కలగజేసుకుని దానితో నాలుగు మాటలు ఆడడపు ఆసక్తి ఏమిటి? యిదుగో, లెంపలు వాయించుకుంటున్నాను. రేపట్నుంచి పాటకు వెళితే వొట్టు — (వొట్టు వేసుకోరాదు. అదో నియమంవొచ్చింది కదూ!) మరి వెళ్లను, నిశ్చయం, నిశ్చయం గట్టిగా గాని పిలిస్తినట్టాయనా, కమలిని లేవగలదు. మెల్లిగా తలుపు తట్టి రాముణ్ని లేపగలిగితినా చడీ చప్పుడూ లేకుండా పక్కజేరి పెద్దమనిషి వేషం వెయ్యవచ్చు.



గోపాలరావు తలుపు చేతనంటగానే, రెక్క విడబారింది. "అరే యిదేమి చెప్మా!" అనుకొని తలుపు మెల్లిగ తెరిచేసరికి, నడవలో దీపం లేదు. నాలుగిళ్ల వాకిలి దాటి, పడక గది తలుపు తీసిచూస్తే దాన్లోనూ దీపం లేదు. చడీచప్పుడూ లేకుండా అడుగువేస్తూ మంచము దరికిపోయి, కమలిని మేలుకొని వున్నదా, నిద్రించుతున్నదా అని కనిపెట్ట ప్రయత్నించెను గాని, యేర్పరించ లేక పోయినాడు. బల్లమీద తడివి అగ్గిపెట్టె తీసి ఒక పుల్ల వెలిగించాడు. మంచం మీద కమలిని లేదు. నిశ్చేష్టుడైపోయినాడు. చేతి నుంచి అగ్గిపుల్ల రాలింది. గదినీ, అతని మనస్సునూ చీకటి కమ్మింది. వెఱ్ఱి శంకలూ, అంతకు వెఱ్ఱి సమాధానాలూ మనసున పుట్టుతూ గిట్టుతూ వ్యాకులత కలగజేశాయి. బుద్ధి తక్కువ పని చేసినందుకు తనయందో, కానరామికి కమలినియందో యేర్పరింపరని కోపావేశం కలిగింది. నట్టి వాకిట వచ్చి నిలబడ్డాడు. చుక్కల కాంతిని నౌకరుగానీ, దాసీగానీ కానరాలేదు.

తిరిగి గదిలోకి పోయి దీపం వెలిగించి, గది నాలుముఖాలా పరికించి చూశాడు. కమలిని ఎక్కడా కానరాలేదు. వీధి గుమ్మం దగ్గిరికి వెళ్లి తలుపు తెరిచి చూసేసరికి, వీధి నడుమ చుట్ట కాలుస్తూ తల ఎత్తి ఆకాశం

మీది చుక్కల్ని చూస్తూ రావుడు కనపడ్డాడు! "రామా!" అని గోపాల్రావు పిలిచాడు. రావుడి గుండె జల్లుమంది; నోట్లో చుట్ట జారి కిందపడ్డది.

"రా వెధవా!"

కాలీడ్చుకుంటూ రావుడు దగ్గర కొచ్చాడు.

"మీ అమ్మేదిరా?"

"మా యమ్మా బబూ? మా కొంపలున్నాది."

"నీ అమ్మ కాదురా! బుద్ధిహీనుడా! నా భార్య రా."

ఆ మాటతో రావుడికి మతిపోయింది. ఆలో చించుకుని అన్నాడు -

"ఎక్కడుంటారు బాబూ? అమ్మగోరు గదిలో తొంగున్నారు బాబూ!"

"యింట్లో ఎక్కడా లేదురా, వెదవ! యిల్లు విడిచి నువ్వెక్కడికి పోయినావురా?"

రావుడు మొహం ఓరజేసుకుని "నౌఖరోడికి కాల్నొస్తుంది, కడుపు నొస్తుంది, బాబూ. పెద్ద య్యోరు మరీ మరీ అప్పసెప్పి ఎల్లినారు గందా, అమ్మగారి నౌక్కర్నీ ఒగ్గేసి నిసి రాత్రేళ సానమ్మ గారి-"

రావుడివీపుమీద రెండు వీశ గుద్దులు పడ్డా యి.

"సంపేసినారు బాబూ" అని రావుడు నేల కూలబడ్డాడు.

గోపాలరావు దయగలవాడు. వెంటనే కోపం దిగజారి, పశ్చాత్తాపం కలిగింది. రాముణ్ని చేత లేవనెత్తి, వీపు నిమిరి, కోపం పట్టలేక పశు వువలె ఆచరిస్తిని" అనుకుంటూ గదిలోకి తీసు కువెళ్లాడు.

కుర్చీమీద తాను కూచుని "రామా ఏమా యెరా! యని దైన్యంతోటి అన్నాడు.

రావుడు యీ తట్టూ, ఆ తట్టూ, చూసి;

"ఏటో మాయలా వుంది, బాబూ" అన్నాడు.

"పుట్టింటిగ్గానీ వెళ్లి వుండునా?"

"అంతోరు కారనా, బాబూ? కోపగించితే నెప్ప జాల్నుగానీ, ఆడోరు సదువుకుంటే, ఏటౌ తది బాబూ?"

"విద్య విలువ నీకేం తెలుసురా, రామా!" అని గోపాలరావు మోచేతులు బల్లపైన ఆనిచ్చి; ఆ నడుమ శిరస్సు వుంచి తలపోస్తూ వున్నంత లో, ముద్దులొలికే కమలిని చేవ్రాలున వుత్తరవొ కటి బల్లమీద కనపడ్డది. పైకి చదివాడు;

"అయ్యా!"

"ప్రియుడా!' పోయి 'అయ్యా' కాడికి వొ చ్చిందా?"

"పెయ్య పోయిందా బాబూ?"

"మూర్ఖుడా! వూరుకో."

"అయ్యా! పది దినములాయె రాత్రుల నిం టికి మీ రాకయే నే నెరుగను. మీటింగులకు బోవుచుంటిమంటిరి. లోకోపకారమునకై యు ద్యమముల నిదురమాని చేయుచుంటిమంటిరి. మా చెలుల వలన నిజము మేర్చితిని. నేనింట నుండుటను గదా మీరున్న కల్లలు పలుకవలసి వచ్చెను. నేను పుట్టింటను మీ స్వేచ్ఛకు నిర్భం ధమును, అసత్యమునకు అవకాశము కలుగ కుండును. మీచే దినదినమును అసత్యమాడిం చుట కన్న మీ త్రోవకు అడ్డుగ నుండకుండుట యే, పతి మేలు కోరిన సతికి కర్తవ్యము కాదా? నేనీ రేయి కన్నవారింటికి చనియెద. సంతసిం పుడు. వెచ్చముగాక ఏ పాటి మిగిలియున్న

దయనుంచుడు."

"ఉత్తం ముగించి "నేను పశువును" అని గోపాల్రావు అనుకున్నాడు. "అదేటి బాబూ, అలా శలవిస్తారు?"

"శుద్ధ పశువును."

రావుడు అతి ప్రయత్నం చేత నవ్వు ఆచుకున్నాడు.

"గుణవతి, విద్యవతి, వినయ సంపన్నురాలు, నా చెడు బుద్ధికి తగిన శాస్తి చేసింది."

"అమ్మగారేటి సేసినారు బాబూ!"

పుట్టింటికి వెళ్లిపోయింది - గాని, నీకు తెలియకుండా ఎలా వెళ్లిందిరా?"

రావుడు రెండడుగులు వెనక్కి వేసి, "నా తొంగున్నాను కావాల బాబు! అలిగితే సెప్పసాల్ను గాని బాబు, ఆడదాయి సెప్పకుండా పుట్టినోరింటికి ఎల్తానంటే లెంపలోయించి కూకోబెట్టాలి గాని మొగోర్లాగా రాతలూ, కోతలూ మప్పితే ఉడ్డోరం పుట్టదా, బాబూ?"

"ఒరి మూర్ఖుడా! భగవంతుడి సృష్టిలోకల్లా ఉత్కృష్టతమయిన వస్తువు విద్యనేర్చిన స్త్రీ రత్నమే. శివుడు పార్వతికి సగం దేహం పంచి యిచ్చాడు కాదా. ఇంగ్లీషువాడు భార్యను 'బెటర్ హాఫ్' అంటాడు. అనగా పెళ్లాం మొగుడికన్న దొడ్డది అన్న మాట. బోధపడ్డదా?"

"నాకేం బోదకాదు బాబు?" రావుడికి నవ్వు ఆచుకోవడం అసాధ్యం కావచ్చింది.

"నీ కూతుర్ని బడికి పంపిస్తున్నాం కదా, విద్య యొక్క విలువ నీకే బోధపడుతుంది. మీ వాళ్లకంటె అప్పుడె దానికి ఎంత నాగరికత వొచ్చిందో చూడు,. ఆ మాట అలా వుణ్ణియ్యిగాని, యిప్పుడు ఇవ్వో నేనో వెంటనే బయల్దేరి చెంద్రవరం వెళ్లాలి? నే వెళ్డానికి శెలవు దొరకదు. నువ్వు తాతల నాటి నౌఖరివి. నీమీద కమలినికి యిష్టం. గనక నువ్వే వెళ్లడం మంచిది. వెళ్లి కమలినిని పిలుచుకు రా."

"శలవైతే యెల్నా, యెలతాను. ఆర్రానం టే-"

"యింద పది రూపాయలు. బతిమాలి తీసుకొస్తివట్టాయనా, మరి పది రూపాయలిస్తాను."

"సిత్తం."

"ఐతె, యేవిటి చెప్పాలో తెలుసునా?"

"యేటా, బాబూ? సెప్పకుండా లేసి రావడం మా మంచి పని సేసినారమ్మా. బాబు నా యిపు పగలేసినారు. రండి రండమ్మా అని సెప్తాను."

నన్ను క్షమించి దెబ్బ మాట మర్చిపో. కమలినితో ఎన్నడూ దెబ్బల మాట చెప్పబోకు. ఈ మాట జ్ఞాపకం వుంచుకుంటావు గదా?"

"సిత్తం"

"నువ్వు కమలినితో చెప్పవలసిన మాటలేవో, చెబుతాను బాగా చెవొగ్గి విను... పంతులికి బుద్ధి వొచ్చిందను..."

"అదేటి బాబు!"

నీకెందుకు? నే అన్న మాట గట్టిగా జ్ఞాపకం వుంచుకుని చెప్పు. పంతులికి బుద్ధి వొచ్చింది అను. మరి ఎన్నడూ సానుల పాట వినరు, గట్టి వొట్టు వేసుకున్నారు... (మరచిపోయి అన్నాను; ఆ మాట అనకు.)

యిటుపైని ఎన్నడూ, రాత్రిళ్లు యిల్లు కదలరు. ఇది ఖరారు. తెసిందా?"

రావుడు తల వూపాడు.

"ఇంకా ఏవిటంటే, గెడ్డం పట్టుకుని బతిమాలుకున్నానని చెప్పమన్నారు. దయదల్చి పంతుల లోపాలు బయట పెట్టొద్దన్నారు. (ఇది ముఖ్యమైన మాట. విన్నావా?) రెండు మూడు రోజుల్లో తప్పకుండా వెళ్లిపోయి రమ్మన్నారు. మీరు దగ్గర లేకపోవడంచేత వెఱ్ఱెత్తినట్టున్నారు. గడియో యేడు లాగ గడుపుతున్నారు. (యీ మాట మరవగలవు జాగర్త) యేం చెప్పాలో తెలిసింది గదా? ఒక్క మాటైనా మరచిపోకు."

"తెలిసింది బాబూ."

"యేం చెబుతావో నాకోమాటు చెప్ప."

రావుడు తల గోక్కుంటూ, "యేటా–యేటా – అదంత నాకేం తెల్దు బాబూ. నేనంతాను... అమ్మా నామాటినుకోండి. కాలం గడిపినోణ్ణి – పిన్నల్ని సూసినాను, పెద్దల్ని సూసినాను యిన్నరా? ఆడోరు యజమాని సెప్పినట్టల్లా ఇని వల్లకుండాలి. లేకుంటే, పెద్ద పంతుల్లోర్లాగ, సిన్న పంతులోరు కూడ సెడిపోతారు. మీ శెవుల్లో మాట. పట్టంలోకి బంగారం బొమ్మలాంటి సానెమ్మోరొస్సినారు. ఆ సానెమ్మోర్ని సూసినకాణ్ణుంచీ పంతులు మనసు, మససులా నేదు. నా మాటిని రండి. లేకుంటే మీ సిత్తం, అంతాను."

"ఓరి వెధవా!" అని గోపాలుడు కోపంతో కుర్చీ మీంచి వురికాడు.

తప్పించుకుని రావుడు వూసలాగ గది పైకి దాటాడు.

అంతలో మంచం కింద నుంచి అమృతం వొలికే కలకల నవ్వూ, మనోహరియైన నూపురముల రొద, విననయ్యెను. ●



హైదరాబాద్ త్యాగరాయగానసభలో మానస ఆర్ట్ థియేటర్స్, సాధన స్రవంతి, గానసభల ఆధ్వర్యంలో జరిగిన సభలో డాక్టర్ కాశీనాధుని నాగేశ్వరరావుని సత్కరిస్తున్న శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు. చిత్రంలో నరసింహాచారి, రఘుశ్రీ, పోతుకూచి సాంబశివరావు, దీక్షితులు ఉన్నారు.

సుందరం, నేనూ రవీంద్రభారతి మెట్ల మీద కూర్చున్నాం.

"ఏమయింది?" అడిగాను.

"ఈ చదువుకున్న వాళ్లకి పొగరెక్కువ. తల ఎగరేస్తూనే వుంటారు. ఆమె తన డిగ్రీలు, డిగ్రీల్లో రేంకులూ చెప్పుకోవటంతోనే సరిపోయింది. లాభంలేదు. నాకు పనికొచ్చే కేసుకాదు."

* * *

గుమ్మం ముందు ఎదురయ్యాడు సుందరం. చౌరస్తాకి బయల్దేరినట్లున్నాడు. మా ఇల్లు దాటుకునే వెళ్లాలి. ఆగాడు.

"చెప్పు విశేషాలేమిటి? ఏం జరిగింది నిన్న?"

"అడిగావూ... సర్లే" అంటూ లోపలికి నడిచాడు. తనకి ముందుగా నన్ను నడిపించాడు. హాల్లో కూచున్నాం.

"ఆ పిల్లకి నువ్వయితే సరయిన మ్యాచే!" ఠక్కున అని, నాలుక్కరుచుకుని... "సారీరా, మా సిస్టర్ కనకంని తక్కువ చేయటం కాదు గానీ, నీలాగానే ఆ పిల్లకీ సాహిత్యమే తిండీ నీళ్లూలా అనిపించింది."

నేనేదో దిగులుగా సుందరంకేసి చూసాను.

"నా డొక్కశుద్ధి నీకు తెలుసుగా! నా ఆరోగ్యానికి అంత మంచిదికాదు".

* * *

వాన కురిసి వెలిసింది.

బూడిదరంగులో వన్నెలుపోతోంది ఆకాశం. గాలేమో తన కమ్మదనం, చెమ్మదనం చూపుతోంది. నేల – ముక్కుకి వింత వింత గంధాలు చిలకరిస్తోంది. వాతావరణం శుభశకునాలిస్తోంది.

నే వెళ్లేసరికి చొక్కా ఇస్త్రీ చేసుకుంటున్నాడు సుందరం.

"కాయా, పండా భాయ్?" స్టూల్‌మీద కూచున్నాను.

'కాయాకాదు, పండూకాదు. పచ్చిగడ్డి' అన్న భావంతో కరుకుగా చూశాడు. "భలే రిఫరెన్స్‌రా నాయనా. తండ్రి తన బిజినెస్ చాకచక్యానికి తనే సంతోషంతో ఊగిపోతున్నాడు. కూతురేమో ఏడుతరాల గోటునీ, గొప్పనీ చూపుకుంటోంది, చెప్పుకుంటోంది. ఆ ఇంట్లో అందరికీ వాళ్ల వంశం ఘనతమీదే దృష్టి. నేతులు తాగిన మూతులు చూసుకుని పెదవులు చప్పరించుకుంటున్నారు" అని ఒక క్షణం ఆగేడు. ఐరన్ బాక్స్ స్విచాఫ్ చేసి పక్కన పెట్టాడు. ఫ్లాస్క్‌లో కాఫీని గ్లాసుల్లో పోసి నాకోటిచ్చి, తనూ సిప్ చేస్తూ కూచున్నాడు.

"వాళ్లతో నే చావలేనే. మునిగిపోతున్న నావ గుర్తుకొచ్చింది" అన్నాడు ముక్తాయింపుగా.

* * *

ఆదివారం కనకంకీ, నాకూ కూడా తీరిక రోజు. సుందరం పెళ్లి గురించిన చర్చ! సాయంత్రం దాకా అదే విషయం నలుగుడుపడింది. ఆరవుతోంది. మళ్లీ కాఫీలయినై. మాటల్లోనే వచ్చాడు సుందరం. కనకం కాఫీ ఇచ్చింది. తాగాడు. కాసేపు న్యూస్ పేపర్లన్నీ ఏవిధంగా వ్యూస్‌పేపర్లయిపోతున్నాయో సోదాహరణ ప్రసంగం చేశాడు.

'అదిసరేగానీ, నీ వెడ్డింగ్ బఫే మాకు తగిలేట్టు లేదేమయ్యా' అంది కనకం నవ్వుమొహంతో.

నేలమీద ఏదో వెతుకుతున్నట్లు చూస్తూ

చెప్పసాగేడు సుందరం..."ఆ పిల్ల బంగారు శలాకలా వుంది సిస్టర్. నిజంగా లిల్లీపూవులా వుంది. రంగు విచ్చిన పచ్చిపసుపే. కనుముక్కు తీరు చూసి 'అందమంటే ఇదే' అని సర్టిఫికెట్ ఇచ్చేయవచ్చు."

"ఐసీ... అయితే ఇంకేం? నీ మనసుదోచే పిల్ల ఇన్నాళ్లకి దొరికిందన్నమాట. చెప్పవేం మరి శుభవార్త?"

నేనూ "కంగ్రాట్స్" అన్నాను వెంటనే. నాకు చాలా ఆనందం కలిగింది. కనకం మొహంలో ఉత్సాహం విరిసింది. నేను సరదాగా ఈలవేశాను అతని కళ్లల్లోకి చూస్తూ.

మా ఇద్దరివైపూ విచిత్రంగా చూస్తున్నాడు సుందరం. ఇంతకాలానికి మా సుందరం ఒక ఇంటివాడు కాబోతున్నందుకు 'తపము ఫలించిన శుభవేళా' పాట స్ఫురించింది. దాని పల్లవిని కూనిరాగం తీశాను.

"వాళ్ల కుటుంబం కూడా బాగుంది. అన్నీ అనుకూలంగా ఉన్నాయి. అయితే..."అని ఆగేడు.

మేమిద్దరమూ ఆతృతగా అతనివైపు చూశాం.

"అదట్టా ఉంచండి. నే చెప్పేది శ్రద్ధగా వినండి..."

కనకం సంగతేమో గానీ నాకు మాత్రం పెద్ద సస్పెన్స్‌గా వుంది. తొందరగా వుంది. ఆరాటంగా వుంది. కుర్చీలోంచి లేచి నిమ్మళంగా పచార్లు చేయసాగేను.

సుందరం తన కథ సాగించాడు. "మనిద్దరిలాగే ఇద్దరు మిత్రులు. బాగా క్లోజ్. ఎ, బి - అనుకుందాం. ఇద్దరూ ఒకేచోట ఉద్యోగం చేస్తున్నారు. ఒక శలవురోజు సాయంత్రం ఇద్దరూ బి ఇంట్లో కలుసుకున్నారు. బి - ఎ ని ఒక రోడ్‌కి తీసుకువెళ్లాడు. ఆ రోడ్డులో అన్నీ మధ్యతరగతి వాళ్ల ఇళ్లు. అగ్గిపెట్టెల్లా, రైల్వే కంపార్ట్‌మెంట్స్‌లా మూడేసి గదులు. ముందు వాకిలి. తలుపు తీస్తే ఇల్లంతా బజారుపాలే. సాధారణంగా ఈ ఇళ్లల్లోని ఆడవారికి సాయంత్రం పనిపాటలు పూర్తి చేసుకుని వచ్చి వీధి అరుగుమీదో, గుమ్మం పక్కగానో కూచుని ఉబుసుపోక కబుర్లు చెప్పుకోవటం ఒక అలవాటు."

సుందరం ఆగేడు. 'చెప్పనా?' అన్నట్టు చూశాడు.

"బాగుంది. చెప్పు..." అంది కనకం.

ఎ ని తీసుకుని ఈ వీధికొచ్చాడు బి. ఓ గుమ్మం ముందు - రోడ్‌కి అవతలివైపు ఆగేడు. ఎ కి ఏమీ అర్థంకాలేదు. బి చెప్పాడు, "ఆ గుమ్మంలో యువతిని చూడు. ఎంత అందంగా వుందో" చూపాడు. "నిజంగా కళ్లుచెదిరే అందం కదూ?"

బి చూపిన యువతిని చూశాడు ఎ. అవాక్కయ్యాడు. అప్రయత్నంగా "అవును... రంభా రాగిణీరత్నమేఖలలా వుంది. గ్రేట్..." అన్నాడు ఎ. విచ్చిన కన్నులతో ఆమె సౌందర్యాన్ని ఆస్వాదిస్తున్నాడు బి.

"ఎలాగైనా ఈ పిల్లని లైన్లోపెట్టాలి. ఒక్కసారన్నా ఆమెని కూడని జన్మ వృథా" అని తన్మయత్వంతో... మురిసిపోతూ... అనేక విధాలైన వర్ణనలతో ఆమె గురించి చాలాసేపు మాట్లాడాడు బి.

ఆ కబుర్లే చెప్పుకుంటూ వెళ్లిపోయారిద్దరూ.

బి కి రోజూ ఇదే కార్యక్రమం! ఆఫీస్ ఉన్న రోజుల్లోనూ సాయంకాలాలు మనసూ,




శరీరమూ అటే పరిగెత్తేది. ఆమె విరహంలో తపించసాగేడు.

ఇంతకీ...

ఓ నెల తర్వాత – ఒకనాటి చల్లని సంజె వేళ, "ఆమె నా భార్యేరా... అద్దె కొంపగదా. ఇల్లు మార్చేను. ఆ తర్వాత నువ్ మా ఇంటికి రాలేదు" అన్నాడు ఎ.

పాపం బి! మొహాన్న కత్తివాటుకి నెత్తుటి చుక్క లేదు!"

చాలాసేపు నవ్వుతూ ఉండిపోయాడు సుందరం. ఆ తర్వాత చెప్పాడు 'భార్యా రూపవతీ శత్రు:' అన్నారు. అంత అందగత్తెని నేను భరించలేను. అదలా వుంచి రేప్పొద్దున మా సిస్టరే అనగలదు – 'కాకి ముక్కుకు దొండపండు' అని అంటూ మళ్లీ నవ్వాడు.

క్షణం ఆగి తాను చెప్పిన కథకి ముక్తాయింపుగా "ఇంతకీ ఆయువతెవరో చెప్పలేదు కదూ. ఆమె మా అమ్మే. ఎ – మా నాన్న. నేను పుట్టక ముందు జరిగిన కథ. అమ్మానాన్నా మంచి మూడ్‌లో ఉండగా ఈ జోక్ చెప్పుకుని నవ్వుకునేవాళ్లు!"

"అయినా అట్టాంటి ఆడపిల్లలు ఇల్లంతా వెలుగులు చిమ్ముతుంటేనూ, ముత్యాలు వెదజల్లుతుంటేనూ – మనపని స్వీపరుద్యోగమైపోతుంది బాబూ" అని గొల్లున నవ్వి, అందుకనే "వద్దని చెప్పేశాను" అన్నాడు.

అతని ధోరణికి నేనూ, కనకం మొహమొహాలు చూసుకున్నాము. మౌనం గంభీరంగా ఆ గదినాక్రమించింది.

చాలాసేపయిన తర్వాత సుందరం అన్నాడు "ఆపిల్ల రూపం మాత్రం రాత్రిళ్లు కొంచెం ఇబ్బంది పెడుతోందనుకో... ఫర్వాలేదు... కొన్నాళ్లు గడిస్తే... నెమ్మదిగా మర్చిపోతాను"

నా వరకూ నాకయితే సుందరం పెళ్లికి ఏ

ద్వారం తెరిచివున్నదో అర్థం కాలేదు!

* * *

ఇదంతా, పాతకేళ్లనాటి మాట! కాలం – ముఖాలమీద ఇంటూ మార్కులూ, ప్లస్ మార్కులూ చేస్తూ వెళ్లిపోతోంది!

నిన్నమొన్న జరిగినట్టే అనిపిస్తోంది. ఆఫీస్ కాన్ఫరెన్స్‌కి నాలుగురోజులు బెంగుళూరు వెళ్లాను. మధ్యలో వచ్చింది ఆదివారం. సుందరాన్ని చూడాలని ఏర్పాటు! అతని ఉద్యోగం అక్కడే!

పగలు పన్నెండు గంటలు. పెద్ద అపార్ట్‌మెంట్ కాంప్లెక్స్. మూడొందల ఫ్లాట్స్. క్యూబ్లాక్. ఫిఫ్త్‌ఫ్లోర్.

తీరిగ్గా కూచుని టీవీ చూస్తున్నాడు సుందరం. మొహం చాటంత చేసుకుని, లేచి సాదరంగా చేతులు పట్టుకుని ఆహ్వానించాడు.

కాఫీ ఇచ్చాడు. తాగి కబుర్లలో పడ్డాం.

పనిపిల్ల కేరియర్ పట్టుకొచ్చింది. ఆమెకి చెప్పవలసినవి చెప్పి, పంపించి, ముందు తలుపు వేసి, వచ్చి కూచున్నాడు.

కనకం యోగక్షేమాలు, నా ముగ్గురు పిల్లలు విశేషాలు, వివరాలూ సాగుతున్నె.

సోఫాలోంచి లేచాడు సుందరం. హాల్లో నిమ్మళంగా పచార్లు చేస్తూ చెప్పాడు... "జీవితాన్ని తోడులేకుండా ఇంక లాగలేననిపిస్తోంది మూర్తీ. పెళ్లి చేసుకుందామనే నిశ్చయానికొచ్చాను."

సద్దాంని ఉరితీస్తున్న వార్త కూడా ఇంత షాకివ్వలేదు నాకు. దిగ్భ్రమతో చూసాను.

"అవును. ఆశ్చర్యపోకు. ఎనీవే మేరేజ్ ఈజ్ ఎ లాటరీ. టిక్కట్ తీద్దామని నిర్ణయించుకున్నాను. బెటర్ లేట్ దేన్ నెవర్!" అన్నాడు.

మూగగా చూస్తూ ఉండిపోయాను!

* * *

హైదరాబాద్ చేరాను. తిరుగు ప్రయాణమంతా సుందరం గురించిన ఆలోచనలే. నేను ఇంటికెళ్లేసరికి టెర్రెస్ మీద వడియాలు పెడుతోంది కనకం. సుందరం గురించి చెప్పాను.

నిర్లిప్తంగా విన్నది. "వచ్చే ఎండా, పోయే ఎండగా వుంది. వానొస్తుందో ఏమో... తీరా ఆగి ఆగి ఇవ్వాళ పెట్టుకున్నా నీ పని!" అని తనను తాను నిందించుకుంటున్న ధోరణిలో పైకే చెప్పుకుంది.

ఎక్కడో చదివిన వాక్యం గుర్తుకొచ్చింది – "ఆలోచన విర్రవీగేటట్లు చేస్తుంది. బుద్ధి హెచ్చరికలు చేయాలి!"

* * *

మరో నెల తర్వాత

ఆ రోజు,

నేను కేంటీన్‌లో కాఫీ తాగుతున్నాను.

సుందరం ఫోన్ చేశాడు.

పెళ్లి ఆహ్వానం?

"అప్పుడు నాకు ఎవ్వరూ నచ్చక నేను వద్దనుకున్నాను. ఇప్పుడు వాళ్లు నన్ను వద్దంటున్నారు. చిత్రమైన సన్నివేశం కదా. ముగ్గురు నలుగురైపోయారు. ఇక ఈ కౌంట్ పెరుగుతుంది. శరీరం మీదికి యాభైరెండేళ్లు వచ్చినయ్ గదా!" అని గలగలా నవ్వేడు!

దిక్కులు చూస్తున్నాను. ఎదురుగా గోడమీద – ఏడ్చి ఏడ్చి అలసిన పిల్లవాడి ఫొటో! కానీ అది చాలా పాతబడి, మాసిపోయి వుంది!!! ●

# హంతకుడు

అది పాములాంటి రాత్రి!

చీకటిని మృదువుగా మింగుతోంది.

ఏదో భరించలేని బాధ ఒకటి అక్కడ ఫ్యాక్టరీ చుట్టూ పారాకాస్తోంది. ఆ ఫ్యాక్టరీలో యంత్రాలు మరొక దేశం బారినపడినట్టు ఘీపెడుతున్నాయి. నైట్‌షిఫ్ట్‌లో అందులో సుమారు యాభైమంది కార్మికులు తమ డ్యూటీని మోస్తున్నారు తరుముకొస్తున్న ప్రయివేటీకరణ వేటుకి భయంభయంగా.

దానిని వర్క్‌షాపు అనవచ్చు. ఫ్యాక్టరీ అనవచ్చు లేదా గారేజీ అనవచ్చు. అది ప్రవేటు వాళ్లది కాదు. ప్రభుత్వానిదే. లౌకికవాదానికే ఇవ్వాలి ప్రాధాన్యత. కాని అది కులపరమైన మతతత్త్వ ఊబిగుంట.

యంత్రాలు తమపని తాము చేస్తుంటే, అదంతా ఓ దేవత కృపతోనే జరుగుతుందని కొందరి అమాయకపు మెకానిక్కుల నమ్మకం. సాంకేతిక విజ్ఞానం గురించి అవగాహన లేదు. ప్రశ్నించే తెలివితేటలు వాళ్ల సీనియర్స్ ఎప్పుడూ నేర్పలేదు. ఉమ్మడి మతపిచ్చి. స్వంతభావాల్ని బయటకు రానీయకుండా అణచివేసే తత్త్వం గల మనుషుల ముఠా అది.

గారేజీలో ఎప్పుడో చిన్న దుర్గాదేవి పటం పెట్టి పూజచేసుకున్న మెకానిక్‌ల ఆరాధ్యదేవత ఇపుడు ఓ దేవతా విగ్రహంగా మారింది. చిన్న మందిరంలో పెద్ద పూజలు. పూజా కార్యక్రమాలకి ఓ కమిటీ కూడా ఉంది. ఆదో మానవ ఛాందస రిలిజియస్ నెట్‌వర్క్.

ఉద్యోగం బాగా సాగాలంటే యాజమాన్యం కార్మికచట్టాల్ని పరిరక్షించాలి. కార్మికునికి, అతని కుటుంబానికీ రక్షణ బాధ్యత యాజమాన్యం వహించాలి. ఈలోగా ఎక్కడ్నుంచో ఓ దేవత రంగప్రవేశం చేయాలి. ఆ దేవత కూడా వాళ్లని రక్షిస్తూ కాపాడుతూ ఉండాలి. ఇంతకీ వాళ్లని ఆదుకోవలసింది ప్రభుత్వ యాజమాన్యమా లేక గారేజీలో దేవతా అనేది తేలని సమాధానం.

దసరా ఉత్సవాలు గారేజీలో జరుగుతాయి.

రోజుకో కార్మికుని భార్య వచ్చి భారీ పూజలు చేసి, ప్రసాదాలు పంపిణీ చేయడం అక్కడో సాంప్రదాయంలాంటి సెంటిమెంటు. సెంటిమెంట్ అంటే ఆలోచనారహితమైన భావోద్వేగమే అని చాలా తక్కువమందికి తెలుసు.

ఈ సాంప్రదాయం తక్కిన మతాల ఉద్యోగులైన ఖాన్‌భాయ్‌కి, లాజర్ బాబాయికీ లోలోన చాకుతో కెలికినట్టే ఉంటోంది. అది మతవ్యవస్థ. తప్పదు. మనుషుల్ని కాల్చుకుతింటోంది.

* * *

షిఫ్ట్ సూపర్‌వైజర్‌కి గారేజీలో జరిగే తంతంగమంతా తెలుసు. పై అధికార్లకు ఇంకా బాగా

తెలుసు. వాళ్లకు డిగ్రీలున్నాయి. కాని ఆధునిక జ్ఞానం బుర్రకింకా చేరలేదు.

నవరాత్రుల దేవీపూజల అనంతరం దుర్గామాతకు భరించలేని దాహం వేస్తుంది. దానికి నీళ్లూ పాలూ చాలవు. రక్తం కావాలి. పాతమానవుడు దేవతలకు నరబలి ఇచ్చేవాడు. మనిషికి కాస్త నాగరికత అబ్బిన తర్వాత జంతుబలీ ప్రారంభించాడు. అందులో తప్పొప్పుల గురించి ఆలోచించే జ్ఞానం శూన్యం.

సెక్యూరిటీ సెక్షన్ ముందునుంచే రెండు మేకపోతులు లాక్కొచ్చారు. అటువంటి సమయాల్లో సెక్యూరిటీ వాళ్లు సైలెన్స్ అయిపోవాలి. కళ్లుమూసుకోవాలి. అంతా సానుకూల న్యాయ వ్యవహారం.

బ్లాక్‌స్మిత్ విభాగంలో ఇనపబద్దీల్ని సునాయాసంగా వంచెయ్యగల పనిగాడు బట్టతల గంగరాజు. పదంగుళాల పట్టాకత్తికి బాగా పదును పెట్టాడు. అగ్గికొలిమిలా మండుతున్నాడు.



చారెడు కుంకుమ నొసటికి రాసాడు. నల్లనిక్కరు మీద ఎర్రని నూలు టవలు బిగించి కట్టాడు. బానలాంటి అతని పొట్ట కొవ్వుతో ఊగిసలాడు తోంది.

బొడ్లోంచి చిన్న బాటిల్ తీసాడు. దాని మూ తని పళ్లతో ఫట్‌మని కొరికి, థుపుక్కున ఊసా డు. అందులో విస్కీ గటగటా తాగేసి ఖాళీ సీసాని ప్రహారీగోడ అవతలకి విసిరాడు. అది ఏ రాయి మీద పడిందోగాని ఆఖరిసారిగా ఘొల్లుమంది.

రెండు మేకపోతుల్ని తోసుకుంటూ, గెంటు కుంటూ తీసుకొచ్చారు గంగరాజు దగ్గరికి.

గంగరాజు కళ్లతో సైగచేసాడు తతిమ్మా కార్యక్రమం త్వరగా కానిమ్మని.

మేకపోతుల నెత్తికి పసుపూ కుంకుమా పులి మారు ఆఖరి సన్మానంకి సమాయత్తంకామని.

ఆ తంతు ఎన్నికల సమయంలో పేదవాడి ఎండిన కడుపుమీద చల్లని గంధం పూసిన వాగ్దానం తంతులా ఉంది.

"మాసం వాటాలయ్యేసరికి తెల్లార్తాది. తం తులు మాని పని యెంటనే కానియ్యండెహె!" అన్నాడు హెల్పర్ సూర్యనారాయణ.

ఓ మేకపోతును దుర్గాదేవి విగ్రహం ముం దుకి లాక్కొచ్చారు. అది యెగిరిపడుతుంటే కొమ్ముల్ని విరగదీసి దానిని తమ కాళ్ల మధ్య బిగించి ఇద్దరు పట్టుకున్నారు.

గంగరాజు "జై దుర్గామాతా" అంటూ గర్జి స్తూంటే అతని నోట్లో పళ్లు కండలుపీకే పులి కోరల్లా కనిపించాయి. ఆ చుట్టూ ఉన్నవాళ్లు మూర్ఖులైన ఆటవికుల్లా కనిపించారు.

మేకపోతు మెడని కస్సున నరికిపారేసాడు గంగరాజు ఏదో మహత్తులా.

మేకపోతు రక్తం చెళ్లున చిమ్మి ఎర్రని మంటలా నేలమీద పాకింది. మేకపోతు తల దుర్గముందు ఉంచాడు ఓ వర్కరు భక్తితో.

దండాలెట్టుకున్నారు. కొందరు రక్తంతో బొట్లు పెట్టుకున్నారు.

భూతదయకి అర్థం ఆ చచ్చిన మేకతో పాటు చచ్చింది.

ఈ తంతంతా చీకట్లో నిలబడి చూసాడు ఎలక్ట్రీషియన్ శామ్యూల్.

రెండో మేకపోతు తల కూడా తెగింది.

అటువేపు వచ్చి అంతా పరీక్షగా గమనిస్తు న్న ఫిట్టర్ హుస్సేన్ అదిచూసి, గబగబా వెనక్కి వెళ్లాడు.

చాలాకాలంగా గారేజీలో సాగుతున్న మాతాధిపత్యానికి బ్రేక్‌వెయ్యాలి. అదే వాళ్ల ఉ ద్దేశ్యం అందుకు చెయ్యాల్సింది చేసిపారెయ్యాలి.

## గమనిక

*సాహిత్య కార్యక్రమాల ఫొటోలు ప్రచురణార్థం పంపించేటపుడు ఆ కార్య క్రమం జరిగిన తేది, స్థలం తప్పక ఉదహరించాలి. ఈ వివరాలు లేకుం డా వచ్చే ఫొటోలు ప్రచురణకు స్వీక రించబడవని గమనించగోర్తాం.*

**- ఎడిటర్**




అదే వాళ్ల ఆలోచన.

* * *

తెల్లవారింది.

గంగరాజుతో పాటు గారేజీలో పదిమంది కార్మికుల శవాలు చిందరవందరగా పడున్నాయి.

గుడిలో దుర్గాదేవి అలానే కళ్లప్పగించి చూస్తోంది.

ఇనపరాడ్లు - కర్రలు - చాకులు - కత్తులు!

మతం మతంతో, మనిషి మనిషితో శాంతియుతంగా బతకడానికి రాసుకున్న ఇండియన్ రిపబ్లిక్‌లో మతచాంధసత్వం!

ఘోరమంతా క్షణాలమీద హెడ్ఆఫీస్‌కెళ్లిపోయింది. ఆఫీసర్లు రయ్యిన వచ్చిపడ్డారు.

పోలీస్ డియస్పీ వచ్చాడు.

గంగరాజు, ఎలక్ట్రీషియన్ శామ్యూల్, ఫిట్టర్ హుస్సేన్ శవాలతో పాటు ఇంకా కొందరి శవాలు పడిఉన్నాయి.

గారేజీ వర్కర్స్ కాకుండా ఎవరో పైవాళ్ల శవాలు కూడా అక్కడ ఉండడంతో, ఉమ్మడి దాడి జరిగిందని తెలిపోయింది.

మతపరమైన మానవబాంబులు!

మతపరమైన మానవదాడులు!

"అక్కడ జరిగింది మనుషుల యుద్ధంకాదు. దేవుళ్ల యుద్ధం" అన్నారెవరో కాస్త విజ్ఞతతో.

మీడియా పరుగెత్తుకొచ్చింది.

మర్నాడు ఓ వార్తాపత్రిక "మతం చేసిన మారణకాండ" అని రాస్తే -

మరో పత్రిక "ఈ ఘోరానికి శిక్షేమిటి?" అని ప్రశ్నిస్తే -

ఇంకో పత్రిక "దేవుడే హంతకుడు" అని నేరస్తుడ్ని నిర్ధారించేసింది. ●




# డొక్కాదుల సుబ్బమ్మ

కాలింగ్‌బెల్ నొక్కడంతోనే ఓ వయసు మళ్లినావిడ తలుపు తీసి, ఎవరు? ఎందుకొచ్చావ్? ఎవరు కావాలి? అన్నట్టుగా చూసింది.

"నేను సురేష్ ఫ్రెండ్ నరేంద్రని... మాకు పాప పుట్టిందని, స్వీట్స్ యివ్వాలని వొచ్చాను..." ఉత్సాహం, సంతోషం కల్సిన ముఖంతో ఆమెను చూస్తూ అన్నాడు.

ఆత్మీయులతో సంతోషాన్ని పంచుకుంటే రెట్టింపవుతుంది.

"కూర్చుందువు రా నాయనా... మా అబ్బాయి సురేష్ ఇంకా రాలేదు..." అందామె.

అతని మాటలు విన్న సురేష్ భార్య ఇందిర ఆశ్చర్యంగా అతన్నే చూసింది కాసేపు.

"జోక్ చేసేందుకు చెప్తున్నట్టున్నావ్... ఆడపిల్ల పుడ్తే... స్వీట్లివ్వడం... నిన్నే చూస్తున్నాం. ఎప్పుడూ... ఎవ్వరూ... యిట్టా యిచ్చినోళ్లని ఎక్కడా చూళ్లేదు..." అందామె కళ్లు చిట్లించి

# అత్తగారూ జిందాబాద్

చూస్తూ.

డైనింగ్ టేబిల్ తుడుస్తున్న విమలమ్మ, 'అవు నవునక్కా...' అంది సమర్ధిస్తూ.

లోపల్నుంచి వచ్చిన ఐదేళ్లు, మూడేళ్లున్న పాపలిద్దర్నీ చూసి, వీళ్లు మీ పిల్లలే కదా' అడిగాడు నరేంద్ర.

"ఆ..." అంది ఇందిర.

"ఊ... మావాడి పాలిటికి తయారైనారు..." ఆగి ఆగి దీర్ఘం తీసింది సురేష్ తల్లి.

ఇద్దరాడపిల్లల పుట్టుక సమయంలో... తప్పంతా తనదే అయినట్టు, జరగరాని ఘోరం జరిగిపోయినట్టు నానా గొడవా చేసింది అత్తగారు. ఓపక్క సిజేరియన్... మరోపక్క స్కానింగ్‌లో ఆడపిల్లని తెల్సినపుడే అబార్షన్ చేయించుకోలేదని ఎన్నెన్ని మాట్లాడిందో గుర్తొచ్చి, కడుపులో దేవినట్లనిపించింది ఇందిరకు.

వాళ్ల మొఖాల్లో ఫీలింగ్స్ చూసి, అయోమయంలో పడ్డాడు నరేంద్ర. నా గురించి వాళ్లు పొరబడ్తున్నారా... లేక నేనే వాళ్లగురించి పొరబడ్తున్నానా... ఎటూ తేల్చుకోలేక అతనిలో ఉన్న ఆనందం ఆవిరైపోయింది.

"జ్యూస్ తాగండన్నయ్యా..." యిచ్చింది ఇందిర.

"మా అబ్బాయికి చెప్పి, మీ యింటికొస్తాం చూడ్డానికి..." అంది సురేష్ తల్లి.

"తప్పకుండా రండి" అంటూ బయటికి వెళ్లిపోయాడు నరేంద్ర.

బైట స్కూటర్ స్టార్ట్ చేస్తున్న నరేంద్రకి 'నిజంగా కూతురు పుట్టిందనే స్వీట్లివ్వడానికొచ్చాడా... ఎర్రిబాగులోడులాగున్నాడు...' విమలమ్మ మాటలు విన్పించడంతో ఖంగుతిన్నాడు నరేంద్ర.

వాళ్లలా అనుకోవడంలో దాగున్న విషయం ఏమిటి? అర్ధమేమైఉంటుంది? నన్ను ఎర్రిబాగులోడనడం కంటె... వీళ్లే వెర్రిబాగులోళ్లనడం సరిపోద్ది...' అనుకోవడంతో స్కూటర్ స్పీడందుకొంది.

అర్ధంలేని మాటలు మాటాడ్డం కొంతమంది ప్రవృత్తా... లేక గొప్పగా తమకు తామే భావించి మాటాడ్తారా... ఏమైనా భలేవాళ్లు... అనుకుంటూ యిల్లుచేరాడు నరేంద్ర.

సాయంత్రం ఇంటి ముందు కారాగిన శబ్దం విన్పడ్డంతో... చూడగా... పొద్దున చూసిన సురేష్ కుటుంబం కారులోంచి దిగింది. నేరుగా పాప మంచం చుట్టూ చేరారు.

"ఉక్కపోస్తుంటే... పసిపిల్లకు యివెందుకు?" అంటూ విమలమ్మ బిడ్డపై ఉన్న గుడ్డ తీసింది.

"పుట్టీపుట్టక ముందే... ఈ డ్రాయర్లు బిగిం

చడం మంచిదికాదు..." అంది సురేష్ తల్లి.

"బిడ్డ వెయిట్ ఎంతుంది? చూసారా? ఆరోగ్యంగా ఉంది కదా..." అంది ఇందిర.

"ఏరా నరేంద్రా...పొద్దున మావాళ్లని ఆశ్చర్యంలో ముంచేసావటగా... ఆడపిల్ల పుట్టిందని చెప్పడం... ఇంద్రజాలం ఇంట్లో సంగతిక్కూడానా..." సురేష్ మాటలకి నరేంద్ర ఉలిక్కిపడ్డాడు.

"ఏమిట్రా నువ్వనేది...! నేను ఇంద్రజాలికున్ననేది నిజమే... ఇప్పుడేం చేసాను?

"అదేరా... అబ్బాయి పుడ్తే... అమ్మాయని చెప్పడం... స్వీట్లివ్వడం..."

"మేమూ అలాగే అనుకున్నాం. ఎటూ మాట్లాడలేక మౌనంగా ఉండిపోయాం" అన్నారు అంతకుముందు వచ్చి కూర్చున్న యింకో ఫ్రెండ్‌కి సంబంధించిన యిద్దరాడవాళ్లు.

నరేంద్ర చేయరానిదేదో చేసినట్టు... అందుకు అందరూ కూడబలుక్కుని నిందించడం చూసి... నరేంద్ర, భార్య ఆశ్చర్యంతో వొకర్నొకరు చూస్తూ కళ్లతో మాట్లాడుకున్నారు.

"పాప పాస్‌పోసింది" అంటూ డ్రాయర్ లాగేసింది నరేంద్ర భార్య.

అందరి కళ్లూ పాపను మరీ మరీ పరిశీలించాయి.

'ఆడపిల్ల పుట్టిందని స్వీట్లు పంచడం వింతల్లోకెల్లా వింతగా తోచిందా? తమ భావన కంటే ఎదుటి వాళ్ల భావనలో మార్పుంటే అది అసహజమౌతుందా? ఎక్కువమంది అనుమానిస్తే



*30-11-2008 ఆదివారం విజయవాడ చంద్ర రాజేశ్వరరావు స్మారక గ్రంథాలయంలో జరిగిన సిహెచ్.వి. సుబ్బారావు స్మారక రాష్ట్రస్థాయి కవితల పోటీ బహుమతి సభలో సభాధ్యక్షులుగా పాల్గొని 2007 మానస అవార్డు కవితా సౌరభాలను ఆవిష్కరిస్తున్న నాస్తికకేంద్ర అధ్యక్షులు లవణం, ఆంధ్రా యూనివర్శిటీ ప్రొఫెసర్ వెలమల సిమ్మన్న, విశాలాంధ్ర మాజీ సంపాదకులు సర్వజిత్ మరియు అకాడమి అధ్యక్షులు సిహెచ్.వి.ఎస్. బ్రహ్మానందరావు తదితరులు.*



నిజం అబద్ధమౌతుందా? వీళ్లభిప్రాయంబట్టి అమ్మాయి అబ్బాయిగా మారదు కదా... ఆడ పుట్టుక హర్షించదగింది కాదా... ఆడజన్మ నిష్ప్రయోజనమా? నిష్ఫలమా?' అలా ఆలోచన్లు గజిబిజిగా అల్లుకున్నాయి నరేంద్రలో.

'వివిధ స్థాయిల్లో ఆడవాళ్లందించే మమతానురాగాల్ని మనస్ఫూర్తిగా అందుకోవడాన్కి అదృష్టవంతులై ఉండాలి. నిష్కపటులై ఉండాలి. నిష్కల్మషులై ఉండాలి. స్త్రీలో ఉన్న లాలిత్యం, ప్రేమ, వాత్సల్యం గుర్తించగల్గిన వారికే ఆడ పుట్టుక శుభవార్త'.

'మనిషిలో సంతోష సౌరభాలు నింపాలన్నా... వొంపాలన్నా... అది స్త్రీవల్లనే అవుతుంది. ఏ బిడ్డనయినా బాధ్యతగా, ఉన్నతంగా తీర్చిదిద్దడం ముఖ్యం. ఆడపిల్లలు తెలివితక్కువగా ఉండరు. ఈ కాలంలో కలెక్టర్లు, డాక్టర్లు, లాయర్లు ఇంకా చాలాచోట్ల ఆడవాళ్లున్నారాయె..'

అలా వొకరిమాట మరొకరందుకొన్నారు ముందుగా వచ్చి, మేడమీద నుంచి దిగివచ్చిన నరేంద్ర కొలీగ్స్.

'ఆడవాళ్లు తక్కువనే భావనతో మాట్లాడ్డం... ఊహించుకోవడం... అన్నీ స్వయంకృతాపరాధాలే... అవే నిల్చిపోయాయి జనాల్లో...' అంటున్నతన్ని చూసారు.

'బిడ్డను బిడ్డగా బాధ్యతగా పెంచడంలో ఖర్చూ ఒక్కలాగే వుంటుంది...' అంది నరేంద్ర భార్య.

మగబిడ్డను కంటేనే భార్యను ప్రేమగా చూసుకొనే భర్తలు, అత్తలు ఉన్నందువల్లే అదే ఆనవాయితీ అయివుంటుంది. అత్తగార్లంతా కొడుకుల మనసుల్లో కోడలి పట్ల అభిమానం, మన్నన నాటగలిగితే సమస్యలన్నీ తొలుగుతాయి. అలా చేసిన వాళ్లకు నేనే చెప్తాను "అత్తగారూ జిందాబాద్" అని నవ్వింది ఉమెన్ డెవలప్‌మెంట్ కోర్సు చేస్తున్న 'నవ్య'.

'అలా జరగాలి... జరగాలి...' అనుకొంది ఇందిర అందర్నీ చూస్తూ. ●

# జీవితం కథ కాదు

"రఘురామ్‌గారూ, మిమ్మల్ని ఎడిటర్‌గారు పిలుస్తున్నారు!"

ఆ రోజు పోస్టులో వచ్చిన రచనల్ని ఫైల్ చేస్తున్న సబ్ ఎడిటర్ రఘురామ్ ప్రూఫ్‌రీడర్ చలపతిరావు గొంతు వినగానే ఫైల్ మూసి సీట్లోంచి లేచాడు. ఎడిటర్‌గారి కేబిన్ వైపు నడిచాడు. అదే సమయంలో ఎడిటర్ గారిని కలిసి వెలుపలికి వచ్చిన ప్రముఖ రచయిత గోపీనాథ్ రఘురామ్‌ని చూసి పలకరింపుగా నవ్వాడు. బదులుగా తనూ నిశ్శబ్దంగా నవ్వాడు రాఘురామ్.

ఎడిటర్ వామనరావుగారు చాలా నిరాడంబర వ్యక్తి. ఎంతో స్నేహశీలి. ప్రతి ఒక్కరినీ ఎంతో అప్యాయంగా పలుకరిస్తుంటారు. అందుకే ఆయనంటే అందరికీ అంత గౌరవం.

కేబిన్ డోర్ కొద్దిగా తెరచి 'మే ఐ కమిన్ సర్!' వినయంగా అడిగాడు రఘురామ్.

ఆ వారం సంచికలో ప్రచురించవలసిన కథలను ఏరుతున్న ఎడిటర్‌గారు ఫైల్లోంచి తల ఎత్తకుండానే 'రావోయ్, రా!' అన్నారు తన సహజ శైలితో. లోనికి వచ్చాడు రఘురామ్.

'అలా కూర్చో!' – ఎడిటర్‌గారు.

కూర్చున్నాడు రఘురామ్.

ఎడిటర్‌గారు తన ముందున్న రచన నొకదానిని రఘురామ్‌కు అందిస్తూ దీన్ని ఇక్కడే చదివి, నీ అభిప్రాయం ఇప్పుడే చెప్పు! అన్నారు క్లుప్తంగా. అందుకుని చూశాడు రఘురామ్.

ప్రముఖ రచయిత గోపీనాథ్ రాసిన కథ అది.

కథ సాంతం చదివి ఆలోచనలో పడ్డాడు రఘురామ్. 'కథ బాగుంది. అద్భుతమైన శైలితో సాగింది. అదొక్కటే లోటు!' అనుకున్నాడు మనసులో.

'కథలో ముగింపును పాఠకుని వూహకు వదిలేశాడు రచయిత. దీనివల్ల కథ చదవిన పాఠకుడు చివర కొంత అసంతృప్తి ఫీలవుతాడేమోనన్న భావన రఘురామ్‌లో. కొద్దిగా మార్పు చేసి ముగింపు పలికితే బావుంటుందనిపించింది! ఆ విషయం ఎడిటర్‌గారితో చెప్పాలా, వద్దా? అన్న సందిగ్ధం. ఎందుకంటే ఆ కథారచయిత సామాన్యుడు కాదు, చేయి తిరిగిన ప్రముఖ రచయిత! ఆయన రాసిన కథలో తాను మార్పును సూచించడం బాగుండదేమోనన్న భావన రఘురామ్‌లో.

ఇంతలో ఎడిటర్‌గారి పలకరింపు – 'ఏమోయ్, చదవడం అయిందా?' అంటూ. ఆయన తత్వం రఘురామ్‌కు బాగా తెలుసు. ఉన్నది ఉన్నట్లుగా మాట్లాడేవారిని ఆయన ఇష్టపడతారు.

సందిగ్ధం నుండి బయటపడి తన అభిప్రాయాన్ని సూటిగా చెప్పాడు రఘురామ్. ఎడిటర్ గారు సాంతం విని, చిరునవ్వుతో "నీ వూహ కరెక్టేనోయ్. నాకూ అలాగే అనిపించింది. బాగా ఆలోచించి నువ్వే ఆ కథకో చక్కని ముగింపు

నివ్వు. గోపీనాథ్‌తో నేను మాట్లాడుతాలే. అన్నట్టు ఆ కథ ఇప్పుడు తయారవుతున్న సంచికలోనే రావాలి! అట్టే టైం లేదు" అన్నారు.

'అలాగే సర్!' చెప్పి ఆయనవద్ద శెలవు తీసుకుని బయటపడ్డాడు రాఘురామ్. టైం అయిదున్నర దాటడంతో స్టాఫంతా అప్పటికే వెళ్లిపోయారు. ఆఫీసుబాయ్ మాత్రమే వున్నాడు. తన టేబిల్ మీదున్న ఫైళ్లను సర్ది తనూ బయటపడ్డాడు రఘురామ్. బీసెంట్‌రోడ్‌లో కాసేపు అలా అలా తిరిగాక మెస్‌లో భోజనం చేసి ఇంటికి చేరుకున్నాడు.

## వి.బి. నరసింహారెడ్డి

మేడపైనున్న పోర్షను అది. తాళం తీసి, లైటువేసి, కిటికీ తెరిచాడు. యధాలాపంగా అతని దృష్టి ఎదురింటి డాబాపై పడింది. అక్కడ....

పండువెన్నెల్లో, పరువపు మైమరపుతో,



ప్రపంచాన్ని మరచి వూసులాడుకుంటున్న ఓ పడుచు జంట! వారు ఆ ఇంటి కొడుకు, కోడలు. ఈ మధ్యనే పెళ్లయింది. అతడు చాపపై వెల్లకిలా పడుకుని వుండగా ఆమె అతనికి అభిముఖంగా కూర్చుని ఏవో కబుర్లు చెబు తోంది.

అలా చూడ్డం సభ్యత కాదన్న స్పృహ మదిలో కలుగగానే పక్కకు తొలగి, దుస్తులు మార్చుకుని, పక్కపై వాలిపోయాడు రఘురామ్. మూసుకున్న కళ్ల ముందు గతం సినిమారీలులా తిరిగింది.

అపర్ణ జీవితంతో రఘురామ్ జీవితం ముడి పడిన శుభదినమది. ఆ రోజున తన సుందర మైన వూహలకు రెక్కలొచ్చాయని సంబరపడ్డా డు రఘురామ్. ఏ భేషజాలకు తావులేని గాఢ ప్రేమానుబంధాన్ని తమ మధ్య నెలకొల్పుకోవా లని కలలు కన్నాడు. అవధుల్లేని ఆనందంలో తేలియాడిన మధురక్షణాలవి!

అపర్ణ రఘురామ్ తన కథల్లో వర్ణించేంత అపరంజిబొమ్మ కాకున్నా ఆకట్టుకునే సాధారణ అందానికి ఆమెలో లోటులేదు.

ఆ మహానగరంలో ఓ రెండుగదుల అద్దె ఇల్లు వెదికి పట్టుకుని పెళ్లయిన వారానికి ఆమె తో కలసి జీవనయాత్రకు శ్రీకారం చుట్టాడు రఘురామ్.

రోజులు గడుస్తున్నాయి.

అపర్ణ కొద్దికొద్దిగా అర్థమవుతోంది రఘు రామ్‌కు. తన మాట నెగ్గించుకోవాలనే పంతం ఆమెలో ఎక్కువ. ఆ విషయానికొస్తే అతని లోనూ కాస్త ఎక్కువే. అయితే నలుగురిలో తిరిగిన వాడు కనుక పరిస్థితినిబట్టి కొంత సర్దుకుపోవడం అలవాటు చేసుకున్నాడు. ఆమె కు అది అలవడలేదు. అపర్ణ చదువుకున్నదైనా నలుగురితో మెలిగే నేర్పు ఆమె స్వభావంలో తక్కువ. ముక్కుసూటితనమే ఎక్కువ. ఈ విష యాన్ని రఘురామ్ గ్రహించాడు. నెమ్మదిగా మార్చుకోవాలనుకున్నాడు.

కొత్త కాపురపు అనుభవాలు పెళ్లికి ముందు నాటి తన వూహలకు సరిపోలకున్నా ఊహకు, వాస్తవానికి మధ్య ఆ మాత్రం ఎడం సహజమే నని మనసును సమాధానపరచుకున్నాడు. మరింత మెరుగైన జీవితానందాన్ని అనుభవం లోకి తెచ్చుకునేందుకు అపర్ణను అపురూపంగా చూసుకోసాగాడు.

ఓ రోజు ఉదయాన్నే రఘురామ్ అమ్మగారు దిగారు.

'ఒరే రఘూ! నేనిక నీవద్దే వుండిపోతానురా' అన్నారు మరుసటి రోజు ఆఫీసుకు బయలుదేరు తున్న కొడుకుతో పార్వతమ్మగారు. జీవన పోరా టంలో అలసి సొలసిన వృద్ధురాలైన కన్నతల్లి 'నీ నీడన సేదదీరుతా'నంటే అక్కున చేర్చుకుని ఆదరించని కొడుకెవరుంటారు? తన జీవితాన్ని సఫలం చేసుకోవడానికి ఒక కుమారునికి అంత కు మించిన అవకాశం మరొకటి ఏముంటుం ది?

రఘురామ్ తన ఆనందాన్ని వ్యక్తం చేశాడు తల్లి అలా అడిగినంతనే. తనను అల్లారు ముద్దు గా పెంచిన తల్లి, తను అపురూపంగా చూసు కునే భార్య వీరిరువురి సాన్నిధ్యంలో తన జీవితం హాయిగా గడచిపోతుందనిపించింది తనకి ఆ క్షణంలో. అయితే ఆ తరువాత వరు సగా జరిగిన సంఘటనలతో ఆ ఆనందమంతా ఆవిరైంది. అంతా తలక్రిందులైంది.

ఆ రోజు ఆఫీసు నుండి ఇంటికి వచ్చిన రఘురామ్‌కు వాతావరణం గంభీరంగా మారి




పోయి కనిపించింది. అత్తాకోడలు ఒకరితో ఒక రు మాట్లాడుకోకుండా ముభావంగా వుంటున్న సంగతి అప్పటికే గమనించి వున్నా ఉద్యోగ బాధ్యతల ఒత్తిడితో అలసిపోయి ఇంటికి చేరు కునే రఘురామ్ ఆ విషయంపై శ్రద్ధ పెట్టలేక పోయాడు.

ఇంట్లో వాతావరణం ఆవేళ మరింత వేడె క్కింది. అమ్మ గాంభీర్యం, అపర్ణ చిరాకు ముఖం చూసి కలవరపడ్డాడు రఘురామ్. అప్రియమైన దేదో వినవలసి రావచ్చున్న ఆందోళన అతనిలో. ఎవరిని కదిపేందుకూ ధైర్యం చాలలేదు. విష యం ఎవరో ఒకరి ద్వారా అదే బయటపడు తుంది లెమ్మని ఎరగనట్టే వున్నాడు.

ఆ రాత్రి వంటిల్లు సర్ది, పడక గదిలోకి వచ్చినపుడు అపర్ణముఖం కాస్తంత ప్రశాంతం గానే కనిపించింది రఘురామ్‌కు. కాసేపటి తర్వాత అపర్ణ నెమ్మదిగా 'ఏమండీ, నేనోమాట చెబుతాను. కోపగించుకోరుగా?' అంది.

'ఏమిటో చెప్పు!' అన్నాడు రఘురామ్.

'నాకు బట్టలు వుతికే అలవాటు లేదు. మా పుట్టింట్లో చాకలివచ్చి ఇంటివద్దే వుతుకుతుంది. మీరూ చూశారుకదా!' అంది భర్తముఖంలోకి చూస్తూ.

'అవునవును చూశాను!' తలూపాడు రఘు రామ్.

భర్త ముఖంలోని ప్రసన్నత గమనించి – 'మీవి, నావి అయితే ఎలాగోలా వుతకగలను. కానీ మీ అమ్మగారి ఏడుగజాల కాటన్ చీరను నేను ఉతకలేనండీ. నా చేతులు నొప్పెడతాయి! ఆ ఒక్క చీరను మాత్రం కింది పోర్షను వాళ్ల పనిమనిషిచేత ఉతికిద్దాం. ఏమంటారు?' అడి గింది అపర్ణ.

'అలాగే చేద్దాంకానీ, నేను ఆఫీసుకు వెళ్లాక ఇంట్లో ఏం జరిగిందసలు?' సావధానంగా అడి గాడు రఘురామ్.

ఉదయాన జరిగిందంతా చెప్పి, 'ఇందులో నా తప్పేమైనా వుందా చెప్పండి?' అడిగింది అపర్ణ బాధగా ముఖంపెట్టి. రఘురామ్ ఆలో చిస్తూ వుండిపోయాడు. కొన్ని క్షణాల మౌనం తర్వాత 'అమ్మ వచ్చి పదిరోజులైనా కాలేదు. మీ ఇరువురి మధ్యా అవగాహన కుదిరి సఖ్యత నెలకొనడానికి యీ సమయం చాలదు. అవగా హన కుదరకపోతే అపోహలు తలెత్తుతాయి. ఇవాళే ఆమెతో నీ ఇబ్బంది గురించి చెప్పి, ఆమె చీరను కొద్దిరోజులపాటైనా ఉతికి వుండా ల్సింది. తరువాత నీ ఇబ్బంది గురించి నాతో చెబితే సరిపోయేది. ఇప్పుడేం జరిగింది? ఆమె నిన్ను అపార్థం చేసుకోవడానికి అవకాశం కలి గింది. అత్తాకోడళ్లమధ్య అపోహలు ఏర్పడడం ఎంతసేపు? నీవు తొందరపడ్డావు అపర్ణా!' అన్నాడు.

భర్త మాటలు అపర్ణకు రుచించినట్టులేవు. అతని ముఖంలోకి ఓ మారు తీక్షణంగా చూసి అటుతిరిగి పడుకుంది.

మరుసటిరోజు రఘురామ్ ఆఫీసుకు బయ లుదేరేముందు మంచంపై అమ్మపక్కన కూర్చొ ని, 'అపర్ణకు బట్టలు ఉతకడం అంతగా అల వాటు లేదమ్మా, చాకలిని మాట్లాడుతానంది!' అన్నాడు.

పార్వతమ్మకు అభిమానం ఎక్కువ.

'నిన్నటిదాకా మీ బట్టలు మీరే వుతుక్కున్నా రుగా. ఇపుడు మాత్రం చాకలి ఎందుకు? నా చీరను నేను ఉతుక్కోగలను!' అంది ఎటో చుస్తూ గంభీరంగా.

సంభాషణను మరి పొడిగించలేదు రఘు రామ్.

వారం తర్వాత-

అపర్ణను తీసుకువెళ్లేందుకు వాళ్లన్నయ్య వచ్చాడు. 'అమ్మకు నిన్ను చూడాలని వుందట. వెంటబెట్టుకు రమ్మంది!' అన్నాడు వచ్చీరాగానే. మార్యాదకోసం 'బావగారూ, వీలుంటే తీసుకు రండి!' చెప్పాడు రఘురామ్‌తో.

'నాకు వీలుపడదు. మీ చెల్లాయిని తీసుకె ళ్లండి!' చెప్పాడు రఘురామ్. మరుసటిరోజు అపర్ణను తీసుకుని వెళ్లిపోయాడు వాళ్లన్నయ్య.

ఆ రోజు అదివారం.

బాల్కనీలో వాలు కుర్చీలో కర్చుని దినపత్రిక తిరగేస్తున్నాడు రఘురామ్. కింది పోర్షను అన సూయమ్మ వచ్చింది. పార్వతమ్మగారితో పిచ్చా పాటీ కబుర్లు మొదలు పెట్టింది. కాసేపయాక రఘురామ్‌ని ఉద్దేశించి – 'అబ్బాయీ, నేనో మాట చెబుతాను... నీవు ఏమీ అనుకోనంటే!' అంది.

'పర్లేదు చెప్పండి!' అన్నాడు రఘురామ్.

'నీ భార్య మీ అమ్మను అలా వేరుచేసి చూడ్డం బొత్తిగా బాగోలేదు!' అంది. ఏం జరిగిం దన్నట్టు చూశాడు రఘురామ్ ఆవిడ వంక.

'నీళ్ల తాగేకుండ, గ్లాసు, కంచం, తుడుచు కునే టవల్‌తోసహా అన్నీ మీ అమ్మకు విడిగా పెట్టిందట మీ ఆవిడ. నీకిది తెలుసో లేదో!' అంది అనసూయమ్మ.

శ్రీమతి అతి శుభ్రత గురించి, ఆమె పుట్టిం టి అలవాట్ల గురించీ అప్పటికే రఘురామ్‌కు బోధపడి వుండడంతో ప్రశాంతంగానే – 'అపర్ణ పుట్టింట్లో ప్రతి ఒక్కరికీ ఎవరు వాడే వస్తువులు వారికి విడిగా వుంటాయి. బాల్యం నుండీ వచ్చి న అలవాట్లు ఒక్కసారిగా పోవు కదా? నాకు సైతం సబ్బు, టవల్‌తో సహా అన్నీ విడిగా వుంచింది. శుభ్రత పరంగా చూస్తే మంచిదే

కదా!' అన్నాడు భార్యను వెనకేసుకొస్తూ. పరాయివాళ్ల ముందు తన కుటుంబ విషయాలు చర్చించడం ఇష్టం లేదతనికి.

చోద్యం చూస్తున్నట్టుగా ముఖం పెట్టి వింది అనసూయమ్మ. పార్వతమ్మ కళ్లు దేనినీ చూడడం లేదు. ఆమె మనసు ఎక్కడో వుంది. అమ్మ మనసులో తన గురించి ఏమనుకుంటుందోనని కలత చెందాడు రఘురామ్ ఆమె ముఖంలోని నిర్లిప్తతను చూసి. అనసూయమ్మ మాటలకు తాను అలాకాక మరోవిధంగా కొంత లౌక్యంతో స్పందించి వుండాల్సిందన్న భావన కలిగింది. ఏదిఏమైనా అపర్ణ రాగానే క్లాసు తీసుకోవాలని గట్టిగా అనుకున్నాడు.

వారం తరువాత అపర్ణ పుట్టింటినుండి వచ్చింది. రాత్రి భోజనాలయ్యాక గదిలోకి వచ్చిన అపర్ణతో, అపర్ణా! నీవు కొన్ని విషయాలు తెలుసుకోవడం అవసరం!' అన్నాడు రఘురామ్. భర్త స్వరంలోని మార్పుకు కారణం వూహిస్తూ అర్ధంకానట్టు చూసింది అపర్ణ.

'కోడలిగా కొత్త చోటుకు వచ్చాక అక్కడి పరిస్థితులకు, అక్కడి వారి అలవాట్లకు అనుగుణంగా నీవూ కొంతైనా మారాలి. కొన్ని విషయాల్లోనైనా సర్దుబాటు ధోరణి అవలంభించాలి!' అన్నాడు రఘురామ్ అదే గంభీర స్వరంతో.

అపర్ణ విస్తుపోయింది.

'కొత్తచోటుకు వచ్చానా, ఇదే నా అసలు ఇల్లని స్వేచ్ఛగా వుంటున్నానే!' అంది.

క్షణం ఆగి 'మీరు చెప్పదలచుకున్నదేమిటో సూటిగా చెప్పండి!' అంది బాధగా ముఖం పెట్టి.

'వాడుకునే ప్రతి వస్తువూ విడిగా వుంచితే వెలివేసిన భావన ఎవరిలోనైనా కలుగుతుంది.

## తెలుగు కథానిక నూరేళ్ల సంబరాలు

*తెలుగు కథానిక పుట్టి ఫిబ్రవరి, 2009 నాటికి వంద సంవత్సరాలవుతోంది. విజయనగరంలో గురజాడ అప్పారావుగారి చేతుల్లో రూపుదిద్దుకున్న 'దిద్దుబాటు' అనే కథానికతో ప్రారంభమైన 'తెలుగు కథానిక' అంచెలంచెలుగా ఎదిగి ఒక మహావృక్షంగా మారి ఇప్పుడు నూరు వసంతాల పండుగ జరుపుకోబోతున్నది.*

*ఈ ఎదుగుదల సామాన్యమైనది కాదు. పాలగుమ్మి పద్మరాజుగారు రాసిన 'గాలివాన' కథానిక అంతర్జాతీయ కథానికల పోటీల్లో బహుమతి గెల్చుకుని తెలుగు కథానికకు అంతర్జాతీయ ఖ్యాతిని తెచ్చిపెట్టింది. ఆ స్ఫూర్తితో ఎంతోమంది తెలుగు కథానికా రచయితలుగా మారిపోయారు. మరెందరో తెలుగు కథానిక అభిమాన పాఠకులయ్యారు.*

*ఇంతగా ఎదిగిన తెలుగు కథానిక ఇప్పుడు నూరు సంవత్సరాల పండుగ జరుపుకోబోతున్నది. హైదరాబాద్‌కి చెందిన శ్రీ వేదగిరి రాంబాబు తెలుగు కథానికా వికాస కంకణబద్ధులై ఇప్పటికి 23 జిల్లాల్లో కథానిక సదస్సులు నిర్వహించి, 'రాష్ట్ర స్థాయి కథానిక' సదస్సుని గురజాడ వారి స్వస్థలమైన విజయనగరంలో నిర్వహించి, దానితోపాటు తెలుగు కథానిక వందేళ్ల పండుగను కూడా జరపడానికి సన్నాహాలు చేస్తున్నారు. ఈ పండుగ సంబరాలు ఫిబ్రవరి, 2009 రెండు, మూడు తేదీల్లో జరుగుతాయి. ఈ తెలుగు కథానిక నూరేళ్ల వేడుకల్లో మనందరం భాగస్వాములు కావడానికి అందరికీ ఇదే ఆహ్వానం.*

*ఇతర వివరాలకు శ్రీ వేదగిరి రాంబాబుగారిని (93913 43916) సంప్రదించవచ్చు.*

కుటుంబాన్నంతా ఒకటిగా భావించే మా అమ్మ లాంటి పాతతరం వారిని అది మరింత బాధ పెడుతుంది. మా ఇంట్లో సబ్బు, టవలు వంటివి అంతా కలిసే వాడుకుంటాం. నీవు గిరిగీసుకు కూర్చోక కాస్త పట్టువిడుపుతో నడచుకోవాలి!' అన్నాడు రఘురామ్ కాస్త కఠిన స్వరంతోనే.

'అన్నీ విడిగా అమర్చుకోగలిగే స్తోమత నాకున్నపుడు నేను ఎందుకు నా పద్ధతులు మార్చుకోవాలి?' ఆవేశంగా ప్రశ్నించింది అపర్ణ.

'మధ్యతరగతి వాతావరణమున్న కుటుంబంలోకి కోడలిగా వచ్చావు కనుక మారాలి!' విసురుగా అన్నాడు రఘురామ్.

అపర్ణ పెంకిగా– 'నా వస్తువులు మా వాళ్లు నాకిచ్చిన డబ్బుతో కొనుక్కుంటాలెండి. ఇక ముందు నా కోసం మీరు అదనంగా ఒక్కపైసా ఖర్చుచేయనక్కరలేదు!' అంది.

'అంతేగాని, నీ ప్రవర్తన మార్చుకోనంటావ్?' రఘురాం స్వరం హెచ్చింది. అపర్ణా అదే స్థాయి స్వరంతో – 'సగం గ్లాసు నోట్లో పెట్టుకుని మంచినీళ్లు తాగడం మీకూ మీ అమ్మకూ అలవాటేమో కాని నాకు కాదు!' మా ఇంట్లో అంతా గ్లాసు ఎత్తిపట్టుకొని నీళ్లు నోట్లో పోసుకుంటారు. ఎవరి అలవాట్లు వారికుంటాయి. ఎవరు వాడుకునే వస్తువులు వారికి విడిగా వుండాల్సిందే!' అంది మొండిగా.

రఘురామ్ తలపట్టుకున్నాడు.

'అమ్మా, అపర్ణకు కాస్త శుభ్రత పట్టింపు ఎక్కువ. మనమే కాస్త సర్దుకు పోవాలి!' అన్నాడు రఘురామ్ మరుసటి రోజు తల్లికి నచ్చజెబుతూ.

'సర్దుకుపోక చేసేదేముంది? పెళ్లాం బెల్లం తల్లి అల్లం అయినపుడు' అంది పార్వతమ్మ. ఆమె కంఠంలో నిష్ఠూరం ధ్వనించింది.

ఆ రోజు ఆదివారం కావడం చేత రఘురామ్ తీరికగా వున్నాడు. తల్లి వ్యాఖ్యానానికి నవ్వుకుంటూ 'మీరిద్దరూ నాకు సమానమే నమ్మా!' అన్నాడు.

పార్వతమ్మ కొడుకు ముఖంలోకి తీక్షణంగా చూసింది.

'నిన్నగాక మొన్న వచ్చింది నీ భార్య. నిన్ను నవమాసాలూ మోసి, కని, పెంచి, నిన్ను ఇంతవాణ్ని చేసింది నేను! తల్లికి నీవిచ్చే గౌరవం ఇదేనట్రా?' – నిలదీసింది.

రఘురామ్ ప్రశాంతంగా 'అమ్మా పాతికేళ్లు వచ్చేదాకే తల్లి కొడుకు బాగోగులు చూసేది. ఆపై కడదాకా కనిపెట్టుకుని వుండేది భార్యే కదా! ఆ స్థానానికి ఇచ్చే విలువ దానికీ ఇవ్వాలి కదా?' అన్నాడు. నిర్భయంగా మాట్లాడే గుణం తల్లినుండే అబ్బింది రఘురామ్‌కు.

'అపర్ణా! నీవిపుడు కోడలిపాత్ర పోషిస్తుండవచ్చు. రేపెపుడో తల్లివి అవుతావు. ఆ తర్వాత అత్తగారివీ అవుతావు. ఏదైనా సందర్భంలో నీ కొడుకు నిన్నుకాక పెళ్లాన్ని వెనకేసుకొచ్చినా, కోడలు నీవు మెచ్చువిధంగా నడచుకోకపోయినా నీవు మాత్రం బాధపడవా? మా అమ్మను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు!' రాత్రి పడకగదిలో భార్యతో అన్నాడు రఘురామ్.

అపర్ణ మౌనం వహించిందేగాని ఏ సమాధానమూ ఇవ్వలేదు.

'హే భగవాన్! తల్లి, భార్య ఇద్దరూ నాకు కావాలి. వారి మధ్య సయోధ్య కుదిర్చి నన్ను ఒడ్డున పడేయ్ స్వామీ!' ఇష్టదైవాన్ని ప్రార్థించి నిద్రకు ఉపక్రమించాడు రఘురామ్.

ఆ శెలవు రోజున ఇంట్లో పెనుతుఫానే వచ్చింది. రఘురామ్ భయపడినంతా జరిగింది.

తీరిగ్గా దినపత్రిక చదువుతున్న భర్త వద్దకు అపర్ణ సుడిగాలిలా వచ్చి 'మీ అమ్మ చేసిన పని ఏమైనా బాగుందా?' అంది తీవ్ర స్వరంతో.

'ఏం చేసిందేమిటి?' అడిగాడు రఘురామ్ ప్రశాంతంగా.

'పెళ్లికి ముందు నేను మీకు రాసిన ఉత్తరాల్ని పట్టుకెళ్లి అనసూయమ్మకు చూపించింది!' – ఆగింది అపర్ణ.

అప్పటిదాకా బయట కూర్చుని వారి సంభాషణ విన్న పార్వతిమ్మగారు లోనికొచ్చి కొడుకుకు ఎదురుగా నేలపై కూర్చున్నారు. శాంతంగా కొడుకుతో 'నీ పెళ్లాం పెళ్లికి ముందు నీకు రాసిన ఒక ఉత్తరంలో 'మీ అమ్మను నా కన్న తల్లిలా చూసుకుంటాను అని రాసింది. అవునా? ఆ ఉత్తరం అప్పుడు నీవే నాకు చూపించావు. ఆ ఉత్తరంలోని ఆ ఒక్కముక్కనే నేను చూపాను' అన్నారు.

రఘురామ్ కొద్దిపాటి చిరాకుతో 'పెళ్లికి ముందు మేము రాసుకున్న ఉత్తరాన్ని పరాయి వాళ్లకు చూపితే ఎలాగమ్మా?' అన్నాడు. భార్య ముందు తల్లిని చిన్నబుచ్చడం సబబుకాదన్న స్పృహ ఆ సమయంలో అతనిలో కలుగలేదు.

దానికి ఆమె – 'అనసూయమ్మ మీకు పరాయిదానిలా కనిపించవచ్చుగానీ నాకు కాదు. ఆమె నాకు ఆప్తురాలు. నా కష్టసుఖాలు తెలుసుకుంటుంది. నేను ఆమెతో చెప్పుకుని వూరట పొందుతాను' అంది.

వెంటనే అపర్ణ –

'మీ అమ్మ ఇంటివిషయాలన్నీ ఆవిడగారితో చెబుతోంది!' ఆరోపిస్తూ అంది.

'నీవు మాత్రం చెప్పలేదూ?' అప్పటివరకూ శాంతంగా మాట్లాడిన పార్వతమ్మగారు గయ్ మని లేచారు.

తల్లి, భార్య ఒకరిపై ఒకరు ఆరోపణలు చేసుకుంటూ పోట్లాడుకుంటుంటే మౌన ప్రేక్షకుడిలా చూస్తుండిపోయాడు రఘురామ్.

తన స్వప్నం చెదరిపోయినట్టు అనిపించిందతనికి. అంతులేని ఆవేదన కలిగింది. ఆ ఆవేదన ఆవేశంగా మారింది.

'ఇంటిలో సంపాదించి తెచ్చే మగాడిని నేనొకడిని వున్నాను. మీ మీ సమస్యలేమిటో నాతో చెప్పలేదు. నాకంటే మీ ఇద్దరికీ ఆ అనసూయమ్మే ఆప్తురాలు అయిందా? ఇద్దరి మధ్యా ఇంత పేచీ నడుస్తున్నా నాకు కొంచెమైనా తెలియదు. కానీ పక్కింటి అనసూయమ్మకు మాత్రం మన ఇంటి విషయాలన్నీ తెలుసు! ఆవిడా మీకు తిండి పెట్టేది?' ప్రశ్నించాడు రఘురామ్ తల్లినీ, భార్యనూ మార్చి మార్చి చూస్తూ.

అతనిలో ఆవేశం చల్లారలేదు.

'వుంటే కలిసిమెలసి వుండండి. లేదా ఇద్దరూ వెళ్లిపోండి!' చేతిలోని దినప్రతికను విసరికొట్టి విసవిసా బయటికి వెళ్లిపోయాడు.

పెళ్లికి ముందు ఉత్తరాల్లో అపర్ణ చేసిన బాసలు, తన పెళ్లిచేసి కోడల్ని ఇంటికి తెచ్చుకునేందుకు అమ్మపడిన తాపత్రయమూ మనసులో మెదలుతుండగా... గమ్యం తెలియని బాటసారిలా ఎక్కడెక్కడో తిరిగి చాలాసేపటి తరువాత ఇంటికి చేరుకున్నాడు.

అపర్ణ తన సూట్‌కేస్ సర్దుకుంటూ కనిపించింది. అరగంట తర్వాత చేతిలో సూట్‌కేస్‌తో

వచ్చి 'నేను మా ఇంటికి వెళుతున్నాను' అంది ముక్తసరిగా. 'ఇదే నీ ఇల్లని' ఆమెకు చెప్పాలని పించింది ఒక్క క్షణం రఘురామ్‌కు. కానీ ఆమె వినిపించుకునే స్థితిలో వున్నట్లు కనిపించలేదు. అది గ్రహించి - 'రేపటి వరకూ ఆగు, నేను వచ్చి దిగబెడతాను' అన్నాడు వెళ్లడానికి వీల్లేదని అడ్డుపడేకంటే యీ పరిస్థితుల్లో ఆమెను కొద్ది రోజులు పుట్టింట్లో వుండనివ్వడమే మంచిదని పించిందతనికి.

అయితే అపర్ణ - 'నేను పసిపాపనుకాను ఒంటరిగానే వెళ్లగలను!' అంటూ విసురుగా సమాధానమిచ్చి విసవిసా బయటికి నడిచింది.

పాంటూ, షర్టూ వేసుకుని ఆమె వెనకే వెళ్లాడు రఘురామ్. భార్యను జాగ్రత్తగా బస్సు ఎక్కించి పంపేందుకు.

ఆకాశంలో మబ్బులు దట్టంగా కమ్ముకుని కనిపించాయి. వడివడిగా అడుగులు ముందుకు వేశాడు అపర్ణను అందుకునేందుకు.

అపర్ణ పుట్టింటికి వెళ్లి వారం రోజులైంది.

కోడలు లేక బోసిపోయి కనిపిస్తున్న ఇంటిని, దిగులుతో గడ్డం పెంచుకుని తిరుగుతున్న కొడుకునీ చూస్తుంటే పార్వతమ్మగారికి చింతగా వుంది. ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చారు.

ఆ సాయంత్రం ఆఫీసు నుండి ఇంటికి వచ్చిన కొడుకుతో - 'నేను అన్నయ్య వద్దకు వెళ



24-11-08 న హైదరాబాద్ - సుందరయ్య నిలయంలో ఇస్మాయిల్ మిత్రబృందం, మానస ఆర్ట్ థియేటర్స్ సంయుక్త ఆధ్వర్యంలో జరిగిన సభలో సి. మోహన్‌కి ఇస్మాయిల్ అవార్డ్, పదివేల నూటపదహారు రూపాయల నగదును, జొన్నలగడ్డ వెంకటేశ్వరశాస్త్రిని సి.పి.బ్రౌన్ అవార్డ్, పదివేల నూట పదహారు రూపాయల నగదుతో సత్కరిస్తున్న ఆంధ్రజ్యోతి సంపాదకులు కె. శ్రీనివాస్, ఆచార్య వెన్నెలకంటి ప్రకాశం. చిత్రంలో రఘుశ్రీ, ధర్మారావు, జితేంద్రబాబు, ముకుందరావు ఉన్నారు.

తానురా, రేపు ఉదయం రైలు ఎక్కించు' అన్నారు.

'అమ్మా నువ్వూ వెళతావా?' బాధగా అన్నాడు రఘురామ్.

'ఈ పరిస్థితుల్లో తప్పదురా. కొంతకాలం అన్నయ్య వద్ద వుంటాను. నీవు ఆదివారం వెళ్లి అపర్ణను తెచ్చుకో. మనసులో దానిపై కోపం వుంచుకోకు. చిన్నపిల్ల! నిదానంగా తెలుసుకుంటుందిలే. అయినా నా తప్పూ కొంత వుంది. జరిగింది తలచుకుంటూ బాధపడకు. పరిస్థితులు కుదుటపడ్డాక మళ్లీ వచ్చి నీవద్దా కొన్నాళ్లుంటాలే!' ఓదార్పుగా అన్నారు పార్వతమ్మగారు.

మరుసటి రోజు ఉదయం అమ్మను రైలు ఎక్కించేందుకు స్టేషన్‌కు వెళ్లాడు రఘురామ్. బోగీలో సీటు చూపించి ఆవిడ కూర్చున్నాక తను దిగి కిటికీ వద్ద నిలుచున్నాడు.

ఎంతో బాధగా వుంది. తనవద్దే వుండిపోవాలని వచ్చిన అమ్మను అప్పుడే పంపించివేస్తున్నందుకు!

ఇంతలో మైకులో అనౌన్సర్ గొంతు... రైలు బయలుదేరుటకు సిద్ధంగా వుందని!

తదేకంగా కొడుకు ముఖం వంకే చూస్తున్నారు పార్వతమ్మ మళ్లీ చూస్తానో లేదో అన్నట్లుగా. మనసుకు స్వాంతన చేకూర్చే మాటలూ మధ్య మధ్య చెబుతున్నారు.

రైలు భారంగా కదిలింది.

'ఎల్లుండే వెళ్లి అపర్ణను తెచ్చుకో!' మరో మారు చెప్పారు పార్వతమ్మ. అప్పటికి ఆరోసారి ఆవిడ అలా చెప్పడం!

మౌనంగా తలూపాడు రఘురామ్ భారమైన మనసుతో.

రైలు నెమ్మదిగా వేగాన్ని అందుకుంటోంది.

వెళుతోన్న రైలువంక తదేక దృష్టితో చూస్తూ నిలుచున్న కొడుకుని కన్నీటి తెరల వెనుక చూస్తూ - 'మీరిద్దరూ సుఖంగా వుండడమే నాకు కావలసింది నాన్నా!' - మనసారా తల చింది పార్వతమ్మ మాతృహృదయం!

అమ్మ మనసు రఘురామ్‌కు పూర్తిగా తెలుసు.

జరిగింది ఇది!

జరిగిన దానిలో ఎవరి తప్పయినా ఉన్నట్లు అనిపించదు రఘురామ్‌కు. అవగాహనాలోపం, అహం, లౌక్యం కొరవడడం వల్ల కలిగే అపోహలు వ్యక్తుల జీవితాల్ని ఎంత దుర్భరం చేస్తాయో కదా, మానసికంగా వ్యక్తిని ఎంత కృంగదీస్తాయో కదా అనుకున్నాడు రఘురామ్. గతాన్ని తలచుకుని పరిపరి విధాల ఆలోచనలతో ఏ రాత్రికో నిద్రలోకి ఒరిగాడు.

'వెరిగుడ్, చక్కని ముగింపు!' - మెచ్చుకున్నారు ఎడిటర్‌గారు.

'రఘురామ్ సున్నిత మనస్కులు. చక్కగా స్పందిస్తారు!' వంత పాడాడు గోపీనాథ్ తన కథలో రఘురామ్ చేసిన మార్పు చూసి.

వారి ప్రశంసలు రఘురామ్‌కు ఆనందాన్నివ్వలేదు.

ఎడిటర్ గారి కేబిన్ నుంచి వెలుపలికి వస్తున్న అతనికి ఆ సమయంలో అనిపించింది -

'కథను పరిష్కరించగలనే కాని నా జీవిత కథ దిశను మార్చుకోగల శక్తి నిజానికి నాలో ఎక్కడిది? వ్యక్తులు పాత్రల వంటి వారు కాదు కదా, నా మాట వినరు కదా?' అని. ●

# అన్యాయం

**మ. రుక్మిణీగోపాల్**

**మే**డమీద కూర్చుని ప్రశాంతంగా చదువుకుంటున్నాను. కింద నుంచి వదిన గట్టిగా కేకలు పెట్టడం వినిపించింది. ఏమిటాని ఆశ్చర్యపోతూ గబగబా కిందికి దిగొచ్చాను. సావిట్లో కనిపించిన దృశ్యం నాకేం కొత్తకాదు.. నేలమీద పాత న్యూస్‌పేపర్లు, పత్రికలు అన్నీ దొంతర్లుగా పెట్టి ఉన్నాయి. వాటిని కొనుగోలు చేసే వ్యక్తి చేతిలో ఖాళీ



త్రాసు పట్టుకుని అక్కడ కూచుని ఉన్నాడు. ఎంచేతో అతని మొహం కొంచెం చిన్నబోయి ఉంది. ఆ కార్యక్రమాన్ని పర్యవేక్షించే నిమిత్తం పక్కనే సోఫాలో కూర్చుని ఉన్న వదిన పెద్ద గొంతుకతో వాడిని నిందిస్తోంది.

అందుకే మీరెంత సంపాదించినా తిండికి కూడా సరిపడక ఇబ్బందులు పడతారు. అన్యాయం సొమ్ము అరుగుతుందా? కిలో అని చెప్పి రెండు కిలోలు లాగేస్తున్నావా? ఎంత మోసం! నయం... చూసుకున్నాను కాబట్టి సరిపోయింది. లేకపోతే ఇవాళ ఎంత నష్టపోయే దానిని!...

వదిన వాక్ప్రవాహానికి అక్కడే కూర్చున్న నా మేనల్లుడు పదిహేనేళ్ల రవి అడ్డుపడ్డాడు.

"అందుకేనేమో మమ్మీ అతను చెప్పిన ధరకన్నా నువ్వు చాలా ఎక్కువ అడిగినా ఇంచుమించు వెంటనే ఒప్పేసుకున్నాడు" అన్నాడు ఎంతో గొప్ప విషయాన్ని కనిపెట్టిన మేధావిలా ఫోజు పెడుతూ.

ఏమిటని అడగక్కరలేకుండానే విషమేమిటో నాకర్థమైపోయింది.

మళ్లీ వదిన అందుకుంది "నిజమేరా! నాకా గ్రహింపే లేకపోయింది. వెర్రిపీనుగుని. ఏయ్, ఇంక నీకమ్మను. వెళ్లిపో. ఇవాళేకాదు, ఇంకెప్పుడూ నీకివ్వను" అంది పేపర్లను అతని దగ్గర నుంచి తన దగ్గరకు లాక్కుంటూ.

అతను అడ్డుపడుతూ "అమ్మా, అలా అనకండమ్మా. పొరబాటే జరిగింది. అసలు నేనలాంటి వాడిని కాను. రేపు పిల్లకు స్కూల్లో ఫీజు కట్టకపోతే పేరు తీసేస్తామన్నారు. అంచేత కొంచెం కక్కుర్తిపడ్డాను. పోనీ మీ చేత్తో మీరే తూచి ఇవ్వండి" అంటూ ప్రాధేయపడుతున్నాడు.

"ఇంక ఛస్తే నీకు ఇవ్వను. మోసంచేసే వాళ్లంటే నాకు పరమ అసహ్యం. ఒరేయ్ రవీ, ఆ పేపర్లను తీసుకెళ్లి లోపల పెట్టెయ్యరా" అంది వదిన.

రవి లేచాడు.

"అలా అనకండమ్మా, తప్పయిపోయిందని ఒప్పుకున్నాగా, క్షమించండి. నా పొట్టమీద కొట్టకండి" అంటూ అతను మళ్లీ ప్రాధేయపడ్డాడు.

వదిన మనసు ఏమాత్రం కరగలేదు. "నేను నీ పొట్టమీద కొట్టడమేమిటి? దేవుడే కొట్టాడు. లేకపోతే అన్యాయం చూస్తూ ఊరుకుంటాడా? ఏయ్, బయటకు వెడతావా, లేకపోతే కుక్కను వదలమంటావా?" అంది.

ఇక లాభంలేదనుకున్నాడులా ఉంది, అతను చేతిలో ఉన్న త్రాసును పక్కనే పెట్టిఉన్న గోనెసంచిలో పెట్టుకుని గుట్టగా పడిఉన్న పేపర్లవంక, పత్రికల వంకా ఆశగా చూస్తూ వెళ్లిపోయాడు. అతను గుమ్మం దాటుతూ కళ్లు తుడుచుకున్నట్లు నాకనిపించింది.

ఆనాడు జరగబోయిన నష్టాన్ని, దానిని తప్పించిన అదృష్టాన్నీ పదేపదే తలచుకుంటూ తల్లీకొడుకు లిద్దరూ పేపర్లను మళ్లీ యథాస్థానంలో చేర్చే ప్రయత్నంలోపడ్డారు. నేను మౌనంగా పైకి వచ్చి నా చదువును కొనసాగిద్దామని కూర్చు న్నాను. కాని చదివినదేదీ మనసుకెక్కడంలేదు. ఏమిటో మనసు పాడయినట్లనిపించింది. దీనంగా ఉన్న ఆ పేపర్లు కొనేవాడి మొహం కళ్లముందు నిలిచినట్లనిపిస్తోంది. "ఎంత అన్యాయం..." చెవుల్లో గింగురుమంటున్నాయి వదిన మాట

లు. "ఏమిటా అన్యాయం?" అని అనుకోకుండా ఉండలేకపోయాను. రెండు పూటలా కడుపు నిండా తిండికి కూడా కరువైన వాడు, కూతురి స్కూలు ఫీజు కూడా కట్టలేని వాడు డబ్బుకు కొంచెం కక్కుర్తిపడితే అది అన్యాయమా? నిజానికి అన్యాయం, అసత్యం, మోసం ఇలాంటి వాటికి ఏ పరిస్థితిలోనూ మార్పు ఉండదు. కానీ ఇవి ఏ రకమైన కష్టాన్నీ అనుభవించని శ్రీమంతులు వల్లెవేసే మాటలు. ఆకలితో మాడుతున్న వాడికి వాటి అర్థంకాని, విలువ గాని తెలియదు. అనుకోకుండా నా మనసు రెండురోజుల క్రితమే జరిగిన సంఘటనమీదికి పోయింది.

నా మేనల్లుడు రవి పదిహేనవ పుట్టిన రోజు దగ్గరపడుతోంది. అలా చెయ్యాలి, ఇలా చెయ్యాలి... అంటూ వదిన ప్లానులు వేస్తోంది. ఇప్పుడేకాదు, వాడి ప్రతి పుట్టినరోజుకీ ఇంతే. ఒక్కడే కొడుకు మూలాన ఎంతో ఘనంగా జరపాలని ఆవిడ ఊహ. హాలంతా చెమ్కీలు, ప్లాస్టిక్ పువ్వులు, లతలతో అలంకరించడం, చాలామందిని కుటుంబాలతో సహా ఇంటికి పిలవడం, రెండుమూడు స్వీట్లతో సహా చాలా తినుబండారాలు కొనడం, ఇవికాక పెద్ద కేక్, వచ్చిన పిల్లలందరికీ చిన్న చిన్న బహుమతులు ఇవ్వడం, రవికి సరేసరి... చాలా ఖరీదైన బట్టలు, ఇంకా వాడేదన్నా కావాలని కోరితే అదీ... ఇలా చాలా ఖర్చుపెడుతుంది. అన్నయ్యకు ఇలాంటివి అట్టే నచ్చవు.

"ఆ రోజు ఇంట్లో ఓ స్వీటు, హాటూ చేసి, తలంటుపోసుకుని కొత్తబట్టలు కట్టుకుంటే చాలదా?" అంటాడు.

ఏటా దీనిని గురించి ఇద్దరకూ కొంత గొడవే. కాని చివరకు వదిన మాట ప్రకారమే జరుగుతుంది. ఈసారి ఇద్దరూ కొంచెం ఎక్కువ గొడవేపడ్డారు.

"పోనీ పిల్లలు నాలుగైదేళ్లవాళ్లు అయేదాకా అయితే వేరుసంగతి. కాని ఎంత ఎదిగినా ఈ పుట్టినరోజులేమిటి? డబ్బు దండగ కాక పోతే" అని అన్నయ్య వాదన.

"మీరిలాగే అంటారు. మీకేంతెలుసు ఈ రోజుల సంగతి. మొన్న లాయరుగారి అబ్బాయికి ఎంత ఘనంగా జరిపారు! ఇందులో మనం లోటు చేస్తే రేపు వాడు తలెత్తుకుని వాడి స్నేహితులలో తిరగ్గలడా? ఇలాంటి వాటిలో డబ్బుకి చూసుకుంటామా? ఇంకా నయం, కొంతమంది పుట్టినరోజులు పెద్ద పెద్ద హొటళ్లలో ఏర్పాటు చేస్తున్నారు. నేనలా, చెయ్యమంటున్నానా? ఈ మాత్రం దానికి కూడా మీరిష్టపడకపోతే ఎలా?" ఇది వదిన వాదన.

ఇలా కొంతసేపు తర్జనభర్జనలైన తరువాత "సరే నీ ఇష్టం" అంటూ అన్నయ్య అవతలికి వెళ్లిపోయాడు.

వదిన ఇష్టం చాలా ఖరీదైనది. నాకు సంబంధం లేదు కాబట్టి 'ఆ రోజు ఎంత ఖర్చయింది' అన్నది నేను తెలుసుకోలేదు. కాని చాలానే ఖర్చుపెట్టారని మాత్రం చెప్పగలను. అంతేకాదు... ఆహార పదార్థాలు బోలెడంత 'వేస్ట్' అయాయి. రెండేళ్ల, మూడేళ్ల పిల్లలకు కూడా ప్లేటు నిండా పదార్థాలు నింపి ఇస్తే వాళ్లు ఏంతింటారు? పోనీ వాళ్ల తల్లులైనా అంత పెట్టవద్దని చెప్పరు. వాళ్లు ఇంచుమించు అన్నీ ప్లేట్లలో వదిలేసారు. కేవలం చిన్నపిల్లలే కాదు... కొంచెం ఎదిగిన పిల్లలు, చాలామంది పెద్దవాళ్లు కూడా ఎవరూ ప్లేటును పూర్తిగా ఖాళీచెయ్యలేదు. గ్లాసులోని చల్లని పానీయాలను ఇంచుమించు పావో, సగమో అందరూ వదిలేసారు, ముఖ్యంగా పెద్దవాళ్లు. ఆ వచ్చిన




వాళ్లు ఎవరూ డొక్కలు మాడినవాళ్లు కాదుగా ప్లేటు పూర్తిగా ఖాళీచేసేందుకు!

పార్టీ అంతా అయి, ఎక్కడివాళ్లక్కడికి వెళ్లిన తరువాత వదిన హాయిగా ఊపిరి పీల్చుకుంది. "హమ్మయ్య! అంతా బాగా జరిగింది. ఈమాత్రం దానికి ప్రతిసారీ మీ అన్నయ్య నాతో గొడవే. ఖర్చంటే ఎలా? అవసరమైనపుడు ఖర్చుపెట్టుకోకపోతే ఈ డబ్బెందుకు?" అంది వదిన ఎక్కడి సామానులక్కడ సర్దడంలో సహాయపడుతున్న నాతో.

నేనేమీ మాట్లాడలేదు. సగం నిండుగా, కొన్ని ఇంచుమించు పూర్తి నిండుగా ఉన్న ప్లేట్లలోని పదార్థాలను చెత్తడబ్బాలో పారవేస్తున్నపుడు మాత్రం నా మనసు చాలా బాధపడింది. అపుడు నాకు రైల్వేస్టేషన్‌లోను, బస్‌స్టాండ్‌లోనూ చెయ్యిచాచి అడుక్కునే చిన్నపిల్లల మొహాలు గుర్తుకువచ్చి ఇంకా బాధ కలిగింది.

పుట్టినరోజు నుంచి మళ్లీ నా ఆలోచనలు ప్రస్తుతంలోకి వచ్చాయి. "కొడుకు పుట్టినరోజుకి డబ్బుఖర్చుని ఏమాత్రం లక్ష్యపెట్టని వదిన ఈరోజు పేపర్లు కొనేవాడి వల్ల వచ్చే స్వల్ప డబ్బు నష్టాన్ని సహించలేకపోయింది. ఆ రోజు పుట్టినరోజునాడు తను ఖర్చుపెట్టిన దాని తో పోలిస్తే ఇది ఎంత చిన్నమొత్తం? మేమందరం కలిసి సరదాగా హోటల్‌కెళ్లి ఖర్చు పెట్టిన దాంట్లో ఇది ఎన్నో వంతు ఉంటుంది!

"నీతి వాక్యాలు వల్లించడం సులువే. సూత్రం ప్రకారం అన్యాయం చెయ్యకూడదు. అబద్ధం చెప్పకూడదు. ఎవరినీ మోసగించకూడదు. ఇంకా చాలా చెయ్యకూడదు. నిజమే. కానీ మనిషి పరిస్థితిని కూడా చూసి కొంచెం మానవత్వంతో ప్రవర్తించవద్దా? లక్షలు ఉన్నవారు, లక్షలు గడించేవారూ డబ్బు దగ్గర అన్యాయం చేస్తే అది నేరం. కాని నిత్యావసరాలు కూడా తీరనివాడు డబ్బు దగ్గర కొంచెం కక్కుర్తిపడితే (తప్పుచేస్తే) శిక్ష కంటే దయ అవసరం కాదా!" చాలాసేపటివరకూ ఆ ఆలోచనలు నన్ను వెంటాడుతూనే ఉన్నాయి. ●

టి. శ్రీలక్ష్మీనాగజ్యోతి

## మొదటి కథ




"స్వామీ! మిమ్ములను మా అయ్యగారు అర్జంటుగా పిలుచుకొని రమ్మన్నారు. మరలా వారు గూడూరు వెళ్లాలట" అని అంటున్న గోపీ రెడ్డిగారి డ్రైవరు మాటలకు "ఇప్పుడే వస్తున్నానంటూ ఇంట్లోకిపోయి కండువా కప్పుకొని రెడ్డిగారింటికి బయలుదేరాడు దీక్షితులు.

దీక్షితులు గారి అబ్బాయికి మూడు రోజుల నుంచి ఒకటే జ్వరం. మంచం మీద నుంచి లేవడంలేదు. మామూలు వైద్యాలకు తగ్గడం లేదు. రెండురోజులు చూసి నెల్లూరు పెద్ద డాక్టర్లకు చూపించాలనుకున్నాడు. టెస్టులు వగైరాలకు కనీసం ఐదొందల రూపాయలైనా కావాలి. పండుగరోజులు. తెల్సిన ఇద్దరిని అడిగితే ఖాళీచేయి చూపించారు. వీలైతే రెడ్డిగారిని అడగాలి అనుకుంటూ రెడ్డిగారి ఇల్లు చేరాడు దీక్షితులు.

డ్రైవరు కారు తుడవడం పూర్త

యింది. "స్వామీ! మీ కోసమే ఎదురుచూస్తు న్నాను. రేపు నెల్లూరులోని మా యింట్లో లక్ష్మీ పూజ చేసి వెళ్లండి" అంటూ కారెక్కి దీక్షితులు గారికి ఎలాంటి మాట్లాడే అవకాశం లేకుండా వెళ్లిపోయాడు గోపీరెడ్డి.

గోపీరెడ్డి తండ్రిగారికి కేవలం రెండెకరాల పొలం ఉండేదట. గోపీరెడ్డి పెరిగి పెద్దైన పిమ్మ ట ఆ కుటుంబానికి అదృష్టం కల్సివచ్చింది. కాంట్రాక్టు పనులపై కొన్ని వందల కోట్లు సంపా దించాడంటారు. మొన్న ఎలక్షన్స్‌లో సమితి ప్రెసిడెంట్‌గా పోటీ చేసిన అభ్యర్థికి పెద్ద మొత్తం అందజేసాడని అనుకుంటారు.

ఎవరైనా గ్రామంలో ఎదురైతే మాటల సందర్భంలో "నీకేమి స్వామీ! పెద్దరెడ్డి మీరడి గితే కాదనడు కదా!" అంటారు. కాని యదార్థం గా వారిని ఇప్పటివరకూ ఏదీ అడగలేదు. వాళ్ల నాన్నగారి హయాం నుండి వారి యింటి పౌరో హిత్యం. ప్రతి శుక్రవారం వారి యింటికి పోయి లక్ష్మీపూజ చేయడం, వారు హారతిలో వేసే పది రూపాయలను తీసికొని రావడమే!

ఇపుడు దీక్షితులు గారికి ఐదొందలు అత్యా వసరమయినాయి. చుట్టుప్రక్కల డెంగీ జ్వరం సోకింది. ఏ జ్వరమో తెల్సుకోవాలంటే నెల్లూరు కు పోవాలి. చిన్నగ్రామం కాబట్టి దీక్షితులవారి అబ్బాయికి జ్వరం అని అందరికీ తెలిసిపోయిం ది. గోపీరెడ్డి గారికి కూడా ఈ విషయం వాళ్ల తోటమాలి చెప్పిఉంటాడు.

తర్వాతరోజు రెడ్డిగారింటికి వెళ్లాడు. పూజా ది కార్యక్రమాలు పూర్తిచేసాడు. హారతి పళ్లెంలో వారిచ్చిన పదిరూపాయలు తీసుకొన్నాడు దీక్షితు లు. అవసరాన్ని రెడ్డిగారికి చెప్పాలంటే హాలులో వారి ప్రక్కన చాలామంది పెద్దలు కూర్చుని ఉ న్నారు.

అప్పటికీ అభిమానాన్ని చంపుకొని రెడ్డిగారి భార్యకు తన అవసరాన్ని తెలియజేసాడు. పాపం! ఆమె చేతిలో ఏమీలేదు. ఎలాగో రెడ్డి గారికి ఆమె తెలియజేసినా పట్టించుకోలేదు. ఛార్జీలకు రెడ్డిగారి భార్య ఇచ్చిన ఇరువది రూపా యలు తీసుకున్నాడు.

గోపీరెడ్డిగారి స్నేహితుడు కాబోలు... పేద బ్రాహ్మడిలా ఉన్నాడు. పదిరూపాయలే ఇచ్చి నట్లున్నారు అంటే... "వీళ్లకు డబ్బులు ఎక్కువ ఇస్తే మళ్లీ అంతే కావాలంటారు. లేనిపోని అల వాటు చేయడం ఎందుకు? దీక్షితులకు ఇచ్చినది చాలు" అన్న గోపీరెడ్డిగారి మాటలు వింటూ చాలా బాధపడ్డాడు దీక్షితులు. గొప్పోళ్లకు తన లాంటి పేదోళ్లను చూస్తే ఎంత చిన్నచూపు అను కుంటూ తిన్నగా బయలుదేరి బస్సుకోసం రోడ్డు పై నిలబడ్డాడు దీక్షితులు.

మనసంతా ఇంట్లో జ్వరంతో ఉన్న అబ్బా యి మీదనే ఉంది. బస్సు ఇంకా రాలేదు.

నా ప్రక్కనే కారాగింది. ఎవరో నన్ను పిలి చారు. నన్ను అవునా కాదా అనుకుంటూ దగ్గ రకు వెళ్లాను. ఇందాక గోపీరెడ్డిగారి యింట్లో వారితో మాట్లాడుతుండిన వ్యక్తి.

"స్వామీ! ఈ రోజు మా యింటికి పురోహి తుడు ఆరోగ్యం సరిలేక రాలేదట. ఇప్పుడే మా ఆవిడ ఫోన్‌చేసింది. మీకభ్యంతరం లేకపోతే మా యింటికి వచ్చి పూజచేసి వెళతారా?" అం టూ వారు అడిగేసరికి కాదనలేకపోయాడు దీక్షి తులు. కారెక్కాడు.




ఇంటిముందు కారాగింది. దీక్షితులు పూజ గదిలోకి ప్రవేశించాడు. దంపతులిద్దరూ భక్తి శ్రద్ధలతో దేవుని ముందు కూర్చున్నారు. పూజ చేసేముందు పేర్లు, గోత్రం చెప్పమన్నాడు. గీతమ్మ, సుధాకర్‌రెడ్డి అని చెప్పారు. పూజాది కార్యక్రమాలు ముగించి హారతిపళ్లెం వారిముందు ఉంచాడు దీక్షితులు. వారు హారతిపళ్లెంలో ఉంచిన ఐదువందల రూపాయల నోటు చూసి ఆశ్చర్యంగా చూసాడు వారివైపు.

బిడ్డ ఆరోగ్యం నిమిత్తం దీక్షితులకు ఆ మొత్తం అందించడానికి పార్వతీ పరమేశ్వరులే ఆ దంపతుల రూపంగా వచ్చారనిపించింది.

"స్వామీ! అలా చూస్తున్నారేమిటి? మేము గోపీరెడ్డి గారంత గొప్పవారం కాకపోయినా, మా తృప్తికొద్దీ మీకిచ్చాము. మేము మధ్యతరగతి కుటుంబీకులం. ఏదో మా పిల్లలు ఎవరిపాటికి వారు సుఖంగా జీవిస్తున్నారు. మీరు నాకు కనిపించడం, నా శ్రీమతి కోరిన విధంగా పూజ నిర్వహించడం మాకెంతో సంతోషంగా ఉంది. కాదనకండి" అంటున్న ఆ దంపతులను మనస్ఫూర్తిగా ఆశీర్వదించారు దీక్షితులు. కారులో దీక్షితులవారిని బస్టాండులో వదిలి వెళ్లిపోయాడు డ్రైవరు.

తర్వాత రోజు నెల్లూరులో అన్నిరకాల పరీక్షలు చేసిన తరువాత, దీక్షితులగారి అబ్బాయకి ప్రమాదకరమైన జ్వరం కాదని తెల్సింది. రెండురోజులలో పూర్తిగా కోలుకున్నాడు. ఒక్కగానొక్క కొడుకు. వాడికేదైనా జరిగితే తట్టుకోగలమా! ఆలోచిస్తున్నాడు దీక్షితులు.

కుటుంబ పోషణ కోసం పూజారిగా పని చేస్తున్న దీక్షితులు జీవితంలో ఎవ్వరినైనా మరచిపోవచ్చు గాని తనకు అడగకనే సాయంచేసిన ఆ దంపతులను మరచిపోగలడా?

ఎంతో డబ్బున్న కోటీశ్వరుడైనప్పటికీ ఇతరులకు సహాయం చేయడానికి మనస్సొప్పని వారికి, మధ్యతరగతి కుటుంబీకుడయిన తాటిపర్తి సుధాకర్‌రెడ్డి, వారి ధర్మపత్ని గీతమ్మగార్లకు ఎంత తేడా!

*(గోపీరెడ్డిగారి యింటిలో దీక్షితులవారి ఆందోళన, వారు అతనికి సహాయం చేయకపోవడం సుధాకర్‌రెడ్డి గమనించి, తనకు సహాయం చేసాడని దీక్షితులవారికి తెలియదు.)*

# రచనలకు రచయితలకు స్వాగతం



'కథాకేళి'లో ప్రచురణకు రచనలు పంపేవారు క్రింది విషయాలు గమనించవలసిందిగా మనవి.

★ సరదాగా చదువుకోవడానికి ఉపయోగపడుతూనే ఎంతో కొంత సమాజహితం కోరే కథలకు, హాస్యకథలకూ అధిక ప్రాధాన్యత ఇవ్వబడుతుంది.

★ అనువాద / అనుసరణ కథలు అనుమతించబడవు

★ కథ సైజుపై ఎలాంటి నియమాలూ లేనప్పటికీ చిన్న కథలకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడం జరుగుతుంది.

★ రచనల ఒరిజినల్ వ్రాత ప్రతులు మాత్రమే పంపించాలి. జెరాక్స్ కాపీలు అనుమతించ బడవు.

★ రచనలు అరఠావు లేదా ఎ4 సైజు పేపరుపై ఒక్కవైపునే వ్రాసి, వీలైనంత వరకూ కొట్టివేతలు, దిద్దివేతలూ లేకుండా ఉండాలి.

★ నచ్చిన కథకు అవసరమైన మార్పులు చేసుకునే హక్కు మాకు ఉంటుంది

★ ప్రచురించిన ప్రతి కథకూ పారితోషికం ఇవ్వడమే గాక ఆ నెల నుంచి సంవత్సరం పాటు పత్రికను ఉచితంగా పంపిస్తాం.

**కార్టూన్లు, జోక్స్:**

★ కార్టూన్లు, జోక్స్ నిరభ్యంతరంగా పంపవచ్చు (కార్టూన్స్ 11x7 సైజుకి వచ్చేలా బ్లాక్ & వైట్‌లో ఉండాలి.)

**పుస్తక సమీక్షలు:**

★ పుస్తక సమీక్షల నిమిత్తం కొత్తగా విడుదలైన పుస్తకాలు మాత్రమే (రెండు కాపీలు) పంపాలి.

★ విడుదలైన నెలరోజులలోపుగా పంపించాలి.

**సభలు / సమావేశాలు:**

★ సాహిత్య కార్యక్రమాల వార్తలు, ఫొటోలు కూడా పంపవచ్చు.

★ కార్యక్రమం జరిగిన తేదీ, స్థలం మొదలైన వివరాలతో కార్యక్రమం జరిగిన 15 రోజులలోపుగా పంపించాలి.

★ ఫొటో వెనుక సందర్భం, ఫొటోలోని వ్యక్తులపేర్లు వివరంగా వ్రాయాలి.

# పండుగా... నీకు జోహార్!

ఆటోలోంచి దిగగానే అనుకున్న ప్రకారం పదిరూపాయలందించాడు భుజంగం. ఆ నోటందుకోకుండానే ఆటోడ్రైవర్ "మరో ఐదొస్తుంది సార్!" అన్నాడు ఎటో చూస్తూ నిర్లక్ష్యంగా.

"నువ్వడిగింది పదిరూపాయలే కదా? ఇంకా అయిదెందుకు?" అడిగాడు భుజంగం.

అలా అడుగుతున్నతడ్ని అమాయకుడ్ని చూసినట్టు ఎగాదిగా చూసాడా ఆటోడ్రైవర్. అంతలోనే "అన్నీ తెలిసిన మీరు కూడా ఏమీ తెలియనట్లడుగుతారేంటి సార్!" అన్నాడు అదేదో అతి సామాన్య విషయమన్నట్టు.

దాంతో బిక్కమొహం వేసాడు భుజంగం. "అందరికీ తెలిసి తనకు మాత్రమే తెలియని విషయమేమై వుంటుందా?" అని ఆలోచించాడు. ఫలితం శూన్యం.

అలా ఆలోచనల్లో ఉన్న భుజంగంతో ఆటోడ్రైవర్ "ఏంటి సార్! ఏమీ ఎరగని వాళ్లలా అలా బిక్కమొహం వేస్తారు? ఆ అయిదూ దసరా మామూలు" అన్నాడు చిక్కుముడి విడదీసిన వాడిలా.

గీరుకుపోయిన చర్మంమీద కారంగుండ తగిలినట్లు చురుక్కుమందా మాట వినగానే భుజంగానికి. దాంతో ఖస్సస్... మని లేచాడా ఆటోడ్రైవర్ మీద. "నీ పిండం పిట్టలకి పెట్ట. అదేదో ఇంటర్నేషనల్ ఎఫైర్ లాగ ఎంత బిల్డప్ ఇచ్చావురా! టెన్షన్‌తో చంపావుకదా! అయినా ప్రతీ అణాకాణీ ఆవారా వెధవకీ ఇదో అలవాటై పోయింది. దసరా మామూలట... దసరా మామూలు" అంటూ ఆగాడు వగరుస్తూ.

అతడన్న మాటల్లో "పిండం" అన్న మాటకి అర్థం ఆ ఆటోడ్రైవర్‌కి తెలియదు కాబట్టి పెద్ద గండం తప్పింది భుజంగానికి. అయినా మిగిలిన మాటలు వింటూనే "బిల్డప్పూ... లాకప్పూ... అంటూ ఎక్కువ మాటలొద్దు సారూ! మీరిచ్చేది ఆఫ్టరాల్ అయిదు రూపాయలు. దానికింత... అక్కర్లేదు" అన్నాడు పరమ నిర్లక్ష్యంగా.

దాంతో అంటుకున్న తారాజువ్వలా 'ర...య్యి'మని లేచాడు భుజంగం. "నీ మొహం మండ. నీ కంటికి నేను వెర్రివెంగళప్పలా కనబడుతున్నానేంట్రా! నీ బతుక్కి దసరా మామూలు కావాల్చొచ్చిందా! ఇలా అడిగిన ప్రతి అణాకాణీ ఆవారాగాడికల్లా ఇవ్వడానికి నా తాత కూడబెట్టిన ముల్లె ఏమైనా ఉందనుకున్నావా?" అంటూ వెర్రిగా కేకలేసాడు. దానికి కారణం అతని మనసులో రగులుతున్న బాధ. నెల్లాళ్ల పొద్దయింది ఈ తద్దినం మొదలై. వినాయక చవితి పండుగ వెళ్లాక కరెంట్ రీడింగ్ తీసుకోవడానికొచ్చినవాళ్లు మొదలెట్టారు. "సార్! దసరా మామూలు" అంటూ బుర్రగోక్కుంటూ.

ఆ మాట విన్న భుజంగం "ఇప్పుడెక్కడి దసరా... రెణ్నెల్లుంది కదా?" అన్నాడు.

అయ్యగారి శ్రీనివాసరావు

"నిజమే సార్. కాని మళ్లీ మేం రీడింగ్‌కొచ్చే సరికి దసరా వెళ్లిపోతుంది సార్. ఏదో మీకు తోచినంత..." అన్నాడు వివరణ ఇచ్చి, చివరగా నసిగేస్తూ.

ఆ మాటతో అంత దీనంగా అడుగుతున్నా రుకదా అని అయిదు రూపాయలు వాళ్ల చేతిలో పెట్టాడు భుజంగం. అది చూస్తూనే అందులో ఒకడు వెర్రినవ్వొకటి నవ్వుతూ "మాలాంటి వాళ్లతో మీకు జోకులేంటి సార్" అన్నాడు.

ఆ మాట అతడెందుకన్నాడో అర్ధంకాని భుజంగం "నీతో నేను జోకులెప్పుడేసాను" అన్నాడు మాడిపోయిన గారెలా మొఖంపెట్టి.

ఆ మాటకు రెండో వ్యక్తి "లేకపోతే ఏంటి సార్! యాభైరూపాయలియ్యవలసిన దసరా మామూలుకి అయిదు రూపాయలిస్తే జోక్కాకమరేంటి సార్? రండి సార్ మా కవతల పనుంది" అన్నాడు బాకీదారుణ్ని అప్పిచ్చిన వాడడిగిన లెవెల్లో.

దాంతో ఒళ్లుమండిన భుజంగం "ఏభై కావాలా?... వందొద్దూ?..." అన్నాడు వ్యంగ్యంగా. అప్పటికే లోపల రక్తం మరగడం మొదలైంది భుజంగానికి.

"లేద్సార్! ఈ సంవత్సరానికింతే ఫిక్స్ చేసాం. అంతకంటే ఎక్కువిచ్చినా తీసుకోం" అన్నాడు ఆ ఇద్దర్లో ఒకడు. అలా వాళ్లన్న ఒక్కొక్క మాట వింటుంటే పొయ్యిమీద పెట్టిన పాల



లాగా రా(నానూ పెరిగింది బీపీ. ఆ చివరిమాట వినేసరికి పగిలిన అగ్నిపర్వతం లావా ఎగజిమ్మి నట్లు తన మనసులోని కోపాన్నంతా వాళ్లమీద చూపించేసాడు. అతడి ఉగ్రరూపం చూసి ఏమనుకున్నారో గాని ఆ సర్వీసు నంబరు దగ్గర ఏదో రాసుకుని మౌనంగా వెళ్లిపోయారు.

అయితే అంత సులువుగా వాళ్లు వెళ్లి పోవ డం వెనక ఆంతర్యం బిల్ కట్టడానికి వెళ్లినపు డు గాని తెలిసిరాలేదు భుజంగానికి. నెలాఖ రు. కూర ఖర్చుకే కటకటలాడుతున్న రోజులు. బిల్ కట్టడానికి ఆఖరు రోజు కావడంతో దాని పేరు చెప్పి నెల ఖర్చులకి కూడా కలిపి అప్పు చేసిన భుజంగం బిల్ కట్టడానికెళ్లాడు.

ఆ బిల్ కట్టించుకునే వ్యక్తి ఇతడి సర్వీస్ నంబరు చూడగానే "సార్! మీరు రీడింగ్ తీయ డానికికొచ్చిన బాయ్స్‌కివ్వాల్సిన దసరా మామూ లు పెండింగ్‌లో ఉందిసార్. అది, మాది కలిపి ఇప్పుడిస్తేనే బిల్ తీసుకుంటాం" అన్నాడు. ఆ మాటతో భుజంగం బుర్ర బొంగరంలా తిరిగిం ది. ఎన్నోరకాల చెప్పిచూసాడు. సామదానభేధో పాయాలు ప్రయోగించాడు. ఇలాంటి పరిస్థితి లో తగువు పెట్టుకోకూడదని దండోపాయం ప్రయోగించలేదు. అక్కడంతమందున్నారు. వాళ్లూ తనలాగే బిల్ కట్టడానికొచ్చినవారే. అందరూ బాధితులే. ఏ ఒక్కరైనా తనకి సపోర్ట్ రారా అని ఆశించిన అతడి ఆశ అడియాసే అయింది. వాళ్లెవరూ కలగజేసుకోలేదు సరి కదా! తిరిగి తనకే పాఠాలు చెప్పడం మొదలె ట్టారు కొందరు. తనను పిసినారిని చూసినట్టు చూసినవాళ్లు కొందరు. జాలిగా చూసేవాళ్లు కొందరు. చాటుగా నవ్వుకుంటున్నవాళ్లు కొం దరు. అందర్నీ చూస్తున్నాడు భుజంగం. నీర్సం వచ్చింది. అయినా ఫలితంలేదు. దాదాపు చేతు లు నులిపి బలవంతంగా లాక్కున్నట్టు లాక్కున్నా రు రెండురకాల దసరా మామూళ్లని.

అలా మొదలైన దసరా మామూళ్ల ప్రహస నం అలా అలా కొనసాగింది. ఉధృతమైంది. పాలుపోసేవాడు, కొళాయినీళ్లు ఇప్పేవాడు, పేపర్ వేసేవాడు, రోడ్డు తుడిచేవాడు, కాలువ తుడిసేవాడు, చెత్తలెత్తేవాళ్లు, ఇస్త్రీ చేసేవాడు... ఇలా వాళ్లు వీళ్లని లేదు... మనిషి ముఖం కన బడితే చాలు... దసరా మామూలడిగేసేవా రెవరోఒకరు.

కొన్నాళ్లు మామూళ్లివ్వకుండా తప్పించుకు న్నాడు. ఆ కాలంలో అతడు పడ్డ పాట్లు మా మూలు పాట్లు కాదు. కుక్కపాట్లు. ఇస్త్రీ బండి వాడికి దసరా మామూలు ఇవ్వకపోతే అసలు మడత బదులు మరో దగ్గర మడత వచ్చేటట్లు ఇస్త్రీ చేసేవాడు. దాంతో రెండు మడతలతో బట్టలు అసహ్యంగా తయారయేవి. పోనీ వాణ్ని మార్చి, మరొకడికి ఇద్దామంటే ఆ అవకాశమే లేదు. ఎందుకంటే ఆ కాలనీకంతటికీ వాడొక్కడే కాంట్రాక్ట్.

పాలవాడు కొలత తగ్గించి పొయ్యడమో, నీళ్లు ఎక్కువ కలిపేయడమో చేసేవాడు. వాడి దగ్గర వాడుక మానేద్దామా అంటే తన బడ్జెట్‌కి తగిన చవకలో మరెవరూ ఇవ్వరాచుట్టుపక్కల.

పేపర్‌బోయ్ ఒకరోజు ముఖానికి తగిలేట్టు పేపర్ విసిరాడు. మరో రోజు పూలమొక్కలకి నీళ్లు పోస్తుంటే ఆ నీట్లో పడేటట్లు విసిరేసాడు. అదీ ఇదీ కాకపోతే ఏదో ఒక ఎడిషన్ పేపర్ తప్పించేసేవాడు. వాడికేంపోయింది? నష్టపోతే ఏజంట్ కదా నష్టపోయేది. మానేసినా బాధ లేదు. మళ్లీ బుర్రతిని బుక్‌చేయడానికి సేల్స్ ప్రమోటర్స్ ఉండనే ఉన్నారాయె.

రోడ్డు తుడిచేవారు, కాల్వతీసేవారు సరేసరి. మొదటిరోజు వాళ్లింటి దగ్గర తుడవడం మానే




సారు. రాన్రాను వారి నిరసన తీవ్రతరంచేసి ఎక్కడెక్కడి చెత్తా కూడదీసి వాళ్ల గుమ్మం ముందు పోసేవారు. పనిమనిషి దగ్గర ఉండనే ఉంది పెద్దాయుధం. అదే నాగా పెట్టడం. వచ్చినా వదిలీ వదలకుండా, అరకొరగా తోమేసి, సబ్బుపిసర్లో, జిడ్డుముద్దలో ఉంచేసి కడిగిపడేసేది. కూరలమ్మేవాడు, ఘూర్ఖా, కేబుల్ కనెక్షన్ వాళ్లు, ఫోన్‌వాళ్లు, చిన్నచిన్న రిపేర్లు చేసే వాళ్లు వీళ్లంతా ఎవరి స్థాయిలో వారు నిరసన తెలిపి భుజంగాన్ని ఓడించి, దసరామామూలు పట్టుకెళ్లిపోయారు. ఆఖరుకి ఇంటికి రోజూ వచ్చే ముష్టివాడు కూడా ఘరానాగా మామూలు వసూలుచేసుకుని వెళ్లిపోయాడు. అయిదూ పదీ ఇస్తే తీసుకునే వాళ్లు కొందరైతే, పాతిక, ఏభైకి తగ్గనివాళ్లు కొందరు.

అలా అలా ఇచ్చీ ఇచ్చీ చివరికి పెద్దమొత్తం అప్పు చెయ్యవలసి వచ్చింది. అదైనా దసరా మామూళ్ల నిమిత్తమే. అప్పట్నుంచి అలా అప్పుల ఊబిలో చిక్కుకునే పరిస్థితులు తెచ్చిన దసరా మామూలు మాట వింటేనే చిర్రెత్తుకొస్తుంది. అందుకే ఇప్పుడీ ఆటోవాలా అలా అడిగేసరికి అంతలా రియాక్ట్ అయ్యాడు.

* * *

అనుకోకుండా మధ్యలో తెలివొచ్చింది కనకానికి. తన నిద్రాభంగానికి కారణమేమిటో తెలీక అటూఇటూ చూస్తోంది. ఫేన్ తిరిగే చప్పుడు తప్ప, అంతటా నిశ్శబ్దమే. కాకపోతే జాగ్రత్తగా గమనిస్తే ఏదో చిన్న ధ్వని. అది కూడా తనకు అతి దగ్గర్నుంచి వస్తూంది. అదేమిటో తెలుసుకోవాలని ఎంత ప్రయత్నించినా ఆ గదిలో అలముకున్న చీకటివల్ల ఏదీ స్పష్టంగా కన్పించని పరిస్థితి. అయినా అతి కష్టమ్మీద కనిపెట్టగలిగింది ఆ ధ్వని తన పక్కనున్న భర్త దగ్గర్నుంచని. నెమ్మదిగా తడుముకుంటూ వెళ్లి, అంచనామీద స్విచ్ నొక్కింది. స్టార్టర్ వీక్ అయిన ట్యూబ్‌లైట్ మధ్యతరగతి కుటుంబ యజమానిలాగా నీర్సంగా వెలిగింది. ఆ వెలుగులో అతి దీనంగా మొఖం పెట్టుకుని దిగులు

గా కూర్చున్న భర్త ముఖాన్ని చూసి ఒక్క క్షణం ఉలిక్కిపడింది. తర్వాత తేరుకుని నెమ్మదిగా అంది "ఎందుకండీ అంత టెన్షన్ పడుతున్నారు?" అని. ఎందుకంటే ఈమధ్య చాలా రోజుల్నుంచి భర్త అలాగే ఉండడం గమనిస్తోంది. కానీ ఇంతలా నిద్ర మానుకుని బాధపడుతున్నాడనుకోలేదు.

అలా అడిగిన కనకం మాట విన్న భుజంగం "ఏంచెయ్యమంటావు కనకం? చూస్తున్నావు కదా అప్పులు. ఇవన్నీ ఎలా తీర్చాలో అర్థంకావడంలేదు. అయినా కడుపు కింత తిన్నామనా? కంటికింపుగా ఒక బట్ట కట్టుకోవడానికి కొన్నామనా? లేకపోతే ఇల్లు కట్టామనా? పెళ్లి చేసామనా? దేనికి ఈ అప్పులు? అక్కడైదు, ఇక్కడ మూడు, మరో దగ్గర రెండు... ఇలా దొరికిన చోటల్లా అప్పులు వాడేసాను. ఇవన్నీ ఎలా తీరుతాయి చెప్పు?" పగటి వేషగాడ్ని అసురసంధ్య వేళలో చూసి, నిద్దట్లో జడుసుకున్న చంటి పిల్లాడిలా వణికిపోతూ అన్నాడు భుజంగం.

అతడ్నలా చూస్తూంటే జాలేసింది కనకానికి. కాని అంతలోనే కలిపురుషుడు ప్రవేసించిన ద్వాపరయుగం మనిషిలా మారిపోయింది. దానికి కారణం ఆమె మదిలో అప్పుడే వచ్చిన ఆలోచన. ఆ ఆలోచన ఆచరణలో పెట్టడానికి తగిన సమయమిదే. అందుకే నెమ్మదిగా పిలిచింది.

ఆ పిలుపులో ఆత్మీయత. కరెంట్ పోయిన మిట్టమధ్యాహ్నపు వేసవి వేళలోని మనిషి స్థితిలో ఉన్న తనకి, కూల్‌డ్రింగ్ తాగే స్ట్రాతో మొహం మీదుగా ఊదినట్లనిపించిందా పిలుపు.

ఆత్మీయంగా పిలిచిన ఆ పిలుపుతో "ఏమిటి?" అనడిగాడు కరిగిపోతూ.

"ఇలా బెంగెట్టుకుంటూ కూర్చుంటే ఏం ప్రయోజనం చెప్పండి! అయిందేదో అయిపోయింది. ఈ వడ్డీలు, అప్పులు... వీటన్నిటికంటే నన్నో మాట చెప్పమంటారా?" అడిగింది నెమ్మదిగా.

మండువేసవిలో కరెంట్ ఉన్న ఫ్రిజ్‌లోని కూలింగ్ వాటర్ దొరికినంత ఆనందమన్పించిందామాట. అలాంటపుడు వద్దనెలాగంటాడు?

మధ్యతరగతి మొగుళ్లని అంత సులువుగా నమ్మరాయిళ్లాళ్లు. కారణం? వారికేమాటంటే ఏ కోపమొస్తుందో తెలీదు. అందుకే నెమ్మదిగా అంది "చిరాకు పడనంటేనే" అని మాట తీసుకుని చెప్పడం మొదలెట్టింది.

"ఎలాగూ పదివేలు అప్పుంది. నెలకి వడ్డీ మూడునాలుగు వందలెలాగూ కట్టాలి కదా! ఎందుకంటే మూడు రూపాయలు, నాలుగు రూపాయలు లెక్కన వడ్డీకి వాడారు. దానిబదులు ఒక సులువు చెప్పనా?" అంది.

"చెప్పు'... అన్నాడు నెమ్మదిగా నడుంమీద చెయ్యివేసి రాస్తూ.

ఆ చర్యలోనే అతడి మనసెంత ఖుషీగా వుందో అర్థంచేసుకుని నెమ్మదిగా అంది... "మీరు ఎన్నాళ్లనుంచో నాకు నెక్లెస్ చేయిస్తానంటున్నారు.. కాని కుదరడంలేదు కదా?" అని ఆపేసి, "మీరు మాత్రం కోపగించుకోనంటేనే" అంటూ ఆగిపోయిందామె. ఎందుకంటే ఆమె మధ్యతరగతి ఇల్లాలు.

ఆ మాటకి భార్యమీద జాలేసింది. అప్పుడప్పుడు తన చిరాకు ప్రవర్తనకి సిగ్గనిపించి, "లేదులే... చెప్పు..." అన్నాడు ఆమెని ఒడిలోకి లాక్కుంటూ.

ఆమె చెప్పడం కొనసాగించింది "అక్కడా ఇక్కడా అప్పులకంటే మీ పి.ఎఫ్.లో లోన్ తీసుకుంటే అన్ని సమస్యలూ తీరిపోతాయి కదా. పాతికవేలు లోన్ తీసుకుంటే పదివేలు




అప్పు తీరిపోగా, మిగిలిన పదిహేనువేలు పెడితే తులంనర నెక్లెస్ వచ్చేస్తుంది. అదీకాక నెలకిప్పుడెలాగూ నాలుగు వందలు వడ్డీ కడుతున్నారు కదా. దానిమీద మరికొన్ని వందలు కలిపితే ఇరవై నెలల్లో మీ అప్పు తీరిపోతుంది. నాకు నక్లెస్ మిగిలిపోతుంది" అంది.

ఆ మాటతో "ఇదేదో బాగానే ఉందిలాగుంది" అనుకుని, అంతలోనే ఏదో గుర్తొచ్చి నతడు తుళ్లిపడ్డాడు. అంతలోనే తమాయించుకుని, "అయితే నీకూ దసరా మామూలు కావాలంటావ్! అంతేనా...?" అన్నాడు.

అలా అంటున్న అతడి ముఖం ప్రశాంతంగానే ఉందని గ్రహించినామె "దసరా వెళ్లిపోయి పదిహేను రోజులైపోయింది కదా! లోన్ శాంక్షన్ అయి, నక్లెస్ తయారయేసరికి సంక్రాంతి వస్తుంది కాబట్టి ఇది పండగ మామూలు" అంది.

ఆ మాటకి కిలకిలా నవ్వాడు భుజంగం. అంతలోనే మంచి సీన్‌లో కరెంట్ పోయిన టీవీ ప్రేక్షకుడిలా ముఖంపెట్టాడు ఏదో గుర్తొచ్చి.

పరమాన్నం నోట్లో పెట్టగానే కంకరరాయి పంటికి తగిలినట్లు ఏదో కీడు శంకించిన కనకం "ఏమైందండీ..." అంది. ఆమె ఆశకు అప్పటికే తిలోదకాలు ఇచ్చేసింది.

ఆ మాటకి భుజంగం "లోన్ శాంక్షన్ చెయ్యడానికీ మామూలివ్వాలి కాబోలు..." అన్నాడు.

అది విన్న కనకం తేలికగా నిట్టూరుస్తూ "మీరే అంటుంటారు కదా, "నూరు గేదెలని కడిగిన వాడికి ఒక సాలగ్రామం (దేవతా విగ్రహం) లెక్కా... అని" అంది.

ఆ మాటకి భుజంగం భార్యవైపు మెచ్చుకోలుగా చూస్తూ "ఏమైనా నువ్వు కూడా చమత్కారివేనోయ్" అన్నాడు ఆమెను కౌగలించుకుంటూ.

అతడి సమస్యకి పరిష్కారం చూపి, ఆమె ఆ క్షణంలో అందాలరాశిలా, అపరంజిబొమ్మలా ఇంకా ఇంకా... లా... లా... కనబడుతోందతడి కళ్లకి. అతడి మనసులో ఆనందభావనే ఆ సంతోషానికి కారణం. ●

# మామగారి బహుమతి

సౌమ్య, రవీంద్రలకు పెండ్లయి ఐదు నెల్లయింది. ప్రశాంతమైన గోదావరి మీద పడవలా కుదుపుల్లేకుండా సాగిపోతున్నది వారి కాపురం. అయితే పైకి శాంతంగా కనిపించే గోదావరిలో కొద్దిపాటి సుడిగుండాలున్నట్లు రవీంద్ర మనసు లోనూ కొంచెం అసంతృప్తి ఉంది. చదువుకున్నవాడూ, స్వతహాగా నెమ్మదైనవాడూ కాబట్టి ఆ అసంతృప్తి బయటపడకుండా జాగ్రత్త పడుతున్నాడు.

అయితే సౌమ్య మాత్రం అంత నెమ్మదైన అమ్మాయి కాదు. అలాని చెడ్డపిల్ల అసలేకాదు. ముక్కుసూటి స్వభావం. కుండ బద్దలుకొట్టినట్లు మాట్లాడే తత్త్వం. అభ్యుదయ భావాలు నరనరానా జీర్ణించుకున్న సంస్కారం.



ఇంతకూ రవీంద్ర అసంతృప్తికి కారణం ఏమిటంటే సౌమ్య తల్లిదండ్రులు తనకు కట్నం ఏమీ ఇవ్వలేదని. తన ఫ్రెండ్స్ అంతా ఎంచక్కా లక్షో లక్షన్నరో కట్నాలు తీసుకుని పెళ్లి చేసుకున్నారు. వాళ్లేమీ తనకంటే మంచి ఉద్యోగాలు చేసేవాళ్లు కాదు. అందగాళ్లూ కాదు. అయినా దర్జాగా కట్నాలు తీసుకుని నలుగురిలో గొప్పగా చెప్పుకుంటున్నారు.

"కట్నం ఎంత తీసుకున్నావురా" అని అడిగాడు స్నేహితుడు సుబ్రహ్మణ్యం ఒకరోజు. ఒంటరిగా ఉన్నప్పుడు అడగలేదు కూడాను. ఫ్రెండ్సందరితో ఉండగా అడిగాడు. దమ్మిడీ కూడా తీసుకోనప్పుడు అబద్ధం ఎలా చెప్పగలడు.

"నో డౌరీ" అన్నాడు తప్పుచేసినట్లు బాధపడుతూ.

"అదేమిట్రా" అని అడిగారు స్నేహితులందరూ.

"మనవాడిలో ఏదైనా లోపముందని అనుకున్నారేమోరా" అన్నాడు మరో ఫ్రెండ్ వెంకట్రావు.

సిగ్గుతో చచ్చేచావయింది రవీంద్రకు.

"పోనీ లాంఛనాలన్నా బాగా ఇచ్చారట్రా" అన్నాడు ఇంకో ఫ్రెండ్.

"లాంఛనాలా? అవేంటవి?" అడిగాడు రవీంద్ర.

"హోరి పనికిమాలినవాడా! నువ్వు పైకెట్లా వస్తావురా? కట్నానికి తోడు లాంఛనాలంటే అత్తమామల దగ్గర నుంచి ఎంత వీలైతే అంత పిండడమన్నమాట. సూట్లనీ, స్కూటరనీ, టీవీ సెట్టనీ, బ్రాస్‌లెట్టనీ – ఇలా సాధ్యమైనంత ఖర్చు మామచేత పెట్టించడమన్నమాట" అన్నాడు

# సిహెచ్.వి. బృందావనరావు

ం౦○౦ం

సుబ్రహ్మణ్యం.

"ప్చ్... మామగారు నాకలాంటివేవీ ఇవ్వలేదు" అన్నాడు రవీంద్ర.

"సరేలే, రేపు సంక్రాంతికి మాత్రం స్కూటరిచ్చిందాకా వదిలిపెట్టబాక" అన్నాడు వెంకట్రావు.

"నాకు అది కావాలనీ, ఇది కావాలనీ అడుక్కోడం ఎలారా?" అన్నాడు రవీంద్ర నీళ్లు నములుతూ.

"అల్లుడంటే అలాంటివేమీ మనస్సులో పెట్టుకోగూడదురూ. సిగ్గూ, శరమూ, మానము, అభిమానమూ ఇట్లాంటివేమీ అల్లుడికి వుండగూడదు. ఉంటే పైసా కూడా రాలదు మామ దగ్గర్నించి" అన్నాడు మరో స్నేహితుడు.

"పోనీ నువ్వు అడగలేకపోతే నీ భార్యచేత అడిగించరా" అన్నాడు సుబ్రహ్మణ్యం.

తనకు స్కూటరు కావాలని, మీ నాన్నను అడిగి అది ఇప్పించమనీ సౌమ్యను అడిగితే ఏమౌతుందో ఊహించి, అలాంటి ప్రయత్నం ఏమీ చేయదలచుకోలేదు రవీంద్ర.

"సంక్రాంతి పండక్కి ముందురోజు, తర్వాతా రెండు రోజులూ ఆఫీసుకు సెలవు పెట్టు రవీ" అంది సౌమ్య ఓ రోజు.

"ఎందుకు?" అడిగాడు రవీంద్ర.

"మనం మా అమ్మానాన్నలతో పండగ రోజులు గడపడానికి పోతున్నాం. మా నాన్న ఫోన్‌చేసి పిల్చాడు కదా" అంది సౌమ్య.

"అలాగే" అని కొంచెంసేపాగి "మా వెంక

ట్రావుగాడు పోయిన సంక్రాంతికి అత్తగారింటి కెళ్లి, వాళ్ల మామనడిగి డబుల్ డోర్ ఫ్రిజ్ తెచ్చుకున్నాడు తెలుసా" అన్నాడు రవీంద్ర.

"అయ్యో పాపం" అంది సౌమ్య.

"అయ్యోపాపమేంటి? ఇందులో జాలిపడే దేముంది" అన్నాడు రవీంద్ర.

"పాపం వాడి జీతం వాడికి చాలడంలేదు గామాల. సొంతంగా కొనుక్కోగల స్తోమత లేదేమో. వాండ్ల మామగార్ని యాచించి అదేదో ఫ్రిజ్ ముష్టేయించుకున్నాడంటే జాలిపడక మెచ్చుకోవాల్నా" అంది సౌమ్య.

సౌమ్య చెప్పిన పద్ధతిలోని అసహ్యము, కోపము, వెటకారమూ గ్రహించిన రవి ఇంక ఈ సంభాషణను పొడిగించాలనుకోలేదు.

"అయినా నా ఫ్రెండుని నువ్వు 'వాడు, వీడు' అనడమేమైనా బాగుందా".

"నిజమే. ఏమాత్రం బాగాలేదు. మామను పీడించి, అతని కష్టసుఖాలు గమనించక అవీ ఇవీ కావాలని సాధించే వాండ్లని వెధవ అనో, అడ్డగాడిద అనో అనాలిగాని, 'వాడు వీడు' అంటం ఏం బాగుంటుంది? యు ఆర్ కరెక్ట్ రవీ" అంది సౌమ్య.

"అసలు నిన్ను కాదు అనాల్సింది. నీకు 'సౌమ్య' అని పేరు పెట్టాడే మీ నాన్న... ఆయన - ఆయన కాళ్లకు మొక్కాలి" అన్నాడు రవీంద్ర ఉక్రోషంగా.

సౌమ్య నవ్వి "అదెంత భాగ్యం. అందుకే కదా పండక్కి మాఊరు వెళదామనేది" అంది.

వాతావరణం కొంచెం తేలికపడడంతో తను చెప్పాలనుకున్నది చెబ్దామనుకున్నాడు రవీంద్ర. "నాకో స్కూటర్ కావాలి" అన్నాడు.

"నిజమే రవీ. ఆఫీసు చాలా దూరమాయె. స్కూటర్ లేకుంటే ఎట్లా? అందరు ఆడ పిల్లల్లాగా స్కూటర్ వెనక్కూచుని పొయ్యేదాని కన్నా, నేనే డ్రైవ్‌చేస్తూ - నిన్ను వెనకెక్కించుకుని పోవాలని నాకు ఎప్పట్నించో ఉంది. ఇప్పుడు ప్రతి దానికీ బ్యాంకులు లోన్లిస్తున్నాయట కదా. రేపే ఏదైనా బ్యాంకులో కనుక్కో. అన్నట్టు స్కూటరు నడపడం నువ్వూ నేర్చుకో. రోజూ నిన్ను ఆఫీసులో డ్రాప్‌చెయ్యడం నాక్కుదరకపోవచ్చు" అంది సౌమ్య.

"నేను బ్యాంకు లోను తీస్కోవడం కాదు. మీ నాన్నకు చెప్పు ఓ స్కూటర్ కొనిమ్మని" అన్నాడు రవీంద్ర భయం భయంగానే.

అప్పుడు సౌమ్య చూసిన చూపుకు, ఆమె కళ్లల్లోకి చూడలేకపోయాడు రవీంద్ర. తన ప్రవర్తన సరిగా ఉన్నట్లు తనకే అనిపించలేదు. అసహ్యం నిండిన కళ్లతో అతనివైపు చూసి లోపలికి పోయింది సౌమ్య. బరువైన నిశ్శబ్దం ఆక్రమించుకొంది ఆ ఇంటిని ఆ రోజంతా.

సంక్రాంతికి సౌమ్య పుట్టింటికి పోయినారు రవీంద్ర, సౌమ్యా. పండగ నాల్రోజులూ చాలా సంబరంగా గడిచిపోయాయి. రోజూ రకరకాల పిండివంటలు చేసారు. ప్రేమగా అల్లుడికి తినిపించారు. సంప్రదాయంగా కూతురికి, అల్లుడికీ బట్టలు పెట్టారు. మరదలు, బావమరిదితో ఉల్లాసంగా గడిపాడు రవీంద్ర. ఊరిలోని తన స్నేహితులకు, ఇరుగుపొరుగులకూ అల్లుణ్ని ఎంతో గర్వంగా పరిచయం చేసాడు మామగారు. బావమరిదైతే తనను వదిలి ఉండనేలేదు. ఒక ఆత్మీయమైన ఆనందానుభవపు వాతావరణాన్ని అనుభవించాడు రవీంద్ర ఆ నాలుగు రోజులూ. తిరిగి వాళ్ల ఊరు వచ్చారు సౌమ్యా, రవీంద్రలు. మామ గారింట్లోని పండగ ఆత్మీయ

తల ఆనందంలో – మామగారు స్కూటరు ఇవ్వ లేదనే కొరత అడుగున పడిపోయినా – అంతర్ధా నం మాత్రం కాలేదు.

"మీ నాన్న పండక్కి స్కూటరిస్తాడనుకు న్నాను"

"నేను కూడా మీ నాన్న నాకో మైక్రోవేవ్ ఓవెను, గ్రైండరూ ఇస్తాడనుకున్నాను".

ఆశ్చర్యపోయాడు రవీంద్ర. "అదేంది? మా నాన్న నీకెందుకివ్వాల?".

"మా నాన్న నీకెందుకు స్కూటరివ్వాల?" అంది సౌమ్య.

"నేను అల్లుడిని. నాకు స్కూటరిస్తే తన కూతురుకిచ్చుకున్నట్లే కదా!".

"నేను కోడల్ని. నాకు ఇస్తే తన కొడుక్కు ఇచ్చుకున్నట్లే కదా!".

"అల్లుడూ, కోడలూ ఒక్కటేనా?"

"ఏం ఎందుక్కాదు?"

"నేను ఉద్యోగం చేసి డబ్బులు సంపా దిస్తున్నాను".

"నేను ఇంట్లో చాకిరీ చేసి డబ్బు సంపాది స్తున్నాను".

"అదెలా?"

"రోజూ వంట చేస్తున్నాను. గుడ్డలు ఉతుకు తున్నాను. అంట్లు తోముతున్నాను. ఇల్లు తుడు స్తున్నాను. వంటమనిషికి, చాకలి మనిషికి, పని మనిషికీ మార్కెట్ రేటు ప్రకారం లెక్కకట్టు. ఆ మేరకు నేను సంపాదిస్తున్నట్లా కాదా?" అంది సౌమ్య.

ఏమీ జవాబు చెప్పలేక అన్నాడు రవీంద్ర "నేను మగాణ్ని".

అన్నాడుగాని తన వాదన తనకే సంతృప్తి కరంగా లేదు.

"నువ్వు మగాడివైతే, నేను ఆడదాన్ని" అంది సౌమ్య.

"నేను ఆడదాన్ని అని గొప్పగా చెప్పుకుం టున్నావు. అదేమైనా క్రెడిటా".

"నేను మగవాణ్నని నువ్వు గొప్ప క్రెడిట్‌గా చెప్పుకున్నావుకదా. చూడు రవీ... సంసారం లో భార్య భర్తలిద్దరూ సమానమే. ఒకరెక్కువ, ఒకరు తక్కువ అనేది లేదు. ఇది చాలా సింపుల్ విషయం. అలాగే సమాజంలో కూడా పురుష లూ స్త్రీలూ సమానమే. ఎవరూ ఎక్కువా కా దు, ఎవరూ తక్కువా కాదు. నువ్వింత చదువు కున్నావు. వివేచన ఉంది. కానీ నాలుగైదు శతాబ్దాల వెనకటి వాడిలాగా ఆలోచిస్తున్నావు. ఎక్కువ తక్కువలు ఫీలైతే ఏ కాపురమూ సుఖం గా జరుగదు. నాకు నిద్రొస్తోంది. గుడ్‌నైట్" అని పక్కకు తిరిగి పండుకొన్నది సౌమ్య.

చాలాసేపు నిద్రపట్టలేదు రవీంద్రకు. నిజ మే. తాను పోస్ట్‌గ్రాడ్యుయేట్. బాగా చదువుకు న్నాడు. కాస్తోకూస్తో సాహిత్య పరిచయమూ ఉంది. శ్రీశ్రీ, ఆరుద్ర, రావిశాస్త్రి లాంటి వాళ్ల రచనలు ఇష్టంగా చదువుతాడు. తన తెలివితే టలు ఏమైనాయి... ఇంత అసంబద్ధంగా ఆలో చించడానికి. సుబ్రహ్మణ్యం, వెంకట్రావూ లాం టి స్నేహితుల ప్రభావానికి తానూ లోనవుతు న్నాడుగాని, తన స్వంత విచక్షణను ఉపయో గించడంలేదు. ఏదో సినిమా పాటలో చెప్పినట్లు 'చదువుల సారం, సంసారమునకై పదిలము" చేయకపోతే ఆ చదువుకు ఏం ప్రయోజనం? తన మామగారు ఓ మధ్యతరగతి సంసారి. నేను సులభంగా కొనుక్కోగల వస్తువు కోసం

ఆయన్ను బాధపెట్టడం ఏమిటి. బాధపెట్టడం అలా ఉంచితే, ఇంకో వ్యక్తిని నాకు ఇది ఇమ్మని దేబిరించడం ఎంత ఆత్మ గౌరవంలేని పని. సౌమ్య ఎంత ఉత్తమురాలు. మాట కొంచెం ఖచ్చితంగా ఉంటుందిగాని ఆమె మాట్లాడిన దాంట్లో తప్పేమున్నది. నేనే సంస్కారం లేకుండా ప్రవర్తిస్తున్నాను" అని చాలాసేపు వితర్కించుకొని మనసు తేటపరచుకొని నిద్రకు ఉపక్రమించాడు రవీంద్ర.

సౌమ్యకూ నిద్రరాలేదు. 'ఇంత చదువుకున్న రవి ఇంత కుసంస్కారంగా ఎలా ఆలోచిస్తున్నాడు. మనిషి చాలా మంచివాడు. నెమ్మదస్తుడు. ఎవరితోనూ ఏనాడూ కఠినంగా ప్రవర్తించడు. ప్రేమమూర్తి. బహుశా స్నేహితులు మాట్లాడే మాటల ప్రభావం ఆయనకే తెలీకుండా ఆయన మీద పనిచేస్తుండవచ్చు. ఈ రోజు సమాజంలోని పరిస్థితులు అలాగే ఉన్నాయి మరి. మామూలుగా చెప్పేదానికి

## AVM ...



అది 2222 సంవత్సరం.

మహర్షి, మానసలకు ఒకే ఆఫీసులో పని.

మానసకు మూడో నెల. అందుకే మానస తల్లితండ్రులు పరువుకోసం ఒప్పుకున్నారు. మహర్షి వాళ్లకి నిజాయితీ ఇంటి పేరు.

కులాలు వేరైనా, ఇద్దరి ప్రేమనూ అంగీకరించి, ఒకటి అవడానికి శుభముహూర్తం నిర్ణయించారు పెద్దలు.

మహర్షి, వాళ్ల బంధువులతో దిల్‌షుక్‌నగర్ నుంచి ఆర్టీసీ క్రాస్‌రోడ్‌లోని కళ్యాణమండపానికి టాక్సీలో బయలుదేరాడు.

ఒక కిలోమీటరు వెళ్లారో లేదో ట్రాఫిక్ జామ్ అయి, మధ్యలో ఇరుక్కుపోయారు.

అవతల మానస వాళ్లు వీడియో సెల్‌ఫోన్లు, ఇటు మహర్షి వాళ్ల వీడియో సెల్‌ఫోన్లు విరామం లేకుండా మోగుతున్నాయి. పెద్ద పెద్ద వాళ్లతో సంప్రదించినా ట్రాఫిక్ జామ్ నుంచి బయటకు రాలేకపోయారు.

ఆ విధంగా ఆర్నెల్లపాటు ఆ ట్రాఫిక్‌లోనే ఉన్నారు.

మానస ఎదురుచూపులతో కళ్యాణమండపంలోనే ప్రసవించి, పండంటి మగబిడ్డకు జన్మనిచ్చింది. వాడు పుట్టిన వేళావిశేషం బావుండి, ఆ తర్వాత రోజుకి మహర్షి వాళ్లు కళ్యాణమండపానికి చేరారు.

పుత్రుడి సమక్షంలో రికార్డెడ్ బాజాభజంత్రీలతో మహర్షి, మానసలు ఒకటయ్యారు ఆనందంగా.

తర్కవితర్కాలు చేసి నేనే రవిని రెచ్చగొడుతున్నా నేమో. ఇంకొంచెం సౌమ్యంగా ప్రవర్తిస్తూ, ప్రేమగా మాట్లాడుతూ రవిని మార్చుకోవచ్చు. రవి ఉత్తముడు. అతని ఆలోచనలను సరైన దారిలో పెట్టడం కష్టంకాక పోవచ్చు' ఇలా ఆలోచిస్తూ నిద్రపోయింది సౌమ్య.

నాల్రోజుల తర్వాత "సౌమ్యా, మనం ఉగాది పండక్కి మీ ఊరు పోతున్నాం" అన్నాడు రవి.

"సంక్రాంతికే గదా పొయ్యొచ్చాం. రెణ్నెల్లు కూడా కాలేదు కదా" అంది సౌమ్య.

"ఆ పండక్కి వాండ్లు పిలిస్తే పొయ్యాం. ఈ పండక్కి మనమే పోదాం. ఏం... పిలవకుండా పోగూడదా" అన్నాడు రవి.

"ఛఛ... అదేంలేదు. పండక్కి మన వాండ్లింటికి మనం పోవచ్చు. పిలుపే కావాలా?" అంది సౌమ్య.

ఉగాదికి వచ్చిన కూతుర్ని, అల్లుణ్నీ చూసి సంతోషించారు అత్తమామలు. పదో తరగతి చదివే మరదలు, ఇంటర్ రెండో సంవత్సరం పరీక్షలు రాయబోయే బావమరిదీ – బావను, అక్కనూ చూసి సంబరపడ్డారు. పండగ సంతోషంగా గడిచిపోయింది. పండగరోజు సాయంత్రం తాను సౌమ్యక్కూడా తెలీకుండా తెచ్చిన పంచెలచాపు, షర్ట్‌పీసూ మామగారికిచ్చి, వెంకటగిరి చీర సౌమ్యచేత అత్తగారికి ఇప్పించాడు రవీంద్ర.

"ఇదేంది బాబూ, మేము కదా ఇవ్వాల్సింది" అంది అత్తగారు.

"సంక్రాంతికి మీరు ఇచ్చారు. ఈ పండక్కి మమ్మల్నివ్వనీయండి. ఇచ్చిపుచ్చుకోవడాలకు ప్రేమలు కారణం కావాలిగాని, అవి మొండి ఆచారాలై ఇబ్బందులు కలిగించకూడదు. తీసుకుని మమ్మల్ని దీవించండి" అన్నాడు రవీంద్ర. సంతోషించారు అత్తామామలు. సౌమ్యకు నిజంగా ఆశ్చర్యం వేసింది.

మర్నాడు ఊరికి బయలుదేరారు సౌమ్య, రవీంద్ర. రవీంద్ర మామగారు అల్లుడి దగ్గరకు వచ్చి ఓ ఇరవై వేల రూపాయల చెక్కు ఇచ్చి "బాబూ, నేను సంక్రాంతికే ఇద్దామనుకున్నాను. కానీ దబ్బు సర్దుబాటు కాలేదు. ఈ ఇరవైవేలు తీసుకుని, మిగిలిన దబ్బు నువ్వు వేసుకుని ఓ స్కూటర్ తీసుకో" అన్నాడు.

రవీంద్ర నవ్వి, ఆ చెక్కు తీసుకుని, బావమరిదిని దగ్గరకు పిలిచి అతని చేతిలో చెక్కు పెట్టి "నీ ఇంటర్మీడియేట్ పరీక్షలు కాగానే ఓ మోపెడ్ తీసుకో. అక్కర్లేదనుకుంటే ఆ దబ్బు నాన్నగారికిచ్చెయ్" అని మామగారి వైపు తిరిగి "మామగారూ, నాకు ఇంతకుముందే ఓ బహుమతి ఇచ్చారు. ఇప్పుడింకేమీ అవసరంలేదు" అన్నాడు.

"నేను, నీకు బహుమతి ఇచ్చానా?" ఆశ్చర్యంగా అడిగారు మామగారు.

రవీంద్ర సౌమ్యను చూపిస్తూ, "మీరు ఇచ్చిన ఈ బహుమతి నా జీవితం మొత్తం సంతోషంగా గడపడానికి సరిపోతుంది. ఇంకేమీ ఇవ్వాలనుకోకండి" అన్నాడు.

బస్సు ఎక్కి కూచున్న తర్వాత సౌమ్య రవీంద్రతో "రవీ, ఇవ్వాళ నువ్వు నాకు భలే ముద్దొస్తున్నావోయ్" అంది.

రవీంద్ర సౌమ్య కళ్లల్లోకి చూస్తూ "ఇంటికి పోయిందాకా ఆగుతావా, లేక బస్సులోనే ఏదైనా హడావిడి ప్రోగ్రాం పెట్టుకున్నావా?" అన్నాడు సీరియస్‌గా. ●

# ఆత్మసంతృప్తి

"ఫెంటాస్టిక్!"

"ఎక్సలెంట్"

"మార్వలెస్"

ఒక్కొక్కరుగా వచ్చి అంతా అభినందించేరు. అన్యమనస్కంగానే ప్రతిస్పందించేడు గౌతమ్. ఆర్ద్రమైన మదిని ప్రశంసల జల్లు స్వాంతన పరచలేకపోయింది.

ఏ పని చేసినా పర్‌ఫెక్టుగా చేయాలన్నది మొదటినుంచి గౌతమ్ మతం. ఆ తపనే గౌతమ్‌ని ఉన్నత స్థితికి చేర్చింది. కానీ, చిత్రంగా ఆ తపనే గౌతమ్ వ్యాకులతకు కారణమయ్యింది ఈనాడు.

గౌతమ్ ఫ్రెండ్ ఓ అప్‌కమింగ్ ఫిల్మ్ డైరెక్టర్. మంచి కథతో అతని కొత్త చిత్రం షూటింగ్ జరుపుకుంటోంది. అంతా కొత్తవాళ్లే నటిస్తున్న ఆ చిత్రంలో ఓ పాత్రకు గౌతమ్ న్యాయం చెయ్యగలడనిపించి అతన్ని ఎప్రోచ్ అయ్యేడు శ్రీరాం.

శ్రీరాం ప్రపోజల్ని సున్నితంగానే తిరస్కరించేడు గౌతమ్.

"ఎందుకు నువ్వు ఒప్పుకోవటంలేదో తెలుసుకోవచ్చా?" అడిగేడు శ్రీరాం.

"నీకు తెలుసుగా ఏ పని చేసినా పర్‌ఫెక్టుగా చెయ్యాలి. అలా చెయ్యకపోతే నాకు నచ్చదు."

"అందుకనేగా ఆ క్యారెక్టర్ నిన్ను చెయ్యమని అడుగుతోంది. నువ్వయితేనే ఆ పాత్రకు జీవం పొయ్యగలవు. నా మట విని ఒప్పుకో."

"నీకు తెలుసుగా నేనెంత బిజీగా ఉంటానో. ప్రొద్దుట ఆఫీసుకు బయలుదేరితే ఏ రాత్రికో ఇంటికి చేరుకుంటాను. నా వ్యక్తిగత పనులకే నేను సమయం కేటాయించలేకపోతున్నాను. నేను చెయ్యిలేను" హెల్ప్‌లెస్‌గా అన్నాడు గౌతమ్.

"నిన్ను పెద్దగా ఇబ్బంది పెట్టను గౌతమ్. షూటింగ్ రెండురోజులే ఉంటుంది. అది కూడా నీకు వీలయిన వీకెండ్‌లోనే పెట్టుకుందాం."

శ్రీరాం ప్రతిపాదనకు కొద్దిగా మెత్తపడ్డాడు గౌతమ్. తన పాత్రకు సంబంధించిన షూటింగ్ రెండు రోజుల్లో అయిపోతుందంటే ఒప్పుకోవచ్చు అనిపించింది.

అన్విత కూడా గౌతమ్‌ని స్క్రీన్ మీద చూడాలని సరదాపడింది.

అలా ఫ్రెండ్ డైరక్టు చేస్తున్న ఆర్ట్‌ఫిలింలో నటించటానికి అంగీకరించాడు గౌతమ్.

గౌతమ్ కారెక్టరుకు సంబంధించిన స్క్రిప్ట్ ముందుగానే ఇచ్చేశాడు శ్రీరాం.

స్క్రిప్ట్‌ని శ్రద్ధగా ఆకళింపు చేసుకున్నాక మరింత సహజత్వం కోసం పాత్రను పోలిన

వ్యక్తులను నిశితంగా గమనించసాగేడు గౌతమ్. ఒక ఆదివారం వారి మధ్యనే గడిపేడు కూడా.

అనుకున్నదానికన్నా అద్భుతంగా ఉంది గౌతమ్ పెర్ఫార్మెన్స్ మొదటి రోజు షూటింగ్ లో. రెండవ రోజు షూటింగ్‌కి అన్విత కూడా వచ్చింది.

హాస్పిటల్లో జరిగే సన్నివేశాన్ని చిత్రీకరిస్తున్నాడు శ్రీరాం.

పాత్రపరంగా గౌతమ్ అంధుడు. కొత్త ప్రదేశంలో పరిసరాలు అలవాటు లేక చిన్న ఏక్సిడెంట్‌కు గురయ్యి హాస్పిటల్లో ఎడ్మిట్ అవ్వాల్సి వస్తుంది. గౌతమ్ పక్క బెడ్ మీద తీవ్ర అనా

# పులిపాక కనకదుర్గ

రోగ్యంతో బాధపడుతున్న చిన్న పాప ఉంటుంది. పాపకు గౌతమ్ అంధుడన్న విషయం తెలియదు. ఇద్దరి మధ్యన చక్కని స్నేహం చిగురిస్తుంది.

గౌతమ్ బెడ్ కిటికీ పక్కన ఉంటుంది. అనేక రోజులగా బెడ్ మీద లేవకుండా పడుకున్న చిన్నారి పాప కిటికీలోంచి బయట ప్రపంచాన్ని చూసి ఆ విశేషాలు తనకు చెప్పమని గౌతమ్‌ని అడుగుతుంది.

పాపకు తను అంధుడినన్న నిజం చెప్పి



నిరుత్సాహపరచడం ఇష్టం లేక గౌతమ్ ఆ నిజాన్ని పాపకు చెప్పడు. కిటికీ దగ్గర కూర్చుని బయట ప్రపంచం అంతా తను చూడగలుగుతున్నట్టుగా నటిస్తాడు. తన ఊహల్లో ప్రపంచాన్ని తను చూసినట్టుగా పాపకు వైనవైనాలుగా వర్ణిస్తాడు.

కిటికీ బయట అందమయిన తోట ఉన్నట్టుగా, అక్కడ చిన్నారుల ఆటలని, స్వాగతించే పూబాలలని, పక్షుల కుహూరావాలనీ హృద్యంగా వివరిస్తాడు.

గౌతమ్ చెప్పినవన్నీ నిజాలని నమ్ముతుంది పాప.

గౌతమ్ పంచిన ఆత్మీయతవల్లా, ఉల్లాసంవల్లా అనూహ్యంగా పాప కోలుకుంటుంది. మందులకంటే ఎక్కువగా సాటి రోగి పంచిన ఆత్మీయత పాపకు ఆరోగ్యం చేకూరుస్తుంది.

ఇదీ గౌతమ్ పాత్రకు సంబంధించిన కథ.

తను చేసే ఏ పనిపట్లయినా అంకితభావం కనబరిచే గౌతమ్ పాత్రకు నిజంగానే జీవం పోశాడు. నిజంగానే అంధుడేమో అనిపించేంతగా పాత్రలో ఇమిడిపోయడు. షూటింగ్ పూర్తయిన వెంటనే అతనిపైన ప్రశంసల జల్లు కురిసింది.

"అద్భుతంగా నటించారు" భుజం మీద చెయ్యి వేసి ఆఖరున వచ్చి అభినందించింది అన్విత.

వీడ్కోలు చెబ్తూ చెక్ కవర్లో పెట్టి ఇచ్చేడు శ్రీరాం గౌతమ్ వద్దంటున్నా వినకుండా. కారుదాకా వచ్చి సెలవు తీసుకున్నాడు శ్రీరాం.

తాము ఇటీవలే కొన్న కొత్త ఫోర్డ్ కారులో ఇష్టంగా కూర్చుంది అన్విత.

ఆ కారు కొనటానికి ముందు తాము ఎన్ని కార్లు చూసిందీ గుర్తు తెచ్చుకున్నాడు గౌతమ్. అన్ని విధాలా తమ స్టాటస్‌కు తగినట్టుగా ఉండాలని ఫోర్డ్ కారుని ఎంపిక చేసుకున్నారు గౌతమ్, అన్విత దంపతులు.

అసలు ఒక్క కారేమిటి? తను, తనకు సంబంధించిన ప్రతిదీ 'ది బెస్ట్'గా ఉండాలన్నది గౌతమ్ పాలసీ. ఆ తపనతోనే చదువులో అందరికన్నా ముందు ఉండేవాడు. ఆ తపనతోనే అత్యుత్తమమయిన కంప్యూటర్ ఇంజనీర్ కాగలిగేడు, అన్నివిధాలు తనతో భావసారూప్యత కలిగిన అన్వితను జీవిత భాగస్వామిగా చేసుకున్నాడు.

అన్విత కూడా అత్యుత్తమ మేనేజ్‌మెంట్ ఇనిస్టిట్యూట్ నుంచి ఎం.బి.ఏ. చేసింది. ఫారిన్ బేస్‌డ్ కంపెనీలో టీం లీడర్‌గా వర్క్ చేస్తోంది.

"నాక్కూడా పెయింటింగ్ అంటే ఇష్టం. ఎప్పటికయినా నేను వేసిన చిత్రాలతో ఎగ్జిబిషన్ పెట్టాలి" ఉత్సాహంగా అంది అన్విత.

డ్రైవింగ్ మీద నించి దృష్టి మరల్చకుండానే అన్విత మాటలకు "ఊ" కొడుతున్నాడు గౌతమ్.

"అన్నట్టూ... అన్నయ్య వాళ్లు బెంజ్‌కారు తీసుకున్నారట. ఇంకొక ఫైవ్ ఇయర్స్ కష్టపడితే మనం కూడా బెంజ్ మెయిన్‌టెయిన్ చెయ్యగలం."

గౌతమ్‌కు ఎంతో ఇష్టమయిన టాపిక్.

ఎదుగుదల... నిరంతరమయిన ఎదుగుదల. దానితోబాటే వచ్చే మనీ, స్టాటస్, థ్రిల్.

అన్విత మాటలు ఎప్పటిలాగా థ్రిల్‌ని కలిగించటంలేదు. పైపెచ్చు కొత్త సందేహం ఒకటి కలిగింది. 'అసలు ఎదుగుదల అంటే ఏమిటి?

దానికి అవధి ఏమిటి?'

ఇల్లు చేరేసరికి సందేహం మహావృక్షమయ్యింది.

ఆయా దగ్గర ఆడుకుంటున్న పాప ఒక్క ఉదుటున తల్లిదండ్రుల దగ్గరకు వచ్చింది.

ఆయా కళ్లల్లో పెద్ద రిలీఫ్.

పాపను అప్పగించి వెళ్లిపోయింది.

ముందుగా అన్విత ఫ్రెషప్ అయ్యి వంట మనిషి సాయంత్రమే వండి ఉంచిన అయిటమ్స్ తిరిగి వేడి చేసి టేబుల్ మీద సిద్ధం చేసింది.

గౌతమ్ స్నానం చేసి రాగానే భోజనానికి ఉపక్రమించారు.

"మా సీనియర్ సంజయ్ టూ క్రోర్స్ పెట్టి డ్యూప్లెక్స్ హౌస్ కొన్నాడట. నెక్స్‌ట్ సండే గ్రాండ్‌గా పార్టీ ఇస్తున్నాడు" భోజనాల మధ్యన చెప్పింది అన్విత.

నిరాసక్తంగా విన్నాడు గౌతమ్.

ఎందుకనో మనసంతా కారణం తెలియని అసంతృప్తి. ఇదీ అని చెప్పలేని అశాంతి. ఇంత కాలం తానెరుగని అలజడి. ఏదో తెలియని తపన, వేదన.

పరాకుగా ఉన్న గౌతమ్‌ని ఆశ్చర్యంగా గమనిస్తోంది అన్విత. ఇన్నేళ్ల సాహచర్యంలో తానెన్నడూ ఎరగని వ్యాకులత, నిరాసక్తత గౌతమ్‌లో.

కారణం అడగాలనుకుని మిన్నకుండిపోయింది. ఒంటరిగా వదిలేస్తే అతనే సర్దుకుంటాడని, లేదంటే తనే నిదానంగా విషయం చెప్తాడని ఊరకుండిపోయింది.

గౌతమ్‌నే గమనిస్తూ తెలియకుండానే నిద్రలోకి జారుకుంది అన్విత.

గౌతమ్ మీద నిద్రాదేవి అలకబూనినట్టుంది. కంటి మీద కునుకు వాలే సూచనలు ఎంతకూ కనిపించలేదు.

అశాంతి ఘనీభవించి మనసు భారమయ్యింది.

ఏ.సి. చల్లదనం, కంఫర్టబుల్ బెడ్ మెత్తదనం ఎందుకనో ఆవేదనను మరింతగా పెంచుతున్నట్టుగా తోచింది.

ఇంత వరకూ గౌతమ్ ప్రపంచంలో కెరీర్, స్టాటస్, నిరంతర ఎదుగుదల లాంటి వాటికి మటుకే చోటు ఉండేది. కానీ ఈ నాడెందుకో జీవితం అసంపూర్ణంగా తోస్తోంది. అసంకల్పితంగా శ్రీరాం గుర్తుకొచ్చేడు.

ఎంత అద్భుతమయిన సృజన శ్రీరాంది!

అడుగు వెయ్యటానికి పరుల మీద ఆధారపడిన అంధుడు ఓ చిన్నారికి ప్రాణం పొయ్యడం ఎంత ఉన్నతమయిన ఆలోచన!

'మరి అన్నీ సవ్యంగా ఉన్న తను? ఎంతసేపూ తన ఉన్నతి గురించి మాత్రమే ఆలోచించేడు. అశాంతికి, అలజడికి మూలం తెలిసినట్టనిపించింది.

మళ్లీ శ్రీరాం గుర్తుకొచ్చేడు.

ఇంతకాలం తనదయిన పరిధిలో జీవిస్తున్న తనకు జీవితానికి సార్ధకతను, పరిపూర్ణతనూ కలిగించే మానవీయకోణాన్ని ఆవిష్కరింపజేశాడు.

అంతా కమర్షియల్‌గా మారుతున్న ప్రపంచంలో మానవత్వపు ఉనికిని చాటిన శ్రీరాం భగవంతుడి దూత కాబోలు.

అందుకే అన్నారు 'అన్ని జన్మలలోకి మానవ

జన్మ ఉత్కృష్టమయినదని!'

సృష్టిలో లోపాలు ఎన్నవచ్చు.

ఉన్నతమయిన మానవత్వం ఆ లోపాలను సరిజేసింది.

ప్రకృతి వైపరీత్యాలను ప్రసాదిస్తే, మనిషి అధిగమించడం తెలుసుకున్నాడు.

భగవంతుడుకి ధీటయినది మనిషి మేథ.

అంతటి ఉన్నతమయిన మేథ స్వప్రయోజనాలకు మాత్రమే పరిమితం కావటం సమంజసంగా అనిపించలేదు గౌతమ్‌కు.

తన చుట్టూ వెతలు, వేదనలూ.

తనకేమీ పట్టనట్టు తన మానాన తను, తనమటుకు తను సంతోషంగా ఉండటం అసాధ్యం అనిపించింది.

ఆలోచన అశాంతికి, అశాంతి ఓ సంకల్పానికి అంకురమయ్యింది.

'సంకల్పం భగవంతుడిదయినా ఆచరణ మనిషిదే. ప్రేరణ దైవానిదయినా సాధించేది మానవుడే' నిద్రలోకి జారుకునే ముందు అనుకున్నాడు గౌతమ్.

ఉదయం నిద్ర లేచిన గౌతమ్‌లో నూతన ఉత్తేజం.

ముఖంలో ఓ కొత్త కాంతి.

బ్రేక్‌ఫాస్ట్ చేస్తుండగా చెప్పింది అన్విత "ఫ్రెంచ్ నేర్చుకోటానికి సాయంత్రం నుంచి ముద్ర ఇనిస్టిట్యూట్‌కు వెళ్తున్నాను."

"ఇప్పుడు ఫ్రెంచ్ నేర్చుకోవాల్సిన అవసరం ఏముంది? అడిగేడు గౌతమ్.

"నా క్లాస్‌మేట్ రజనీ నేర్చుకుంటోంది. వీలయినప్పుడల్లా నేను కూడా స్పేర్ చేద్దామని"

"స్టుపిట్ అనూ. రజనీకి నీలాగా మంచి జాబ్ లేదు. ఏదయినా ఫారిన్ ల్యాంగ్వేజ్ వస్తే ఎంబసీలో మంచి జాబ్ రావచ్చు. కాబట్టి తను నేర్చుకుంటోంది. నీకెందుకు అనవసరంగా" తన అభిప్రాయం చెప్పేడు గౌతమ్.

"మనకెంత టాలెంట్ ఉంటే మన సర్కిల్లో మననంత గ్రేట్‌గా చూస్తారని మీరేగా ఎప్పుడూ చెబ్తుంటారు. ఈ రోజేమిటి కొత్తగా మాట్లాడ్తున్నారు?"

"అనూ మనకు పెద్దగా అవసరం లేని వ్యాపకాలకు సమయాన్ని కేటాయించే బదులు ఏదయినా మంచి పని చెయ్యొచ్చు కదా."

"ఆ మంచి పనేదో మీరే చెప్పండి."

"మన చుట్టూ ఏదో ఒక రకంగా సఫర్ అవుతున్న వాళ్లు ఎందరో ఉంటారు. నీకు చేతనయిన సాయం వారికి చెయ్యొచ్చు కదా."

"ప్రపంచంలో చాలామంది ఏదో ఒక కారణంగా సఫర్ అవుతూనే ఉంటారు. అలాగనీ అందరికీ ఏదో ఒకటి చెయ్యాలంటే చెయ్యలేము కదా" గౌతమ్ మాటలు రుచించనట్టు అంది అన్విత.

"అలాగని ఏమీ చెయ్యకుండా ఉండటం సమంజసమా?"

"..................."

"అనూ మనతోపాటు, మనముండే సమాజంలో ఉండేవారిలో కొంత మంది బాధపడుతూ ఉంటే మనకేమి పట్టనట్టు సంతోషంగా ఉండగలమా?"

"..................."




"ఒకవేళ అలా సంతోషంగా ఉండాలనుకున్నా ఉండగలమా? అది సంతోషం అవుతుందా?"

"ఎందుకు, ఉన్నట్టుండి ఇంత మార్పు...?"

"అనూ, మార్పు ఎప్పుడో ఒకప్పుడు మొదలవ్వాలి. అది నా జీవితంలో ఇప్పుడు మొదలయ్యింది. ఆ మార్పుకు కారణం శ్రీరాం."

"ఎప్పుడూ మనలోని టాలెంట్‌ని ఆవిష్కరించుకోవాలన్న తపన, నిరంతరం ఎదగాలన్న తాపత్రయం మాత్రమే జీవితం అనుకునేవాడిని. నేను గమనించని మానవతా కోణాన్ని స్పృశింపజేశాడు శ్రీరాం. మానవత్వపు పరిమళం సోకని బ్రతుకు వాసన లేని పువ్వు వంటిది కాదా అనూ? అలాగని నేనేమీ సర్వస్వం పరిత్యజించి సన్యసించమనటం లేదు. ఓ చిన్న సాయం... అవసరమైనవారికి కొండంత ఊరట అవుతుంది."

'ఐ బాంకు'లో నేత్ర దానానికి సంబంధించిన ఫార్మాలిటీస్ అన్నీ పూర్తి చేశారు గౌతమ్, అన్విత.

ఓ మంచి పని చేశామన్న అనిర్వచనీయమయిన సంతోషం ఇద్దరిలో.

"అనూ, శ్రీరాం పిక్చర్లో నా కారెక్టర్ గురించి చెప్పగానే సహజత్వం కోసమని ఓ రోజంతా అంధుల మధ్యన గడిపేను, నీకు తెలుసుగా. వారిని గమనించి... వారితో గడిపాక తెలిసొచ్చింది వెలుగును చూడలేని అంధకారమయమయిన బ్రతుకెంత దుర్భరమో. అప్పుడే అనుకున్నాను వారి కోసం ఏదయినా చెయ్యాలని" కార్లో వస్తుండగా గౌతమ్ చెప్పిన మాటలను జ్ఞప్తికి తెచ్చుకుంది అన్విత.

'ఎంత పెద్ద జర్నీ అయినా తొలుత ఒక అడుగుతోనే మొదలవుతుంది' గౌతమ్ వంకే చూస్తూ అనుకుంది అన్విత. ●

# చుట్టలు

అంత వైభవంగా బ్రతికిన ఆయనకి చుట్టలు కొనలేకపోతున్నాడు తను. కృష్ణమూర్తికి గుండెనెవరో పిండినట్లైంది. తను చుట్టలను కొనలేకపోవడం, అంతకు మించి చుట్టలకు కూడా ఆయన తన మీద ఆధారపడవలసి వచ్చినందుకు దుఃఖం...

రంగు రంగున గడియారం ఆరుగంటలు కొట్టింది. కృష్ణమూర్తి తలెత్తి కిటికీలోంచి చూసాడు. చీకటిలో నల్లగా కన్పిస్తున్న సముద్రం. దూరాన దీపాలు మాత్రం కన్పిస్తున్న ఓడలు. పెన్నుకి కేప్ తగిలించి, ఫైళ్ల వంక చూసాడు. చిరాగ్గా వుంది. సెక్షన్‌లో అందరూ వెళ్లిపోయారు. ఫైళ్లు మూసేసాడు. కిటికీ తలుపులు వేసి, లైటార్పి, తలుపు తాళం వేసాడు. పైన "షిప్పింగ్ సెక్షన్" మాత్రం తెరచి ఉంటుంది. తాళాలు షిప్పింగ్ క్లర్క్ కిచ్చిరావాలి. మెట్లవంక చూసాడు. కాళ్లు బలవంతాన యీడ్చుకుంటూ పైకివెళ్లి తాళాలిచ్చి, క్రిందకు దిగాడు.

రంగు రంగున వేంకటేశ్వరస్వామివారి ఆలయగంటలు మ్రోగాయి. గోపురంవైపు తిరిగి, లెంపలు వేసుకొని నమస్కరించాడు. "కలడు కలండనెడు వాడు కలడో లేడో!"

కృష్ణమూర్తి నడుస్తున్నాడు. సముద్రపు గాలికి ప్రాణం లేచి వచ్చినట్లనిపించింది. నెత్తిమీద ఖాళీ గంపలుంచుకొని యీరాడవెళ్లే జనం పల్లె పదాలు పాడుకుంటూ నడుస్తున్నారు. ఒక్కటే కుక్క రోడ్డుమీద నిల్చుని, దీనంగా మొరుగుతున్నది. దారిప్రక్కన ఉన్న క్వార్టర్సులోంచి వినబడుతున్న పాశ్చాత్య సంగీతం వింటూ నడుస్తున్నాడు కృష్ణమూర్తి. ఎవరో ఇద్దరు - మొగుడూ పెళ్లాలు కాబోలు - నవ్వుకొంటూ, రాసుకొంటూ కోవెలవేపు వెళ్తున్నారు.

ఎదురుగుండా వస్తున్నప్పుడు చూస్తే బాగుండదని, సముద్రపు నీటివేపు చూస్తూ నడకసాగించాడు. నవ్వుల ధ్వని అతని వెనుక నుంచి వినిపించినపుడు, వెనుదిరిగి చూసాడు. ఆమె జడలో పూలు నవ్వుతూ కన్పించాయి. అతని మనస్సు ఒక్కసారి గతంలోకి పరుగులు తీసింది. అప్పుడు కాలేజీలో బియస్సీ చదివేవాడు కృష్ణమూర్తి. అతని క్లాసులో అమ్మాయిల కన్నా కూడా అతను వయసులో చిన్నవాడు. అతనిపట్ల అతని సహాధ్యాయినుల మనోభావాలెట్లా వుండేవో అతనికి తెలియదు. అతనికి తెల్సిందల్లా మంజుల; మంజుల, కృష్ణమూర్తి ఒక సాయం సమయాన కాకతాళీయంగా, వేంకటేశ్వరస్వామివారి ఆలయంలో కలుసుకొని పలకరించుకొడమూనూ. స్వామివారి ముందు చేతులు జోడించి నిల్చున్న అతని ప్రక్కనే మంజుల నిలబడింది. ఇద్దరూ మాట్లాడుకుంటూ మెట్లుదిగారు. కొంతదూరం నడిచి, విక్టోరియారాణీ విగ్రహం దగ్గర చీలిన రోడ్లవద్ద విడిపోయారు.

అదంతా కృష్ణమూర్తి మనసులో కదలాడింది. ఆ సామాన్య సంఘటన మనస్సులో యిన్నాళ్లూ ఏ మూల దాగి ఉండి, ఇప్పుడు బయటికి వచ్చిందో మరి. అతను ఆశ్చర్యం నుంచి తేరుకొని నవ్వుకొన్నాడు. నడుస్తున్నాడు. చలి గాలి

**మల్లాప్రగడ రామారావు**

**పాత బంగారం**

భుజాల దగ్గర చిరిగిపోయిన బుష్‌షర్టులోంచి చర్మాన్ని స్పృశిస్తోంది. ఆకలిగా ఉంది. ఎడమ కాలి ఆకుజోడు మడమ పూర్తిగా అరిగిపోయింది. అరిపాదం చివర, చల్లని రోడ్డును తాకుతున్నది. కంకర గుచ్చుకొంటున్నది.

కృష్ణమూర్తి ఆలోచనలు యింటివేపు మళ్లాయి. ఇల్లు... ఆ ఇంట్లోకి వెలుతురు రాదు. గాలి రాదు. వానపడితే మాత్రం ఇల్లంతా వరద. ఇల్లు జ్ఞాపకం రాగానే కృష్ణమూర్తికి భయం వేసింది. అది కట్టించి ఏ నూరేళ్లో అయి ఉంటుంది. అప్పట్నుంచి దాన్ని ఎవరూ బాగు చేయించిన పాపాన పోలేదు. ఆ యింట్లో ఏడు కుటుంబాల వాళ్లున్నారు. భర్త చచ్చిపోయిన ఒంటరి పంతులమ్మ; భార్య చచ్చిపోయినా, మిగిలిన ముసలి తల్లి, కొడుకూ కూతుళ్లను పోషించడానికి, పక్షవాతం వచ్చి లాగేసిన కాలుతో రోజూ రిక్షామీద బడికెళ్లే మాష్టారు; గంపెడు సంతానం, గయ్యాళి భార్యతో, ఉభయసంధ్యలా పూజ చేసుకుంటూ పొద్దుపుచ్చే, ఎలక్ట్రిసిటీ ఆఫీసులో గుమాస్తా; రిటైరైపోయిన ఎన్.జి.ఓ., ఏళ్లు పైబడినా పెళ్లికాని ఆయన కొడుకులూ, కూతుళ్లూ; రెండో పెళ్లాంమాట జవదాటకుండా తెల్లారగట్లే లేచి, అంట్లు తోముకుని, కాఫీ పెట్టి, పిల్లలకు స్నానాలు చేయించి, పెళ్లాన్ని లేపి, అందరూ లేచేవేళకి సైకిలు తుడుస్తూ దాబుగా కూర్చునే రైల్వేగుమాస్తా. ఆ యిల్లు "ఆయన స్వంతమేమో" అని అనుకొన్నాడు కృష్ణమూర్తి మొదట్లో, అతని దాబు చూసి. రిట్రెంచిమెంట్లో ఉద్యోగంపోయి, ఆ విషయం గుండె జబ్బుగల తల్లికి తెలియపర్చకుండా కాలం వెళ్లబుచ్చాలని నానా యాతనపడుతున్న బ్రహ్మచారి; ఏడోవాటా కృష్ణమూర్తిది.

ఆ యిల్లు క్షణం రణరంగంలా వుంటుంది. మరుక్షణం రంగవల్లిలా వుంటుంది. మనుష్యుల్లో అంత నీచత్వం వుంటుందని కృష్ణమూర్తికిదివరకు తెలియదు. వీధి సందు వచ్చేసింది. భట్రాజువారి వీధి. వీధి మొదటింట్లోంచి ఆర్కెష్ట్రా రిహార్సల్సు చేస్తున్న ధ్వని. మేడమీద నిలబడి కురులు దువ్వుకుంటున్న కోమలాంగి. ఆమె పేరు తెలియదు కృష్ణమూర్తికి. నాట్యం చేస్తుందిట. ఎప్పుడేనా చూస్తే బాగుండును. ఎంచక్కని, తెల్లని, నున్నని ఒళ్లు. మేడమీదికి చూశాడు. వీధి దీపం కాంతిలో ఆమె మెడలోని హారం మెరుస్తున్నది. పెదవుల మీద దరహాసం. ఆమె

## పాత బంగారం

మల్లాప్రగడ రామారావుగారు తెలుగు పాఠకులకు సుపరిచితులు. మూడు దశాబ్దాల సాహితీ యాత్రలో బహుకొద్ది కథలు ప్రచురించినా, అవి ఆణిముత్యాలుగా చెప్పదగినవి. వాటిల్లోంచి ఎంపిక చేసిందే ఈ 'చుట్టాలు' కథ. ఇందులో మధ్యతరగతి కుటుంబ జీవనచిత్రాలు ఉన్నాయి. అవి 'నెగిటివ్'లు... నగ్నసత్యాల్ని చూపెడతాయి.

మల్లాప్రగడ రామారావుగారు నిరంతరం అధ్యయనశీలి. ఆయన ప్రపంచాన్ని ఎక్కువగా అధ్యయనం చేసిన వైనం ఆయన కథల్లో కనిపిస్తుంది.

విశాఖపట్నం జిల్లా అనకాపల్లిలో జన్మించి, తెలుగులో మాస్టర్స్ డిగ్రీ పుచ్చుకుని, మొదట విశాఖపట్నం పోర్ట్‌ట్రస్ట్‌లో, తర్వాత కార్మికవిద్య, కార్మికరాజ్య బీమా సంస్థల్లో పనిచేసారు. కార్యాలయ డైరెక్టర్‌గా 2006 లో పదవీ విరమణ చేసి, ప్రస్తుతం విశాఖలో స్థిరపడే ఉద్దేశ్యంతో ఉన్నారు.

అలనాటి సాహిత్యకోశం నుంచి ఈ పాతబంగారు నగ ప్రత్యేకంగా మా పాఠకుల కోసం...

కూడా కృష్ణమూర్తివేపు చూసింది. ఇద్దరి కళ్లు కలుసుకొన్న సమయాన అతని ఒళ్లు వెచ్చబడింది. గుండెలు దబదబా కొట్టుకున్నాయి. గాభరాగా చూపును మరల్చుకొన్నాడు. వెనక నుంచి నవ్వు వినబడింది. ఆ నవ్వు తరుముకొస్తున్నట్లు గబగబా యింటివేపు నడిచాడు. ఇల్లంతా గోలగా వుంది. చీకటిగా వుంది. పిల్లలందరూ చేరి చీకట్లో గోల చేస్తున్నారు. కరెంటుపోయింది. కృష్ణమూర్తి వాళ్ల వాటాలో ప్రవేశించాడు.

గుమ్మం దాటుతుంటే "ఎవరు నాయనా కృష్ణుడేనా?" కళ్లకు చేతినడ్డం పెట్టుకొని, దగ్గరగా నిలబడి చూడ్డానికి ప్రయత్నిస్తూ, అతని మామ్మ అడిగింది. "కృష్ణుడేలేవే" అతని మేనత్త, చీడీలో కూచున్నావిడ జవాబిచ్చింది.

"అమ్మా, అన్నయ్యొచ్చాడు" చెల్లెలు కేకేస్తూ వంటగదిలోకి పరుగెత్తింది. కృష్ణమూర్తి పేంటు, చొక్కా విప్పుకుని, లుంగీ కట్టుకున్నాడు. ఇత్తడి గ్లాసుతో కాఫీ పట్టుకుని అమ్మ వచ్చింది. కృష్ణమూర్తి కాఫీ కొంచెం చప్పరించి "పంచదార లేదా" అన్నాడు కసురుతున్నట్లు. అమ్మేదో చెప్పబోయింది. అతను విన్లేదు. "చాల్లే" అంటూ మిగతా కాఫీ అంతా కోపంగా ఒక్క గుక్కలో త్రాగేశాడు.

చిన్నక్క దేవుడి విగ్రహాల కెదురుగా కూర్చుని నూనె దీపం వెలుగులో చదువుకుంటోంది.

"ఏం కిరసనాయిలు లేదా?" ఎవరూ మాట్లాల్లేదు. కృష్ణమూర్తికి తెలుసు. ఇంట్లో బియ్యం లేవు, నూనె లేదు, కూరల్లేవు, కిరసనాల్లేదు, అగ్గిపెట్టేనా లేదు. అయినా అడిగేడు. కృష్ణమూర్తికి చిరాకు లావయింది. తలనొప్పి ఆరంభించింది. ఆకలేస్తున్నది. టిఫినేదీ ఉన్నట్టు లేదు. "వంట అయితే బాగుండును తినేద్దాం" అనుకున్నాడు.

"తల్లీ వంట అయిందా?" అని చెల్లిని ప్రశ్నించాడు. అన్నయ్య కోపంగా ఉండటం చూసి, అంతవరకూ మాట్లాడని చెల్లి లేదన్నట్లు తలూపి, "పెద్దక్క ఉత్తరం రాసిందన్నయ్యా. పురిటికి ఇక్కడకు వస్తుందిట. మరేమో ఆదివారం బయల్దేరుతుందిట" అంది. కృష్ణమూర్తి మాట్లాడలేదు.

ఆదివారం ఇంకా మూడు రోజులుంది. లెక్కేసాడు. మామ్మ, పెద్దత్త, చిన్నక్క, అమ్మ, నాన్న, చెల్లి, తను. ఏడుగురు. పెద్దక్క వస్తుంది. ఇద్దరైనా పిల్లలు వస్తారు. ఇంట్లో బియ్యంలేవు, నూనెలేదు. అగ్గిపెట్టెలు కూడా లేవు. నూనె దీపం నుండి ప్రసరిస్తున్న కాంతి మినహాయించి గదంతా చీకటిగా వుంది.

ఆకలి సన్నని మంటలాగ బయల్దేరింది కడుపులో. ఆఫీసు నొకసారి జ్ఞాపకం తెచ్చుకున్నాడు. ఇంకా వున్నాయి. "పుటవ్ చెయ్యవలసిన నోట్సు", ఎస్.ఆర్.ఎంట్రీలు. మెడికలు ఎగ్జామినేషన్‌కి పంపవలసినవాళ్ల వివరాలు తీసుకొని ఫారాల్లో నింపాలి. తలనొప్పి తీవ్రం కాసాగింది. చర్చిగంటలు ఏడుసార్లు మ్రోగాయి. "తల్లీ అప్ప రాలేదమ్మా" చెల్లినడిగాడు కృష్ణమూర్తి. వాళ్లింట్లో తండ్రిని "అప్ప" అంటారు. "లేదన్నయ్యా" అంది చెల్లి. "అదుగో వస్తున్నారు" వీధిలోకి చూస్తూ, చీడీలో కూర్చున్న పెద్దత్త చెప్పింది. ఆయన గదిలోకి రాగానే, కృష్ణమూర్తి చీడీమీదకు వెళ్లిపోయాడు. అదెలా ప్రారంభమయిందో కృష్ణమూర్తికి జ్ఞాపకం లేదు. ఆయన వున్న గదిలో అతను వుండడు. అతను గదిలో వుంటే ఆయన గదిలోనికి రారు.

"ఏంవోయి! ఎలా వుంది పని? ఒళ్లు దగ్గర పెట్టుకొని చేస్తున్నావా?" రైల్వే గుమస్తా సిగరెట్టు కాలుస్తూ ప్రశ్నించాడు. కృష్ణమూర్తి నిశ్శబ్దంగా తలూపాడు.

"చిన్నవాడా! చితకవాడా! ఏమిటండీ మీ

ప్రశ్న?" అతని భార్య తలుపుచాటు నుండి బయటకొస్తూ ప్రశ్నించింది.

"అది కాదమ్మీ! ఆ మాత్రం దబాయించక పోతే ఈ కాలం కుర్రకారు లొంగరు" రెండువేళ్ల మధ్య సిగరెట్ బిగించి, దమ్ము గట్టిగాలాగుతూ, అతను జవాబిచ్చాడు. "అనవసర ప్రసంగాలు చెయ్యక మీపాటేదో మీరు పదండి" ఆవిడ విసురుగా లోపలికి పోయింది. అతను మరి మాట్లాడలేదు. కృష్ణమూర్తి కొంచెం నవ్వుకున్నాడు.

"అన్నయ్యా" గొంతు విని వెనక్కు తిరిగాడు. గుమ్మంవద్ద చెల్లి నిల్చొని వుంది. గదిలోకి వెళ్లి, "ఏమ్మా" అని ప్రశ్నించాడు. చెల్లి మాట్లాడలేదు. కృష్ణమూర్తి చిరాగ్గా మొహం పెట్టాడు. "మరేమో అప్పకు చుట్టల్లేవన్నయ్యా" జంకుతూ చెప్పింది. "ఉదయం ఎందుకు చెప్పలేదు?" కృష్ణమూర్తి కోపంగా అడిగాడు. "ఉదయం కిరసనాయిల్‌కి డబ్బు అడిగితే లేదన్నావు కదా." "నోర్ముయ్. ఉదయం చెపితే ఏమఘోరిద్దునో" ధుమధుమలాడాడు. అతనికి తెలుసు. ఉదయం చెప్పినా తనంతకన్నా ఏం చెయ్యలేడు. కిరసనాయిలు గురించి, బియ్యం గురించి అతనికి జ్ఞాపకం వుంది. చుట్టలు ఆ పూటకి ఉండవని అనుకోలేదు. కానీ అవీ ఇవాళో, రేపో అయిపోతాయని అతనికి తెలుసు. ఆఫీసుకి వెళ్తున్నప్పుడు, భోజనాల సమయంలోనూ, అతనికివన్నీ గుర్తున్నాయి. కానీ అప్పెలా అడగాలో కృష్ణమూర్తికి తెలియదు. కిందా మీదా పడుతూ, ఉండీ లేక ఏదోవిధంగా బియస్సీ చదివినప్పుడు కూడా అతనెలా అప్పుచేయాలో నేర్చుకోలేదు. ఇంట్లో అప్పో సప్పో చేయవలసి వస్తే అమ్మే చూసుకొంటుంది. "ఎవర్నైనా అడగలేకపోయారా? అందులో మళ్లీ నామోషీ" గొంతు తగ్గించి అన్నాడు. "ఎవ్వరూ ఇవ్వలేదు" అభిమానంగా అంది చెల్లి.

కృష్ణమూర్తి మాట్లాడలేదు. "చుట్టల్లేవు. అప్పకి చుట్టల్లేవు." ఆ మాటలు చెవుల్లో గింగురుమంటున్నాయి. చుట్టూ చూసాడు. ఏం చెయ్యాలో అర్థంకాలేదు. అన్నం తింటున్న అప్ప వేపు చూసాడు. మాసిన ఖద్దరుపంచ, లాల్చీ, పెరిగిన గడ్డం, గంభీరమైన శరీరం. కృష్ణమూర్తి మనస్సు బాల్య స్మృతులను తవ్వుకొనసాగింది. చిన్నప్పుడు ఆయన ఇంటిదగ్గర ఉండడమే అపూర్వం. ఇంటి నిండా మనుష్యులు. ఇంట్లో వాళ్లు, బంధువులు, అతిథులు, అభ్యాగతులు, నౌకర్లు. అంత పెద్ద ఇల్లు. ఎంతో సందడి. మూడడ్ల గిన్నెల్లో శనివారాలు రొట్టె కాల్చడం అతనికింకా గుర్తుంది. అప్పుడు అప్ప ఊరిలో ఉండేవారు కారు. రాజకీయాలు, స్కూళ్లు కట్టించడం, రోడ్లు వేయించడం. ఆస్పత్రి, పశువుల ఆస్పత్రి, కోపరేటివ్ బ్యాంకు, మార్కెటింగ్ సొసైటీ తెరిపించడం, మాతా శిశు సంరక్షణాలయం, సబ్ పోస్టాఫీసు ఊరికి తెప్పించడం. ఎప్పుడూ పదిమంది "గురువుగారూ! గురువుగారూ!" అంటూ. ఆ రోజులు వెళ్లిపోయాయి. ఇప్పుడు తన ఉద్యోగాన్ని నమ్ముకుని ఆయన యీ వూరు వచ్చేయడం, ఇక్కడ స్నేహితుడి ఫొటో స్టూడియోలో ఉదయం, మధ్యాహ్నం పేపరు చూస్తూ కూర్చుని, సాయంకాలం 7 గంటలకి ఇంటికి రావడం. కృష్ణమూర్తికి కన్నీళ్లొచ్చాయి. ఆయనకిప్పుడు చుట్టల్లేవు. చుట్టలేందే ఆయనకి భోంచేసిన తృప్తిలేదు. తాతయ్య ఉన్నన్నాళ్లూ అప్పకి వీరఘట్టం నుంచి ప్రత్యేకంగా పుగాకు తెప్పించి, చుట్టలు చుట్టించడం కృష్ణమూర్తికి జ్ఞాపకం ఉంది. అంత వైభవంగా బ్రతికిన ఆయనకి చుట్టలు కొనలేకపోతున్నాడు తను. కృష్ణమూర్తికి గుండెనెవరో పిండినట్లైంది. తను చుట్టలను కొనలేకపోవడం, అంతకు మించి చుట్టలకు కూడా ఆయన తన మీద ఆధారపడవలసి వచ్చినందుకు దుఃఖం.

హఠాత్తుగా ఒక ఆలోచన వచ్చింది. వంగి




మంచం క్రిందనున్న ట్రంకు పెట్టెలాగాడు ఒక టొకటే బట్టలు తీసాడు. బట్టలక్రింద నీలం రంగు ఫైళ్లలో బొత్తెడు కాగితాలున్నాయి. అవి బయటకు లాగుతూంటే కృష్ణమూర్తికి చెయ్యి వణికింది. అవి... వాటిని గురించి తలచుకొన డానికి అతనికి ధైర్యం చాలడంలేదు. గబగబా వాటిని గుడ్డ సంచిలో కుక్కాడు. చొక్కావేసుకొని, సంచీ చేతపుచ్చుకొని చెల్లిని పిలిచాడు. చెల్లి వచ్చింది. ఇద్దరూ చీకట్లోంచి వీధిలోకి నడిచారు. వీధి చివర నుయ్యి వుంది. నూతి చప్టా నిండా ఇటికలు, చెత్తవున్నాయి. ఆ వీధిలో ఎవరో యిల్లు బాగుచేయించుకుంటున్నారు. అక్కడ కృష్ణమూర్తి ఆగాడు. చెల్లి కూడా ఆగింది. "తల్లీ ఈ కాగితాలు ప్రక్కనున్న కొట్లో అమ్మి తీసుకురా" సంశయిస్తూ, మెల్లిగా గొణిగాడు. చెల్లి తలూపి వెళ్లింది. "తల్లీ" మళ్లీ పిలిచాడు. చెల్లి వచ్చింది.

"పన్నెండణాలకు తక్కువైతే ఒప్పుకోకు" మెల్లని గొంతుతో హెచ్చరించేడు. "అలాగే". చెల్లి సంచీ పట్టుకు వెళ్తుంటే చూస్తూ నిల్చున్నాడు. ఆ సంచీ బరువుగా వుంది. చెల్లి ఒక ప్రక్కకు ఒరిగి నడుస్తూంది. ఆ పిల్ల వయసు ఎనిమిదేళ్లింకా. కృష్ణమూర్తి కడుపులో దేవినట్లైంది. ఆ వయసులో తను ఎంతో సుఖంగా పెరిగాడు. వాళ్ల కుటుంబ వైభవం చివరి దినాల్లో చెల్లి పుట్టింది. ఆమెకు ఆరేళ్లు వచ్చేసరికి పరిస్థితి తారుమారైంది. చెల్లి ఎక్కువ మాట్లాడదు. అన్నీ అర్థం చేసుకుంటుంది. అవీ యివీ కొనాలని అతన్ని బాధించదు.

"అన్నయ్యా!" చెల్లి పరిగెత్తుతూ వచ్చి నిల్చుంది. "ఏమ్మా" ఆతృతగా అడిగాడు. "పధ్నాలుగణాలిస్తానంటున్నారన్నయ్యా" కృష్ణమూర్తికి ఆనందం వేసింది. దాంతోపాటు ఆశ కూడా కలిగింది. "కొట్టుమీద ఎవరున్నారు?" అని అడిగాడు సంతోషాన్నాపుకుంటూ. "మరేమో షావుకారులేదు. వాళ్లబ్బాయి వున్నాడు. తీసుకోమంటావా?" చెల్లి ఇంకా సరదాగానే వుంది.

కృష్ణమూర్తి మాట్లాడకుండా చెల్లి కూడా

నడిచాడు. ఇద్దరూ కొట్టులోనికి వెళ్లారు.

కృష్ణమూర్తి "ఒక రూపాయికన్నా తక్కువైతే అక్కర్లేదోయ్" అన్నాడు డాబుగా, బల్లమీద కూర్చుంటూ. "రూపాయికి మూడురోజులు సరిపడా చుట్టలొస్తాయి" అని మనసులో లెక్కవేసుకున్నాడు. అప్పుడు పెద్దక్క వస్తుంది. కొంతేనా డబ్బు తీసుకొస్తుంది. నెల ఎలాగేనా గడిపేయొచ్చు. కుర్రాడు సందేహిస్తున్నాడు. ఇంతట్లో షాహుకారు వచ్చేడు. కుర్రాడిని ప్రశ్నించి బేరం గురించి తెలుసుకొన్నాడు. త్రాసులోంచి కాగితాలు తీసేస్తూ "పన్నెండణాలుకి మించి ఇచ్చేది లేదు. అక్కర్లేకపోతే పట్టుకెళ్లండి" అన్నాడు బొంగురుగొంతు విప్పుతూ, కృష్ణమూర్తికి కోపం వచ్చింది. కాగితాలు సంచీలో పెట్టి, గిరుక్కున వెనక్కుతిరిగి, సందులోకి వచ్చేసాడు. "చుట్టలు" అంది చెల్లి. "నీ నెత్తి. నోర్మూసుకో" అన్నాడు.

## AVM [illegible]



అదొక మారుమూల పల్లెటూరు.

డిగ్రీ చదువుతున్న మహర్షి సెలవులకు ఇంటికి వచ్చాడు తల్లిదండ్రులను చూసి వెళ్లాలని. ఆ పల్లెలో బస్తీలో లాగా పంపునీళ్లు ఉండవు, మంచినీరు ఎక్కడో బావి నుంచి తెస్తారు. ఆ నీరు మహర్షికి సరిపడక జ్వరం వచ్చింది. ఆ పల్లెలో అన్ని రోగాలూ చూసే డాక్టర్ యమ్. ధర్మరాజు దగ్గరకు వెళ్లాడు మహర్షి.

"ఈ మందులు వాడవోయ్" అంటూ కొన్ని మందుల పొట్లాలు కట్టి ఇచ్చాడు డాక్టర్. ఇంటికొచ్చి ఆ మందు వేసుకున్న దగ్గర్నుంచి విరోచనాలు మొదలయ్యాయి మహర్షికి.

"డాక్టర్‌గారూ! జ్వరం తగ్గకపోగా విరోచనాలు అవుతున్నాయి" ఫోన్ చేసాడు.

"నేను చెప్పినట్లు చేస్తావా?"

"చెప్పండి త్వరగా..."

"నువ్వు కాలేజీలో ఏ అమ్మాయి వెనుకా తిరగ్గూడదు"

"దానికీ దీనికీ సంబంధం ఏమిటి?" అన్నాడు మహర్షి

"నువ్వూ, మానసా చెట్టాపట్టాలేసుకుని చేసే షికార్లు మానేయాలి"

"నా జబ్బుకి, దానికీ ఏంటి లింకు?"

"నేను చెప్పినట్లు చేస్తేనే నీ జబ్బుకు విరుగుడు ఇచ్చి, నిన్ను మనిషిని చేస్తా!"

"ఇప్పటికే ఇరవైసార్లు చెంబుపట్టుకు వెళ్లా. మీరు గీసిన గీత దాటను. త్వరగా చెప్పండి"

"మానస నా కూతురు. అర్థమైందిగా! ఇప్పుడు మీ నాన్నను పంపించు. విరుగుడు మందిస్తా".




"ఇంద. ఈ కాగితాలు తీసుకొని, ఇంకో దుకాణానికి వెళ్లు" అన్నాడు సంచి అందిస్తూ. ఇంకొక్క దుకాణమే వుంది ఆ వీధిలో. ఎనిమిది దాటుతున్నది. చెల్లి మళ్లీ వెళ్లింది. అయిదు నిమిషాలయ్యాయి. కృష్ణమూర్తికి చెల్లి గురించి భయంవేసింది. పదినిమిషాలకి చెల్లి తిరిగొచ్చింది. "పదణాలకన్న ఎక్కువ ఇవ్వడట. తీసుకోమన్నావా?" అంది. కృష్ణమూర్తికి మళ్లీ చిరాకొచ్చింది. వాడు కూడా మళ్లీ వెళ్తే పదణాలు ఇవ్వనంటాడేమోనని. "ఇందాకా యిలాగే అడిగి చంపావు, పోయి పుచ్చుకురా" చెల్లి కళ్లనీళ్లు నింపుకుంటూ పరుగెత్తింది. కృష్ణమూర్తికి ఏడుపొచ్చింది. చెల్లి గురించి తన ఆలోచనకి, చెల్లిపట్ల తన ప్రవర్తనకీ ఈ అంతరమేమిటి? చెల్లి నాలుగోక్లాసు చదువుతోంది. తనకి లభ్యమైనదాంతోనే తృప్తిపడే చెల్లి. చెల్లిపట్లే కాదు. ఇంట్లో అందరిపట్లా తన ప్రవర్తన ఇలాగే వుంది. చెల్లి వచ్చి, చేతితో డబ్బులు పెట్టింది. సంపాదకుల దగ్గర నుండి తిరిగొచ్చినవి, సంపాదకులకు పంపడానికి కృష్ణమూర్తి ధైర్యం చెయ్యనివీ అయిన అతని స్వంత రచనల విలువ ఒక అర్ధరూపాయి, పదిపైసలు, మరొక రెండు పైసలు. కృష్ణమూర్తి చెల్లి తలమీద చేయివేసి, "ఇక్కడే ఉండు తల్లీ! చుట్టలు పట్టుకొస్తాను" అని వీధిలోకి వెళ్లాడు. నాయరు లెక్కపెట్టి ఇచ్చిన ఇరవై చుట్టలు పట్టుకొని వచ్చాడు. ఇద్దరూ ఇంటికి వెళ్లారు. అప్ప భోజనం ముగించి మంచంమీద దొర్లుతున్నారు. కృష్ణమూర్తికి తెలుసు. చుట్టకాల్చందే ఆయనకి నిద్రరాదు. గబగబా వెళ్లి, రైల్వే గుమస్తానడిగి, అగ్గిపెట్టె తీసుకొని చెల్లికిచ్చాడు.

చెల్లి చుట్టలు అలమార్లోపెట్టి, ఒక చుట్ట, అగ్గిపెట్టె తీసుకొని, అప్పకిచ్చింది.

"ఊ! ఊ! ఎందుకమ్మా ఇప్పుడు"అంటూనే ఆయన చుట్టపుచ్చుకున్నారు.

కృష్ణమూర్తి గదిలోంచి చీడీ మీదకు వచ్చేశాడు. "టప్" అగ్గిపుల్ల శబ్దం. కృష్ణమూర్తి వెనక్కి తిరిగి గదిలోకి చూశాడు. అప్ప నోట్లో చుట్ట వెలుగుతోంది. పొగ గుప్పున పైకి వస్తోంది.

# మి-17

"రెడీ! టేక్ గన్స్ పొజిషన్ – ఫైర్" హఠాత్తుగా పడిన పిడుగులా గర్జించిందొక సైనికుని కంఠం.

అతని గర్జనకి వెయ్యిరెట్ల శబ్దంతో 'బోఫోర్స్' శతఘ్ని గర్జిస్తూ శత్రుస్థావరం మీదకి గురిగా గుండును పేల్చింది. అలా వరుసగా బోఫోర్స్ గుళ్లు గాలిలోకెగసి, హిమశిఖరాల శిరస్సులను ఛిద్రం చేస్తున్నాయి.

ప్రపంచంలోని అతిశీతల యుద్ధక్షేత్రంగా పేరుపొందిన కార్గిల్‌ప్రాంతం ప్రతిక్షణం తుపాకులు, శతఘ్నుల పేలుళ్లతో మార్మోగిపోతోంది.

"తోలోలింగ్, పాయింట్ 4590 శిఖరాల మీదనుంచి శత్రువుల్ని తరిమికొట్టినా, ఇంకా డజను ప్రాంతాల్లో మనకూ, శత్రువుకూ మధ్య హోరా హోరీ పోరాటాలు" కార్గిల్ పోరాటాన్ని సమన్వయం చేస్తున్న ఉత్తరమండల ప్రధానాధికారి మేజర్ జనరల్ పి.పి.ఎస్. బింద్రా తన సహచరులతో చెప్పారు.

ఆయన శ్రీనగర్‌లో 15వ కోర్ కార్యాలయంలోని ఆపరేషన్స్ రూమ్‌లో ఉన్న మ్యాప్‌లో మన జవాన్లు ముందంజ వేసిన ప్రాంతాలను గుర్తు పెట్టారు. అక్కడ ఫీల్డ్ కమాండర్లు సమావేశమై ఉన్నారు. మధ్య మధ్య వైర్లెస్ కాల్స్ వస్తున్నాయి. యుద్ధరంగ పరిస్థితి గురించి పటాలాల కమాండర్లు తెలియజేస్తున్నారు. తిరిగి వాళ్లకి ఆదేశాలు వెళ్తున్నాయి.

చొరబాటుదారులు తిష్ఠవేసిన కొత్తకొత్త ప్రాంతాలను ఇప్పటికీ సైన్యం కనుగొంటూనే



ఉంది. కొన్ని చోట్ల వారి ఆహారం, ఆయుధ సరఫరాలు తరిగిపోతున్నా, అనేకచోట్ల వారు పటిష్ఠంగానే ఉన్నట్లు చొరబాటుదారుల వైర్లెస్ సందేశాలను బట్టి అర్ధమౌతోంది. శత్రువుల ఫిరంగి గుళ్లు గురితప్పకుండా మన స్థావరాలను, కీలక ప్రాంతాలనూ తాకడం విస్మయం కలిగిస్తోంది.

రోజు రోజుకీ మృతుల సంఖ్య పెరుగుతూండడంతో కలవరపడిన ఆర్మీ, శత్రువుని అణచి వేయటానికి వైమానిక దళ సహాయం కోరింది. వాస్తవానికి ఎప్పుడు దేశ సరిహద్దుల్లో యుద్ధపరిస్థితి నెలకొన్నా, వైమానిక, నావికా దళాలు రెండూ సర్వసన్నద్ధంగా ఉంటాయి. ఉన్నతస్థాయి యుద్ధసమీక్షలో మూడు దళాల అధిపతులూ పాల్గొంటారు. ప్రధాని నేతృత్వంలో రక్షణమంత్రి, ఇతర ప్రముఖులూ అన్ని విషయాలూ కూలంకషంగా చర్చించి, నిర్ణయాలు తీసుకుంటారు. అలా తీసుకున్న నిర్ణయం ప్రకారం వైమానిక దళం మే 26వ తేదీన శత్రుస్థావరాల మీద భీకర దాడి జరిపింది. దాంతో బిత్తరపోయిన శత్రువులు వెంటనే ప్రతిఘటనకు సిద్ధమయ్యారు.

మే-27వ తేదీన కూడా మిగ్ విమానాలు శత్రుస్థావరాల మీద భీకరమైన దాడులు చేసాయి. శత్రువులు పేల్చిన విమాన విధ్వంసక శతఘ్నిగుళ్లు మన విమానాలను తాకలేక పోయాయి కానీ, ఒక దుర్ఘటన జరిగింది.

ఫ్లైట్ లెఫ్టినెంట్ నచికేత నడుపుతున్న మిగ్-27 యుద్ధవిమానం ఇంజన్ హఠాత్తుగా పనిచేయటం మానేసింది. దాంతో ఆయన ప్రాణరక్షణకోసం పారాచ్యూట్ సహాయంతో క్రిందకు దూకేసారు. శత్రువులు ఆయన్ని పట్టుకున్నారు.

ఆయన్ని వెతకడానికి వెళ్లిన మిగ్-21 విమానాన్ని శత్రువులు స్టింగర్ క్షిపణి ప్రయోగించి కూల్చేసారు. స్క్వాడ్రన్ లీడర్ అహూజా బలయ్యారు. వెంటనే శ్రీనగర్ విమానాశ్రయాన్ని మూసివేసారు.

* * *

పాయింట్ 5140 స్థావరాన్ని పట్టుకోవ

టానికి పోరాట యోధుల దళాలు గట్టి ప్రయత్నాలు చేస్తున్నాయి. శిఖరం మీదనుంచి చొరబాటుదారులు తూటాల వాన కురిపిస్తున్నారు.

వాటిధాటికి శిఖరం ఎక్కుతున్న సైనికుల్లో చాలామందికి తీవ్రగాయాలయ్యాయి. కొంత మంది వీరమరణం పొందారు.

అయినా సైన్యం తన ప్రయత్నాలు కొనసాగిస్తూనే ఉంది.

మరోప్రక్క శ్రీనగర్ విమానాశ్రయంలోని పరిస్థితి మరోలా ఉంది. శత్రుస్థావరాల మీద దాడికి రష్యా తయారీ ఎమ్.ఐ-17 తరహా హెలికాప్టర్లను సిద్ధం చేస్తున్నారు. వీటిని వైమానికులు మిగ్-17 అని పిలుస్తారు.

రష్యన్ సంప్రదాయం ప్రకారం – విమానాలు డిజైన్ చేసిన ఇంజనీర్ల పేర్లనే కోడ్ పద్ధతిలో పెడతారు. T.U. 124 విమానాన్ని డిజైన్ చేసిన తుప్లోవ్ పేరు T.U. లో ఉంది. అలాగే ఎమ్.ఐ. కూడా ఒక హెలికాప్టర్ డిజైనర్ పేరులోని పొడి అక్షరాలుగా గ్రహించాలి. మిగ్, సుఖోయ్ విమానాల విషయంలోనూ అంతే. ఈ విమానాలను ఆధునీకరిస్తున్నప్పుడు వాటి సంఖ్య పెరుగుతుంది. మిగ్-21, మిగ్-23, మిగ్-25, మిగ్-27, మిగ్-29 వగైరా...

ఆ క్రమంలో ఆధునీకరించబడిన హెలికాప్టర్ మి-17.

శాంతి సమయాలలో దీనిని వివిధ ప్రయోజనాలకు వినియోగిస్తారు. ముఖ్యంగా మామూలు విమానాలతో సాధ్యంకాని ఎన్నో కార్యక్రమాలు హెలికాప్టర్ల ద్వారా జరుగుతాయి. ఎందుకంటే ఇవి దిగటానికి, ఎగరటానికీ ప్రత్యేక విమానాశ్రయాలు అవసరం లేదు. కాస్త విశాలమైన ప్రదేశం ఉంటే చాలు.

మి-17లో మెషీన్‌గన్స్, రాకెట్లు ఉంటాయి. వీటిని శత్రువుల మీదకు ప్రయోగిస్తారు. వీటిలో బాగా ఆధునీకరించిన వాటిని 'గన్ షిప్స్' అని వ్యవహరిస్తారు. ఆకాశం నుంచి నేలమీద ఉన్న లక్ష్యాలను వీటితో సులభంగా ఛేదించవచ్చు.

సైన్యం తమకు మద్దతుగా హెలికాప్టర్లు కావాలని కోరింది. కానీ వైమానిక దళాధిపతి అందుకు గట్టిగా వ్యతిరేకించారు. ఆయన ఆదేశాల ప్రకారం ప్రారంభంలో మిగ్ విమానాలను ఉపయోగించటం జరిగింది.

దురదృష్టవశాత్తు రెండు మిగ్ విమానాలు పతనం కావడంతో ఆర్మీకోరిన ప్రకారం మే 28వ తేదీన, శత్రువులపై దాడికి సాయుధ హెలికాప్టరు మిగ్-17 సిద్ధం చెయ్యబడింది.

పైలట్‌తో సహా నలుగురు సిబ్బంది హెలికాప్టర్ దగ్గరకొచ్చారు. ప్రాథమిక పరీక్షలు అన్నీ చేసుకున్నారు.

హెలికాప్టర్ బయలుదేరింది.

ఎత్తుకి... ఇంకా ఎత్తుకి... 19 వేల అడుగుల ఎత్తుకి వెళ్లాక గ్రౌండ్ కంట్రోల్ నుంచి, 'తోలోలింగ్' శిఖరంమీద తిష్ఠవేసుక్కూర్చున్న శత్రువుల్ని తుదముట్టించమని ఆదేశాలు వచ్చాయి.

పైలట్ తనకు సహాయంగా ఉన్న నేవిగేటర్ సూచనలతో హెలికాప్టర్‌ని 'తోలోలింగ్' శిఖరం వైపు పోనిచ్చాడు. అంత ఎత్తు నుంచి హిమశిఖరాన్ని చూస్తుంటే దేవలోకాన్ని చూస్తున్నట్లుంది. నిజమే! హిమాలయాలు దేవభూములే! కానీ అక్కడ రాక్షసుల్లా – ముష్కరులు దురాక్రమణ చేసి, దేశరక్షణలో నిమగ్నమై ఉ

న్న భారత సిపాయిల మీదకి తూటాలవాన కురిపిస్తున్నారు. అభేద్యంగా నిర్మించుకున్న బంకర్లలో తలదాచుకుని విర్రవీగుతున్నారు.

హెలికాప్టర్ 'తోలోలింగ్' తలమీదుగా చక్కర్లు కొట్టసాగింది. 'ఎయిర్‌గన్నర్స్' శత్రు స్థావరాల మీదకు రాకెట్లు ప్రయోగించారు. అవి సూటిగా వెళ్లి బంకర్లను ఢీకొన్నాయి. బిత్తర పోయిన శత్రువులు వెంటనే తాబేలు తన అవయవాలను దాచుకున్నట్లు బంకర్‌లో తల దాచుకున్నారు. రెట్టించిన ఉత్సాహంతో హెలికాప్టర్‌లోని సిబ్బంది శత్రుస్థావరాల మీదకు రాకెట్లు ప్రయోగించసాగారు. కాస్త దిగువగా ఎగురుతూ మెషీన్‌గన్స్‌ని కూడా స్థావరాల మీదకు ప్రయోగించారు.

దాదాపు అయిదు నిమిషాలు హెలికాప్టర్ వీరవిహారం చేసింది. శత్రువులు గుండెలర చేతిలో పెట్టుకుని హెలికాప్టర్ వెళ్లిందో లేదోనని తొంగి చూడసాగారు. శత్రువులు ఎంతవరకూ ధ్వంసమయిందీ గమనించడానికి తోలోలింగ్ శిఖరం మీద వలయంగా తిరుగుతున్న హెలికాప్టర్‌లో ఇక తమ మీదకు ప్రయోగించడానికి రాకెట్లు, తూటాలూ లేవనే భ్రమతో శత్రువులు స్థావరం నుంచి బయటికి వచ్చారు. వెంటనే హెలికాప్టర్ కాల్పులు ప్రారంభించింది. చూస్తుండగానే శత్రువుల్లో కొందరు కూలిపోయారు. కొందరు గాయాలతో, ప్రాణ భయంతో 'బంకర్'లోకి దూరిపోయారు.

అప్పుడు వాళ్లకి గుర్తుకువచ్చింది... తమ దగ్గర విమానాల్ని కూల్చగల క్షిపణి ఉందని. వెంటనే దాన్ని భుజాన పెట్టుకుని ఒక శత్రు సైనికుడు బయటికి వచ్చాడు. అది అత్యంత శక్తివంతమైన విమాన విధ్వంసక 'స్టింగర్‌క్షిపణి' రకానికి చెందినది. భుజం పైనుంచే ప్రయోగిస్తారు. గురి తప్పకుండా లక్ష్యాన్ని ఛేదిస్తుంది. శత్రువు క్షిపణితో హెలికాప్టర్ మీద గురి చూస్తూ 'తోలోలింగ్' శిఖర స్థావరం బయట నిలబడ్డాడు. రాబోయే ప్రమాదం ఊహించని పైలట్, మళ్లీ హెలికాప్టర్‌ని శత్రుస్థావరం వైపు నడిపాడు. ఎలాగైనా శత్రుబంకర్‌ని పూర్తిగా ధ్వంసం చేసి, భారతజవాన్ల విజయానికి మార్గం సుగమం చేయాలని పైలట్ తపన. ఇతర సిబ్బంది కూడా అదే భావనతో ఉన్నారు.

హెలికాప్టర్ తోలోలింగ్ సమీపిస్తూండగా శత్రుస్థావరం నుంచి క్షిపణి – మృత్యుశరం లాగా దూసుకు వచ్చి రెప్పపాటు సమయంలో హెలికాప్టర్‌ని తాకి పేలిపోయింది. హెలికాప్టర్ అదుపు తప్పింది. క్షిపణి తాకిడికి హెలికాప్టర్‌లో మంటలు చెలరేగాయి. వెంటనే సిబ్బంది అంతా పైలట్ కేబిన్‌లోకి చేరారు. పైలట్ తన శక్తినంతా ఉపయోగించి హెలికాప్టర్‌ని రక్షించడానికి ప్రయత్నిస్తున్నాడు.

సిబ్బందిలో పెద్దవాడు, అనుభవజ్ఞుడైన వైమానికుడు పైలట్ భుజం మీద చెయ్యివేసి, మందహాసంతో "లాభంలేదు మిత్రమా! మనం వీరస్వర్గం అలంకరించబోతున్నాం. మళ్లీ భారతమాత పుత్రులుగా జన్మించి, తిరిగి దేశ సేవలో జీవితాలు గడిపే అవకాశం ఇమ్మని దేవుడ్ని ప్రార్థిద్దాం..." అన్నాడు. అందరూ మౌనంగా చివరి ప్రార్థన చేసుకుంటూండగా హెలికాప్టర్ జటాయువులా, రెక్కలు తెగిన పక్షిలా, హిమశిఖరాల మీద కూలిపోయింది. ఆ తాకిడికి హెలికాప్టర్ ముక్కలై, చెల్లాచెదురైపోయింది.

వైర్లెస్ సెట్ ఓ పక్క పడిపోయింది. అందులోంచి గ్రౌండ్‌కంట్రోల్ పిలుపు వినిపిస్తోంది. మళ్లీ మళ్లీ అదే పిలుపు...

కానీ, మృత్యువు ఒడిలో నిద్రపోతున్న ఆ వీర వైమానికులకి అది ఎలా వినిపిస్తుంది?!

ఇంకో రెండు నిమిషాల్లో రైలు కదలబోతోంది. "వెళ్లగానే ఫోన్ చేయండి" "మీరున్న పదిరోజులూ పది నిమిషాల్లో అయినట్లుగా వుంది". "పావ్‌గడ్‌లో కాళీమాత దర్శనం అద్భుతంగా వుంది". రోప్‌వే మొదటిసారి చాలా థ్రిల్లింగా అనిపించింది." "బరోడా పాలెస్‌లో రవివర్మ బొమ్మలు యింకాయింకా చూడాలనిపించాయి."

ఆ ముచ్చట్ల అచ్చట్ల మధ్య గావుకేక పెట్టింది ఆదితాళం.

అందరూ ఆందోళనగా ఆదితాళం దగ్గరికొచ్చారు.

కేకలు పెట్టే రోగాలేవిటా అని ఆలోచనలో పడ్డాడు అక్కడే వున్న డాక్టరు జవసత్వం. నడిరోడ్డు మీద ఎవడో గుండెపగిలేట్లు అరిచి పడిపోవటం చుట్టుపక్కల వాళ్లు చేతిలో తాళం చెవిపెట్టి బిందెలతో నీళ్లుపోయడం గుర్తుకొచ్చింది. నచ్చలే. ఆ గుర్తు గుర్తుని చెరిపేసాడు జవసత్వం. ఒక నిమిషం తర్వాత తెలిసింది. ఆవిడ ఆర్తనాదం తాళం చెవి కోసమని. ఏదో ఓ తాళం చెవి తీసిద్దామని జేబులోకి చేయిని పంపించాడు జవసత్వం.

"చాల్లెండి మీ మానవతా స్పందన. ఆవిడ యింటి తాళం చెవులు మరచిపోయి వచ్చిందట" అని చెవిలో చెప్పింది జవసత్వం భార్య ప్రథమచికిత్స.

"ఓసింతేనా దానికింత కొంపలంటుకుపోయినట్లు ఘొల్లుమనాలా" అన్నాడు జవసత్వం.

"కొద్దిపాటి దూరంకాదు టికెట్ కాన్సిల్ చేసి యింకో రైల్లో వద్దామంటే" అంది ప్రథమచికిత్స.

"అయితే మాత్రం దానికంత గొంతెత్తాలా" మళ్లీ అడిగాడు జవసత్వం.

"మీకేం తెలుసు దాంట్లో ఒక మతలబు వుంది" అంది ప్రథమచికిత్స.

"క్షణంలో అది కూడా లాగావా" అన్నాడు జవసత్వం.

"వాళ్లాయనకు పిచ్చికోపమట. ఈ సంగతి తెలిస్తే వీబ్బద్దలు చేస్తాడట" చెప్పింది ప్రథమ చికిత్స.

"ఏంటి – యింత మందిలో కూడా కరలాస్య కళాప్రదర్శన చేస్తాడటా"

"తిరుపతి బ్రహ్మోత్సవాల్లో ఒకసారి, గోదావరి పుష్కరాల్లో ఒకసారి, బెజవాడ బస్టాండ్లో ఒకసారీ వీపుపగిలి మళ్లీ అతుక్కుందట. జనాన్ని మీరే ఊహించుకోండి" అంది ప్రథమ చికిత్స.

"అంత తప్పులేం జరిగాయో పాపం" అన్నాడు జవసత్వం.

"మొదటిసారి – తాళం వేసి తాళాంచెవి తాళంలోనే మరచిపోయిందిట. రెండోసారి – గోదావరిలో స్నానం చేస్తుంటే కొంగుముడి వీడి తాళం చెవులు నీళ్లలో పడిపోయాయట. మూడోసారి – తాళంచెవులు పెట్టిన సంచీ బస్సులో ఎవడో దొంగ ఎత్తికెళ్లాట్ట" చెప్పింది ప్రథమ చికిత్స.

"యిప్పుడూ తాళమేనా వామ్మో" అన్నాడు జవసత్వం.

"గట్టిగా అరవకండీ. మీరేదో యింజక్షనిచ్చి ఆమె యిక్కడ పడుకుని హైద్రాబాద్‌లో లేచేట్లు చేయాలి" అంది ప్రథమచికిత్స.

"అదిసరే. దిగింతరువాతేగా తాళంచెవి కావాల్సింది. అదెట్లాని" అన్నాడు జవసత్వం.

"సెల్లులో బరోడా వాళ్లతో మాట్లాడాను. ఓవర్‌నైట్ కొరియర్ సర్వీసులో వీళ్లు హైద్రాబాద్‌లో వాళ్లింట్లో అడుగుపెట్టేలోపులో చేరే ఏర్పాటు చేసారు" అంది ప్రథమచికిత్స.

"ఆ కొరియర్‌ని తీసుకునేదెవరు" అడిగాడు జవసత్వం.

"ఆ ఫ్లాట్స్ వాచ్‌మన్ కాలభైరవం. ఆ కవర్ మీద సెల్ నెంబరు నాదే యిచ్చాను. ఆ విషయాలు నేను చూసుకుంటా. మీరు యింజక్షనివ్వండి" అంది ప్రథమచికిత్స.

* * *

"అయ్యో హవ్యవాహనంగారూ! మీరింత చక్కగా నవ్వుతూ మాట్లాడుతారు. మీకు పిచ్చి కోపమంటారు. ఎంతవరకు నిజమండీ?" అడిగాడు జవసత్వం.

"నేను కోపమే ఎరుగనండీ. మా ఆవిడ అజాగ్రత్త చూస్తే చాలు. మరి..." అన్నాడు హవ్యవాహనం, నిద్రమత్తులో గురక పెడుతున్న ఆదితాళాన్ని కదిలిస్తూ.

"ఏమవుతుందేంటి" అడిగాడు జవసత్వం.

"లేచింతరువాత మా ఆవిడనడగండి" అన్నాడు హవ్యవాహనం.

"అజాగ్రత్త మానవసహజం కదండీ" సౌమ్యంగా అన్నాడు జవసత్వం.

"కాదు, భార్య సహజం" చికాగ్గా అన్నాడు హవ్యవాహనం.

"భర్త సహజం ఎందుకు కాకూడదన్నయ్యగారూ" అంది ప్రథమచికిత్స.

"అది మీ యింట్లో ఏమోగాని మా యింట్లో కాదు" చికాకు మొహంతోనే అన్నాడు హవ్యవాహనం.

"మీరు పోగొట్టుకున్న ఆరు సెల్‌ఫోన్లు ఎవరి అజాగ్రత్తవల్లేంటి" అంది ప్రథమచికిత్స.

"ఎవరు చెప్పారు మీకా సంగతి" చికాకుని కొంచెం కోపంగా మార్చి అన్నాడు హవ్యవాహనం.

"మీరే అన్నారు. యిప్పుడు వాడేది ఎన్నో సెల్లో చెప్పుకోవడం – అదో సోషల్ స్టేటస్ అనీ, మీ చేతిలో వుంది ఏడోఫోననీ" అంది ప్రథమచికిత్స.

యింతలో టీసీ వచ్చి 'టికెట్ ప్లీజ్' అన్నాడు.

హవ్యవాహనం వళ్లంతా తడుముకుని గాభరాపడి చినిగిన జేబు చూపించాడు. "పిక్‌పాకెటింగ్ జరిగింది. నా పర్సు, టికెట్లు కూడా అందులోనే వున్నాయండీ" అంటూ.

"అంత అజాగ్రత్త అయితే ఎట్టాండీ, జేబు దొంగల హెచ్చరికతో ప్రతి చోటా ఫోటోలు కూడా పెట్టాం" అన్నాడు టీసీ.

"అన్నయ్యగారు ఆ ఫోటోలు చూస్తున్నప్పుడే ఎవరో జేబు కత్తిరించినట్లున్నారు" అంది ప్రథమచికిత్స.

"సరే. తర్వాతి సంగత్తర్వాత. ముందు మీరు పేమెంట్ చేసి రసీదు తీసుకోవాల్సిందే. దిగింతరువాత చూపించడానికుంటుంది" అన్నాడు టీసీ

* * *

"అయ్యబాబోయ్. నా పేరు మీద కొరియరేంటండోయ్. తెరిస్తే పేలుతుందో ఏంటో" అన్నాడు వాచ్‌మన్ కాలభైరవం.

"అడ్రసిదేకదా. సీసిక్సీటూలో హవ్యవాహనం గారేగా వుండేది" అన్నాడు కొరియర్ బాయ్.

"ఆయనే, ఊరెళ్లడం తెలుసు. ఎప్పుడొస్తాడో తెలియదు" అన్నాడు కాలభైరవం.

"అదేమోగాని మీపేరుమీదొచ్చింది కాబట్టి మీకివ్వడమే నా ధర్మం" అన్నాడు కొరియర్ బాయ్.

దీన్లో ఏముందో ఏంటో. వాళ్లు ఊరునుంచి



వచ్చిందాకా నాదగ్గర ఉంచుకోవచ్చో లేదో అనుకుంటూ ఆ కవర్‌ని వెంటిలేటర్‌లోంచి హవ్యవాహనం ఫ్లాట్స్‌లోకి విసిరేసాడు కాలభైరవం.

*   *   *

సికింద్రాబాద్‌లో రైలాగింది.

ఆదితాళం నిద్రలేచి తాళం చెవి గుర్తుకొచ్చి గాభరాపడి కనిపించిన దేవుడి బొమ్మకు దండం పెట్టుకుంది.

హవ్యవాహనాన్ని మాత్రం వెంటనే యింటికి వెళ్లకుండా రకరకాల ప్రయత్నాలు చేసి నీరుకారిపోయాడు జవసత్వం. అందరూ కలిసి ఆటోల్లో యింటికి వెళ్లారు. ఆదితాళం తమ్ముణ్ణి తోడుగావుంటాడని రమ్మని ఫోన్ చేసింది ప్రథమచికిత్స - కాలభైరవాన్ని జవసత్వం కలిసి మాట్లాడేలోపులో-

"సార్, నాపేరు మీద మీకో కొరియర్ వచ్చింది. మీ యింట్లోనే పడేశా" అన్నాడు కాలభైరవం. హవ్యవాహనం అదేంటన్నట్లు చూశాడు. ఖంగుతిన్నారు జవసత్వం, ప్రథమచికిత్స.

జరిగిన సంగతంతా హవ్యవాహనానికి వివరంగా చెప్పాడు జవసత్వం. - తాళాలు రిపేరు వాణ్ణి పిలవడం, డూప్లికేటు తాళాలు చేయించడం, తాత్కాలికంగా తలుపులు తెరుచుకుంటాయి గాని సేఫ్టీకోసం ఒరిజినల్ తాళాలే తీసుకోవాలి. ఖర్చు - అన్నీ కంటి ముందు మెదిలి కన్నెర్రజేసి ఆదితాళం మీద చేయి పైకిలేపాడు హవ్యవాహనం.

ఆదితాళాన్ని పక్కకు లాగింది ప్రథమచికిత్స. ఆ హడావిడిలో హవ్యవాహనం చేతిలో సెల్లు జారిపడి ముక్కలైంది.

"ఇక పీస్ నెంబరు ఎనిమిది. మీ స్టేటస్ మారిందన్నయ్యగారూ" అంది ప్రథమచికిత్స.

*   *   *

"మీరు ఈ పిచ్చికోపాన్ని వదిలిపెట్టకపోతే మీపై చట్టపరంగా చర్య తీసుకోవాల్సి వుంటుంది." అన్నాడు హవ్యవాహనం బావమరిది వచ్చి.

"ఒరేయ్! సొంత ఖర్చుతో నిన్ను నాందేడు తీసికెళ్లి నీతో లా పరీక్ష రాయించింది నేను.




నిన్ను లాయర్ని చేసింది నేను. ఓరేయ్! న్యాయ వ్యాధీ నాపై చర్య తీసుకుంటానంటావురా" అన్నాడు హవ్యవాహనం.

"అక్కయ్యమీద మీరెన్నిసార్లు చేయి చేసుకున్నా నేనేమన్నా అన్నానా బావగారూ. బైట టీవీవాళ్లు, పేపరువాళ్లు, పోలీసులూ కాచుక్కూచుంటే తప్పించుకొచ్చా, మీకీ విషయం చెబుదామని" అన్నాడు బావమరిది.

కోర్టుసీను ఊహించుకున్న హవ్యవాహనంలో మార్పు వచ్చింది. సమయానికి డాక్టరు జవసత్వం వచ్చాడు.

"డాక్టరుగారూ నేనే వద్దామనుకుంటున్నా మీరేవచ్చారు" అన్నాడు హవ్యవాహనం.

"దేనికో" అన్నాడు జవసత్వం.

"జవసత్వాలుడిగిపోయినా నా చేయిపైకి లేవకుండా వుండేట్లు లేదు. మీరే ఏదన్నా ఆపరేషన్ చేయాలి" అన్నాడు హవ్యవాహనం.

"పేషంటు కోరినట్టు కత్తితిప్పడం మా వృత్తి ధర్మం కాదు" అన్నాడు జవసత్వం.

"అయితే బావగారి చేతులకి సంకెళ్లు వేద్దాం వైరైటీగా" అన్నాడు బావమరిది.

"ఆ మాట నీ నోటికెలా వచ్చిందిరా" అంటూ తమ్ముడి వీపుమీద చేయి విసిరింది ఆదితాళం.

"అక్కా" – అని అరిచి లేవకుండా పడిపోయాడు బావమరిది.

"ఇక నా జన్మలో నీ మీద చేయి చేసుకోనోయ్. అంతగా కోపం వస్తే యివిగో యీ యిసుక బస్తా వేలాడదీస్తున్నాను దానిమీద నీ పేరు రాస్తున్నాను" అన్నాడు హవ్యవాహనం.

"మాక్కావాల్సిందదే బావగారూ. అయితే యింకో బస్తా కూడా బాల్కనీలో వేలాడదీస్తున్నాను. దానిమీద మీ పేరు రాస్తున్నాను. కాకపోతే దానిలో వుండేది దూది" అన్నాడు బావమరిది లేచి.

"ఆఁ" అన్నాడు హవ్యవాహనం.

నవ్వాడు జవసత్వం. ●




విజయవాడ ప్రెస్‌క్లబ్‌లో ఎక్స్‌రే సాహిత్య, సాంస్కృతిక సేవా సంస్థ నిర్వహించిన 'ప్రజాస్వామిక సాంస్కృతికోద్యమ నేత, నిప్పుల ఉప్పెనై ప్రవహించే ఉపన్యాసకుడు, దిగంబర కవి జ్వాలాముఖి' స్మృతివేదికపై ప్రసంగిస్తున్న సహచరుడు, దిగంబరకవి నిఖిలేశ్వర్. చిత్రంలో ఎక్స్‌రే అధ్యక్షుడు కొల్లూరి.



విశాఖ సాహితి, సాహిత్య సురభి సంయుక్త నిర్వహణలో ప్రవాసాంధ్రులు, ప్రముఖ కథకులు శ్రీ గుమ్మా ప్రసాదరావు కథా సంపుటి 'సంబంధం' ఆవిష్కరణ దృశ్యం. ఎడమ నుంచి గ్రంథ స్వీకర్త డా॥ మోపిదేవి విజయగోపాల్ (మానసిక వైద్యశాస్త్ర ఆచార్యులు), ప్రముఖ కథకులు అవసరాల రామకృష్ణారావు, గ్రంథ ఆవిష్కర్త శ్రీమతి ప్రయాగ వేదవతి (ఆకాశవాణి, విశాఖ కేంద్ర సంచాలకులు), సభాధ్యక్షులు ఆచార్య జి.వి.ఎస్.ఎల్. నరసింహరాజు (గ్రంథాలయ సమాచార విజ్ఞానశాస్త్ర విశ్రాంతాచార్యులు), డా॥ వడ్డి విజయసారథి (జాగృతి వారపత్రిక సంపాదకులు), గ్రంథకర్త శ్రీ గుమ్మా ప్రసాదరావు.

ఎస్. శేషగిరి

# మౌనంతో.................

గేటు బయట కారు హారన్ మోగింది.

నా గుండె ఝల్లుమంది. హారన్ శబ్దం విన్నందుకు కాదు. విక్రమ్ వచ్చినందుకు.

అంటే వాడు నిజంగానే వచ్చాడన్నమాట. వాడు రోజూ రావడం వేరు, ఈ రోజు రావడం వేరు.

వచ్చినందుకు సంతోషించాలో... విచారపడాలో తెలియని డైలమాలో ఉన్నాను...

ఇంతలో వాడు మళ్లీ హారన్ మోగించాడు... త్వరగా రమ్మంటూ...

"ఆ... వస్తున్నారా!" అంటూ గబగబా తలుపుతీసి బయటకొచ్చి, లాక్‌చేసి వెళ్లి కార్లో కూర్చున్నాను.

"ఏరా... ఏంటింత ఆలస్యం? అక్కడకు వెళ్లకముందే ఊహల్లో తేలిపోతున్నావా... ఏంటి?" అన్నాడు విక్రమ్ చిన్నగా నవ్వుతూ, కారు స్టార్ట్‌చేసి ముందుకు పోనిస్తూ.

"అబ్బే... అదేంలేదురా..." అన్నాను ఏమనాలో తెలియక చిన్నగా నవ్వుతూ.

మా ఇద్దరిమధ్యా మౌనం చేరి... మాటలను బంధించింది.

కారు జోరుగా పరిగెడుతోంది. నా ఆలోచనలు అంతకంటే వేగంగా పయనిస్తున్నాయి.

'మొదటిసారి... జీవితంలో అటువంటి చోటుకెళ్లడం. ఎలా ఉంటుందో ఆ అనుభవం?' అని నా మనసు తెగ ఉవ్విళ్లూరుతోంది.

ఇంతవరకూ స్త్రీ స్పర్శ ఎరుగని నేను మరి కొంతసేపట్లో... ఒక స్త్రీతో రాత్రంతా గడపబోతున్నాను. ఆ ఊహకే నా నరాలు జివ్వుమంటున్నాయి. అసలే చలికాలం... అందులో వయసులో ఉన్నవాణ్ణి.

కోరికలు గుర్రాలై దారితెలియని గుమ్మానికి పయనిస్తుండే వయసులో ఇంతవరకూ నేను వాటికి జాగ్రత్తగా కళ్లెంవేస్తూ వచ్చాను. విక్రమ్ ఆ కళ్లేలను ఇప్పుడు తెంచబోతున్నాడు.

నేనూ, విక్రమ్ ఒక పెద్ద ఎం.ఎన్.సి. కంపెనీలో పనిచేస్తూ హైదరాబాద్ నుంచి ముంబైకి ట్రాన్స్‌ఫరై వచ్చాము రెండేళ్లక్రితం.

ఇద్దరి వయసూ పాతికలోపే. జీతం పాతిక వేలకు పైనే కావడంతో జీవితంలో స్వేచ్ఛకు జీతం తోడైంది. వయసు దారిమళ్లింది వాడి విషయంలో.

నేను అంత అమాయకుడినని కాదు. ఏదో అప్పుడప్పుడూ ఓ బీరు, సినిమాలకే నా సరదాలు పరిమితం తప్ప అంతకంటే అడ్వాన్స్ అవలేదు. అవదలచుకోలేదు.

నాకున్న ఏకైక హాబీ పుస్తకాలు. పుస్తకాలే నా ఫ్రెండ్స్, పుస్తకాలే నా ప్రపంచం.

ఆఫీస్ నుంచి రాగానే మంచి పుస్తకంతో కాలక్షేపం చేస్తాను తప్ప సినిమాలు, పబ్‌లు, క్లబ్బులు అంటూ సమయమూ, డబ్బూ వృధా చేయను.

అలా పుస్తకాలు చదవగా చదవగా ఎందు

కో నాకూ రాయాలనిపించి రాయడం మొదలు పెట్టాను. క్రమంగా అవి వివిధ పత్రికల్లో అచ్చ వడం మొదలవడంతో ఏదో.తెలియని ఆత్మతృప్తి నన్నావహించేది.

నేనో కథ రాయాలంటే... నా మనసులో ఎక్కడో ఏదో అలజడి రావలసిందే. అలా రేగిన అలజడే నేను రాయబోయే కథకు కావలసిన స్ఫూర్తినిచ్చేది. అందుకే నేనీసారి వేశ్యపై కథ రాయాలని నిర్ణయించుకున్నాను.

నా కథలకొచ్చే పారితోషికంతోపాటు నా కొచ్చే జీతంలో కొంతభాగాన్ని కలిపి దానధర్మా లకు ఉపయోగిస్తూ, నా అవసరాలకు సరిపడా ఉంచుకుని మిగిలిన డబ్బుని నా తల్లిదండ్రులకు పంపిస్తుంటాను.

విక్రమ్ నాకు పూర్తిగా విరుద్ధం. పాతిక వేలు జీతమొచ్చినా రెండోవారమే నా ముందు వందకీ యాభైకీ చెయ్యి చాస్తుంటాడు.

శని ఆదివారాలొస్తే వాడిలోకం వాడిది. క్లబ్బుల్లో మందు, పబ్బుల్లో చిందులు.. ఖరీదైన రెస్టారెంట్లలో విందులు... ఆపై అందమైన అమ్మాయిలతో పొందులు...

"జీవితాన్ని ఎంజాయ్ చెయ్యాలిరా..." అని తరచూ అంటూండేవాడు విక్రమ్.

వాడి లైఫ్‌ని వాడికి నచ్చిన స్టయిల్లో ఎంజా య్ చేస్తే నేను నా లైఫ్‌ని నాకు నచ్చిన స్టయిల్లో ఎంజాయ్ చేస్తుంటాను.

అందమైన అమ్మాయిల గాఢపరిష్వంగం లోని వెచ్చదనం వాడికి సంతృప్తినిస్తే... ముంబై రోడ్లమీద, ఫుట్‌పాత్‌లపై చలికి వణుకుతూ పడు కున్న వారికి బ్లాంకెట్లు కప్పడంలోని వెచ్చదనం నాకు సంతృప్తినిస్తుంది.

ఇలా మా ఇద్దరి అభిప్రాయాలూ వేరైనా మా మధ్య ఉన్న స్నేహమనే వారధి పటిష్టంగానే నిర్మితమైంది.

ఈ మధ్య మా వాళ్లు నాకు పెళ్లి ప్రయత్నా లు మొదలుపెట్టారు. "ఈ అమ్మాయినే చేసుకో వాలి అని షరతులు పెట్టకుండా నీకు ఏ అమ్మా యి నచ్చినా సరే... వెంటనే మూడు ముళ్లూ వేయిస్తాం" అని పట్టుబట్టారు.

అది విన్నప్పట్నుంచీ వీడు ఒకటే నస. "పెళ్లి కి ముందర ఒక్కసారైనా ఆ ముచ్చట తీర్చుకో రా. కాస్త ఎక్స్‌పీరియన్స్ వస్తుందీ..." అంటూ చెవిలో జోరీగలా గోలపెడుతుండేసరికి... నాకూ ఎందుకో వాడి మాటలమీద మొదటిసారి ఇంట్రె స్ట్ కలిగి... ఇంప్రెస్ అయ్యాను. వెంటనే "ఓకే" అన్నాను. పన్లో పనిగా నా కథకి కావలసిన థీమ్ దొరుకుతుందనే ఆశతో...

కారు స్పీడ్ తగ్గింది. విండోలోనుంచి చల్లటి గాలి నా వంటికి తగిలి గిలిగింతలు పెడుతోం ది. 'అబ్బా! ఈ చల్లగాలే ఇంత గిలిగింతలు పెడుతోంటే... ఇక ఆ పిల్లగాలి ఎంత హాయిగా ఉంటుందో?...' అనుకున్నాను మనసులో.

అలా అనుకుంటూండగానే కారు ఒక సందులో ఆగింది. అదో పెద్ద బంగ్లా.

విక్రమ్ చకచకా దిగి లోనికి నడుస్తున్నాడు. బహుశా వాడికది బాగా అలవాటైన దారి కాబోలు.

"ఏరా! కారు దిగవా ఏంటీ? కొత్త పెళ్లి కొడుకులా సిగ్గుపడుతున్నావు? పద పద" వెను దిరిగి నన్ను ఉద్దేశించి అంటూ మళ్లీ లోనికి నడకదీసాడు.

నేను నెమ్మదిగా వాడి వెనకే నడుచుకుంటూ వాడిని ఫాలో అయ్యాను.

లోనికి అడుగుపెడుతూంటే నా కాళ్లు సన్న

గా వణకడం నాకు తెలుస్తోంది. అది భయం వల్లో లేక నేను పొందబోయే అనుభవం తాలూకు థ్రిల్‌ని తలచుకునో నాకు స్పష్టంగా తెలియడంలేదు.

అచ్చం సినిమాల్లో చూసినట్లే ఉందా వాతావరణం. అసలు ఇటువంటి చోట్లుంటాయని వినడం, సినిమాల్లో చూడడమే గాని, నిజంగా నేను డైరెక్ట్‌గా వస్తాను అనుకోలేదు కలలోనైనా.

విక్రమ్ ఎవరో ఒక నడివయసు స్త్రీతో మాట్లాడుతున్నాడు. ఆమె వయసు దాదాపు నలభై అయిదుంటుంది. ఇంకా శరీరపు బిగువులు సడలలేదు. నోట్లో జర్దాకిళ్లీ, వంటినిండా నగలూ చెప్పకనే చెప్తున్నాయి ఆమె అమ్మాయిల ఏజంటని.

"క్యా విక్రమ్! నయా చోకరేకో లాయేహ? ముర్గా బహుత్ అచ్ఛాహై. బోలో కైసీ ముర్గీ చాహియ్?" అంది చిన్నగా కన్నుకొట్టి.

"ఏరా చెప్పు... నీకెలాంటి పిల్లకావాలో?" అన్నాడు నన్ను చూసి నవ్వుతూ విక్రమ్.

ఇంతలో... "యే కింతి... శాంతి... శైలు... ఫల్లూ..." అంటూ ఓ అరుపరిచింది బండ గొంతుకతో...

ఆ పిలుపు విన్న వెంటనే సీతాకోకచిలుకల్లాంటి అందమైన అమ్మాయిలంతా బరబరామంటూ వచ్చి, వరుసగా నిల్చున్నారు సంతలో బేరానికి పెట్టిన పశువుల్లా.

"బోల్‌చోక్రా? కౌన్‌చాహియే?" అంది ఆమె నన్ను సూటిగా చూస్తూ.

నేను నెమ్మదిగా తలెత్తి అందరినీ పరీక్షగా చూసాను.

నేను కాసేపలా చూస్తుండగానే తనే అంది... "అరే చోక్రా ఇన్ మేసే కోయీ పసందాయా?" అంది నోట్లోని జర్దాకిళ్లీ పక్కనున్న తొట్టిలోకి ఉమ్ముతూ.

"ఉహూ" అన్నాను తల అడ్డంగా ఊపుతూ.

"తో ఏక్ కామ్‌కరే... ఏక్ ఆంధ్రా ముర్గీహై తెరేలియే... తూ ఉస్ సమజ్ కర్లే..." అంటూ "ఏయ్" వాహినీ... వాహినీ... అంటూ పిలిచింది.

జింక పిల్లలా పరుగు పరుగున పరిగెత్తుకొచ్చిన ఆ పిల్ల వంక పరీక్షగా చూశాను. కుందనం బొమ్మలా ఉంది. అందంగా... అమాయకంగా... ఉన్న ఆమె కళ్లు నన్నెంతగానో ఆకర్షించాయి.

నేనామె వైపు పరీక్షగా చూడ్డం గమనించిన ఆవిడ "క్యాభక్షకరి పసందాయా?" అడిగింది పెద్దగా నవ్వుతూ.

నేను చిన్నగా నవ్వాను నచ్చిందని అన్నట్టుగా.

"చల్ చల్ మజా కర్‌లే" అంటూ పైనున్న రూమ్ చూపించింది నాకు.

"ఆల్ ది బెస్ట్ రా..." అన్నాడు మావాడు కన్ను కొట్టి నవ్వుతూ.

ఆమె ముందుగా నడుస్తుంటే నేనామెని అనుసరించాను.

గది తలుపు తెరిచి లోనికి అడుగుపెట్టాను. విశాలమైన గది. గోడలకు వెలసిపోయిన సున్నం.

ఓ డబుల్ కాట్ మంచం, దాని పక్కనే ఓ అటాచ్‌డ్ బాత్‌రూమ్ వున్నాయా గదిలో.

నాలోని రచయిత ఆ పరిసరాలని ఓ కంట గమనిస్తున్నాడు.

అప్పటికే ఆ అమ్మాయి నాకోసమై ఎదురు

చూస్తూ మంచంపై కూర్చునుంది.

ఆమెనెలా పలకరించాలో... ఏమని పలక రించాలో అర్థం కాలేదు. క్షణాలు నిమిషాలై గడిచి పోతున్నాయా గదిలో.

"ఆప్ కా నామ్?" అన్నాను కాస్త గొంతు సవరించి... అంతకంటే ఏమడగాలో, సంభా షణ ఎలా ప్రారంభించాలో తెలీక.

"నాపేరు వాహిని"! అంది అచ్చమైన తెలు గులో కోయిల కూసినట్లుగా.

"అంటే మీరు తెలుగువారేనా? మీదే ఊ రు?" చకచకా ప్రశ్నల వర్షం కురిపించాను.

ఆమె ఏమీ మాట్లాడలేదు. మౌనంగా శూన్యంలోకి చూస్తుండిపోయింది.

"మిమ్మల్నే... మీదేఊరు?" అన్నాను ఈ సారి రెట్టించిన ఉత్సాహంతో. ఆమె గురించి, ఆమె గతం గురించీ రచయితగా తెలుసుకోవా లనే ఆతృతతో.

ఆమె ఆశ్చర్యంగా నావైపు చూసింది. ఇంత వరకూ తన శరీరంపై ఎప్పుడెప్పుడు వాలిపో దామా, తననెప్పుడు కోరికతో కసిగా నలిపే ద్దామా అనే ఆతృత, ఉత్సాహం ఉన్న వాళ్లనే చూసింది కానీ తన గురించి, తన గతం గురిం చీ తెలుసుకోవాలనుకుని ఉబలాటపడుతున్న మొదటి వ్యక్తిని నన్నే చూసి వుంటుంది.

ఆమె గతం తాలూకు జ్ఞాపకాలను తవ్వి నందుకు హృదయం కరిగి... కళ్లు వర్షించడం మొదలెట్టాయి.

"మాది తూర్పు గోదావరి జిల్లాలోని చిన్న పల్లెటూరు."... అంటూ చెప్పడం ప్రారంభిం చింది... "మా నాన్నకు రెండెకరాల పొలం ఉండేది. గత నాలుగైదేళ్లుగా వర్షాలు లేకపో వడంతో తీవ్ర కరువు దాపురించింది. మా నాన్న అప్పులు తీర్చలేక సంసారాన్ని నడపలేక... విధిలేని పరిస్థితిలో ఆత్మహత్య చేసుకున్నాడు – మమ్మల్ని వీధిలోకి విసిరేసి. నాకు నా మీద ఆధారపడ్డ తల్లి, ఓ తమ్ముడు, ఓ చెల్లీ ఉన్నారు."

ఇంటర్ చదివిన నాకు ముంబైలో మంచి ఉద్యోగం ఇప్పిస్తానని చెప్పి మా ఊర్లోని ఓ పెద్దమనిషి నన్ను తీసుకొచ్చి ఇక్కడ పడేసాడు. తరువాత తెలిసింది నన్నతడు 'అమ్మేసాడు' అనే సంగతి... అంటూ ఏడుస్తూ చెప్పడం ఆపింది.

"ఆ ఆంటీ చెప్పిన మాట విననందుకు మొదట్లో నన్ను తిట్టేది... తరువాత కొట్టేది... ఆ తరువాత వాతలు కూడా పెట్టేది..." అంటూ చీరను లాగి పారేసింది గబగబా. ఆమె వీపు పైన, మెడ మీద, భుజాల మీద కనిపిస్తున్న కాలిన గుర్తులు ఆమె చెప్పినవన్నీ వాస్తవాలే అని చెప్పక చెప్పాయి.

"అయినా... ఇవన్నీ మీకెందుకు లెండి... మీరు డబ్బులిచ్చారు... కోరికతో వచ్చారు.... మీ కోరిక తీర్చకపోతే... నాకీ పూట తిండి కూడా పెట్టదు ఆంటీ" అంది భయంగా. మం చం మీద వెల్లికిలా పడుకుని కళ్లు మూసుకుంది మనసు చంపుకుంటూ.

నాకెందుకో ఆమె మాటలు కొరడాల్లా చెళ్లున తగిలాయి. ఆమె ఈ సంస్కృతికి ఇంకా అలవాటుపడలేదన్న సంగతి ఆమె మాటల ద్వారా అర్థమైంది.

కాదూ కూడదూ అని మొండికేస్తే... ఆ ఆంటీ మళ్లీ ఏం చేస్తుందో అని భయంతో... కాలే కడుపుతో భగభగ మండే ఆకలికి భయ పడే ఆమె ఈ విధంగా మాట్లాడగల్గిందని అర్థ మైంది నాకు.

'రండి. మీ పని మీరు చేసుకుపోండి'... అంది నాకెదురుగా నిల్చుని తలవంచుకుని.

ఆమె వంటి మీద చీర కూడా లేకపోవడం తో తెల్లని ఆమె శరీరం... ఆకర్షణీయంగా కనిపిస్తోంది.

ఎత్తయిన ఆమె వక్షసంపద వేరొకర్నయితే ఇట్టే ఆకర్షించేదే. కానీ నాకు మటుకు ఆ ఎత్తయిన ఎదలచాటున దాగున్న లోతైన బాధ కనిపించింది.

పల్చని ఆమె పొట్టపై ఉన్న అందం కాక ఆ పొట్టలో ఆకలి కేకలు వినిపిస్తున్నాయి నాలోని రచయితకు.

కోరికతో నిండినట్లుగా కనిపిస్తున్న ఆ కళ్లలో... భయం కనిపిస్తోంది... ఆమెలో నాకిప్పుడు భోగవస్తువు కనిపించడంలేదు.

పట్టెడు భోజనం కోసం బలవంతాన మోసగించబడ్డ, బజార్న పడ్డ ఓ నిస్సహాయురాలు కనిపించిందామెలో.

వెంటనే లేచి కిందపడ్డ ఆమె చీర తీసి ఆమెపై కప్పి... పర్సులో ఉన్న డబ్బంతా తీసి ఆమె చేతిలో పెట్టి... 'మీ మీద ఓ కథ రాయాలనుకుంటున్నాను...' అన్నాను... నెమ్మదిగా. నాక్కావాల్సిన కథకు అసలైన నిజమైన థీమ్ దొరికిందని తెలిసి.

ఆమె నవ్వింది... పెద్దగా నవ్వింది... పడీ పడీ నవ్వింది...

"ఏంటీ? నాపై కథ రాస్తారా?!"

"ఇప్పటి వరకూ నామీద... నా శరీరం మీద చాలా మంది కథలు రాశారు. కొందరు చేతులతో... కొందరు పెదాలతో... కొందరు పంటిగాట్లతో... సిగరెట్లతో... పదునైన గోళ్లతో... మదమెక్కిన మగసిరితో... మీరు దేంతో రాస్తారు?" అంది వస్తున్న నవ్వుని బలవంతాన ఆపుకొంటూ.

"మనసుతో" అన్నాను ఆమె కళ్లలోకి సూటిగా చూస్తూ.

"ఏంటి?" ఓ నిమిషం అర్ధంకానట్లు చూసింది నావైపు.

"ఇంతవరకూ నువ్వు కడుపునిండా తిండి తిని ఎన్నాళ్లయింది?" అన్నాను లోపలకు పోయిన ఆమె పొట్టని, వాడిపోయిన ఆమె మొహాన్నీ చూసి.

ఆశ్చర్యపోయిందామె నా ప్రశ్నకు. బహుశా తనకే తెలియదేమో ఆ ప్రశ్నకు సమాధానం.

'తెలీదు!' అంది నెమ్మదిగా.

'పోనీ కంటినిండా నిద్రపోయి ఎన్నాళ్లైంది?' వలయాలు కమ్మిన ఆమె కళ్లను సూటిగా చూస్తూ అడిగాను.

'ఉహు.. తెలియదు!!'

ఆమె ఆలోచిస్తూంది... ఆశ్చర్యంగా... నాకేసి చూస్తూ.

ఆమె చూపుల్లో వేలవేల భావాలున్నాయి... ఇంతవరకూ "ఎంతమందితో పడుకున్నావు.. ఎంతమందిని కవ్వించావు?...' అని అడిగే వాళ్లనే చూసుంటుందామె, కానీ... తన అంతరంగాన్ని తెరిచి... తరచి చూస్తున్న మొదటి వ్యక్తిని వింత అనుభూతితో చూస్తోంది.

ఆ విధమైన అనుభూతి చెందడంతో అప్రయత్నంగా. . ఆమె కళ్ల నిండా నీళ్లు నిండి జలజలా జారాయి. ఆ నీళ్లు ఆమె కళ్లనుంచి కారుతున్నవి కాదని, అది ఆమె గుండెల్లోనుంచి పొంగి పొరలుతున్న సముద్రమని గ్రహించిన నా మనసు బరువెక్కింది. అప్రయత్నంగా ఓ అడుగు ముందుకేసి కన్నీటిని తుడిచి, ఆమెను గాఢంగా హృదయానికి హత్తుకున్నాను. కోరికతోకాదు... మనసుతో. మంచి మనసుతో...●

సకల శుభాలనూ ఇచ్చే

# మంగళగిరి

**కొం**డమీది దేవుడు. కోర్కెలు తీర్చేవాడూ, బాధలనూ ఆర్చే వాడూ! సకల శుభాలనూ ఇచ్చేవాడూ! ఆయన కొండపైన ఉన్నా, కింద ఉన్నా ఆయన తీరే అంత! దేవుడనేవాడు ఆరుస్తాడో, తీరుస్తాడో, అసలు ఉన్నాడో లేడో – 'కలదు కలండనెడివాడు కలడో లేడో' అన్నట్టు – ఆ దేవుడ్ని అర్థం చేసుకోవడం, తెలుసుకోవడం కష్టసాధ్యమే కానీ, అసాధ్యం కాదు. ఆయన లీలలు అగమ్యగోచరాలు! అయితే ఆ దేవ దేవుడు – ఎక్కడో కొండమీద కూచొని 'పానకం' త్రాగడం ఏమిటి? అదీ ప్రతివారూ నివేదించిన దానిలో సగం త్రాగి, మిగతాది వెనక్కి ఇవ్వడం ఏమిటి? అసలు పానకం మాత్రమే స్వామి స్వీకరించడంలో ఔచిత్యమేమిటి? వీటన్నిటినీ 'సైన్సు' కాదు అనేవాళ్లు ఏం చెబుతారో (బహుశా అది శాస్త్రీయం కాదు! అంటారేమో!) కానీ, దాని వెనక ఎంతో

ఆధ్యాత్మికపరమైన విజ్ఞానం దాగి ఉంది. "ఏ విషయమైనా తనకు తానుగా స్వయంగా తెలుసుకునే నమ్మడం అనేది మూర్ఖత్వం. ఇంకొకరు తమ అనుభవాలను చెప్పినపుడు వాటిని నమ్మి తెలుసుకోవడం తెలివైన పని" అని ఒక సామెత ఉండనే ఉంది. దేవుడొక్కడే. రూపాలెన్నో... కొండమీద, కొండకిందా వెలసి, అందర్నీ బ్రోచే దేవుడు మంగళగిరి లక్ష్మీనరసింహస్వామి. కొండపై వెలసిన ఈ స్వామికే పానకాలస్వామి అని పేరు. ఈ వ్యాసం చదివేక మీరు ఎలాంటి నమ్మకంలేనివారైనా సరే, నమ్మాల్సిందే! నమ్మి కొలవాల్సిందే!

మంగళగిరి... విజయవాడ, గుంటూరు నగరాల మధ్య ఉంది. గుంటూరు నుంచి 19 కి.మీ. దూరంలో, విజయవాడ నుంచి 12 కి.మీ. దూరంలో సముద్రానికి 30 మీటర్ల ఎత్తులో ఉంది. క్రీ.పూ. 225 నాటికే మంగళగిరి ఉన్నట్లు చరిత్రకారుల నమ్మకం. ఆంధ్ర శాతవాహనులు క్రీ.పూ. 225 నుంచి క్రీ.శ. 225 వరకూ ధాన్యకటకం రాజధానిగా పాలించిన రాజ్యంలో మంగళగిరి ఒక భాగం. ఆ తర్వాత క్రీ.శ. 300 వరకూ ఇక్ష్వాకుల పాలనలో, ఆ తరువాత పల్లవుల ఏలుబడిలోకీ వచ్చింది. క్రీ.శ. 420 నుంచి క్రీ.శ. 620 వరకూ విష్ణుకుండినులు మంగళగిరిని పాలించారు. రెండవ మాధవవర్మ విజయవాడను రాజధాని



డా॥ సాయి అయితిక



గా చేసుకుని మంగళగిరిని పాలించాడు. క్రీ.శ. 630 నుంచి చాళుక్యుల పాలనలో ఉన్న మంగళగిరి క్రీ.శ. 1182 నాటి పల్నాటి యుద్ధం తర్వాత కాకతీయుల పాలనలోకి వచ్చింది. క్రీ.శ. 1323 లో కాకతీయులపై దాడిచేసి గెలిచిన సుల్తానుల పెత్తనం కొద్దికాలమే సాగింది. క్రీ.శ. 1353 లో రెడ్డిరాజులు కొండవీడు రాజధానిగా చేసుకుని పాలించారు. క్రీ.శ. 1424 లో కొండవీటి రాజ్యం అంతరించాక మంగళగిరి గజపతుల ఏలుబడిలోకి వచ్చింది. క్రీ.శ. 1515 లో శ్రీకృష్ణదేవరాయలు గజపతులను జయించి, మంగళగిరిని తన ఏలుబడిలోకి తెచ్చుకున్నాడు. అలనాటి విజయనగర రాజ్యంలో 200 పట్టణాల్లో మంగళగిరి ఒకటి.

క్రీ.శ. 1565 లో జరిగిన తళ్లికోట యుద్ధంతో విజయనగర రాజ్యం పతనమైపోయాక మంగళగిరి గోల్కొండ కుతుబ్‌షాహీల పాలనలోకొచ్చింది. క్రీ.శ. 1750 నుంచి 1758 వరకూ ఫ్రెంచ్‌వారి పాలనలో, క్రీ.శ. 1758 నుంచి 1788 వరకూ నిజాం పాలనలో ఉంది. ఆ తర్వాత బ్రిటిష్‌వారి ఆధీనంలోకి వచ్చింది అపుడు బ్రిటిష్‌వారు మంగళగిరి ప్రాంతానికి వాసిరెడ్డి వెంకటాద్రినాయుడనే అతన్ని జమిందారుగా నియమించడం జరిగింది. ఈయనే 11 అంతస్తుల గాలిగోపురాన్ని నిర్మింపజేసాడని ప్రజలు గొప్పగా చెప్పుకొంటుంటారు. కాలక్రమంలో గుంటూరుజిల్లాలో ఒక భాగమైంది. అయితే మంగళగిరి పానకాల స్వామి మాత్రం అప్పటికీ, ఇప్పటికీ పానకాన్ని అదే విధంగా స్వీకరిస్తున్నాడు, అందరినీ రక్షిస్తున్నాడు.

ప్రాచీనకాలం నుంచీ మంగళగిరి చేనేతకు, వైష్ణవమతానికీ ప్రసిద్ధిగాంచింది. అద్వైతాన్ని ప్రచారంచేసిన ఆదిశంకరులు, విశిష్టాద్వైతాన్ని ప్రచారంచేసిన రామానుజాచార్యులు, ద్వైతాన్ని ప్రతిపాదించిన మధ్వాచార్యులూ ఈ

క్షేత్రాన్ని దర్శించి, నరసింహస్వామిని పూజించారు. వల్లభాచార్యులు తన ప్రవచనాలను వినిపించిందిక్కడినుంచే. చైతన్య మహాప్రభువు కూడా ఈ ప్రాంతాన్ని దర్శించాడని, ఆయన పాదముద్రలు ఇప్పటికీ కొండపై కనిపిస్తాయనీ అంటారు. తాళ్లపాక అన్నమాచార్యుని మనుమడైన చిన తిరుమలాచార్యులు క్రీ.శ. 1561 లో ఇక్కడి భూమిని రామానుజ సమాజానికి దానం చేసాడట. ఈ మంగళగిరికే తోతాద్రి అని మరో పేరుంది.

అన్నట్టు మంగళగిరి చూడడానికి ఏనుగు ఆకారంలో ఉంటుంది. ఏ దిక్కు నుంచి చూసినా ఏనుగు ఆకారంలోనే కనిపించడం విశేషం. ఈ కొండకు ఇంత పేరు రావడానికి ఎన్నో రకాలైన కథలు ప్రచారంలో ఉన్నాయి. ఒకానొక కాలంలో పరియాత్ర అనే రాజుగారి కుమారుడైన హ్రస్వశృంగి అనారోగ్యంతో బాధపడేవాడు. పరిపూర్ణమైన ఆరోగ్యాన్ని పొందడానికై ఈ హ్రస్వశృంగి తీర్థయాత్రలు చేస్తూ చివరికి మంగళగిరి ఉండే ప్రాంతానికి వచ్చి మూడు సంవత్సరాలు ఘోరతపస్సు చేయగా, దేవతలంతా ప్రత్యక్షమై అతడిని అక్కడే ఉండి విష్ణుమూర్తికై తపస్సు చేయమని సలహా ఇస్తారు. హ్రస్వశృంగి వారి సలహా మేరకు తపస్సు చేస్తూ చివరికి ఏనుగు ఆకారాన్ని పొంది, విష్ణువుకు వాహనంగా మారిపోయాడని ఒక కథ ప్రచారంలో ఉంది. ఈ మంగళగిరిలో గుడి పాదభాగంలో పాండవుల కాలం గుడి ఒకటి ఉంది. ఈ గుడిలో దేవుడు లక్ష్మీనరసింహస్వామి. ఈ గుడిని ధర్మరాజు కట్టించాడని, ఇక్కడికి దగ్గరలో ఉన్న ఇంద్రకీలాద్రి (విజయవాడ) పై అర్జునుడు పాశుపతాస్త్రం కోసం





తపస్సు చేసాడనీ ప్రశస్తి. (ఇంద్రకీలాద్రి మంగళ గిరికి కేవలం 8 కి.మీ. దూరంలో ఉంది.)

మంగళగిరి కొండను ఎక్కడం ప్రారంభిం చిన వెంటనే మెట్ల వద్ద గల లక్ష్మీనరసింహ స్వామి, కొండపై కొలువైన పానకాల లక్ష్మీ నర సింహస్వామి, కొండ శిఖరాగ్రాన ఉండే గండాల నరసింహస్వామి - ఇలా ముగ్గురు నరసింహులు ఈ కొండపై కొలువై ప్రజలను కాపాడుతున్నారు. క్రింద లక్ష్మీనరసింహుని కొలిచి, మెట్లు ఎక్కినంతనే నోరు తెరుచుకుని ఉన్న పానకాల నరసింహస్వామి దర్శనమిస్తా డు. నిలువెత్తు విగ్రహమేమీ కనబడదు. కేవలం కొండ గోడలో 15 సెంటీమీటర్ల వెడల్పులో తెరచుకొన్న నోటిభాగం మాత్రమే కన్పిస్తుంది. కంచు బిందె నిండా బెల్లం పానకం తయారు చేసి తీసుకెళ్లి ఆ స్వామికి సమర్పిస్తే ఆయన స్వీకరిస్తాడు. ఆ స్వామి నోరు తెరుచుకునే ఉం టాడని చెప్పాంకదా! పానకం పోసినంతనే గుటక వేసి తాగుతున్న శబ్దం స్పష్టంగా విన వచ్చు కూడా! సగం పోయడం పూర్తికాగానే గుటకల శబ్దం కూడా ఆగిపోతుంది. ఆ తర్వాత ఎంత పోసినా, ఆ పానకం వెనక్కి వస్తుంది. అది ఎలా ఎక్కడి నుంచి వెనక్కి వస్తుందో మాత్రం అర్థంకాని విషయం. ఆ క్షేత్రంలో అంత బెల్లం పానకం తయారుచేస్తున్నా, ఒక్క చీమ కూడా కనిపించదు. ఆ స్థల మహత్యమది. ఈ మంగళగిరి ఒకప్పుడు అగ్నిపర్వతమని, బెల్లంతో చేసిన పానకం పోస్తూ ఉండడం వల్ల గంధకం ఉండడంవల్ల మండే ఆ అగ్నిపర్వతం చల్లబడుతుందనీ - అందువల్ల ఈ పానకం పోసే ఆచారాన్ని ఒక దైవస్వరూపాన్ని కల్పించి మరీ ఏర్పాటు చేసారనీ అంటారు. అందువల్లే

ఈ పానకం పోయడం తద్వారా ఆధ్యాత్మికతనూ పెంపొందించే కార్యక్రమమూ సాఫల్యతనొందు తుందన్నది నాటి ఆస్తిక వైజ్ఞానిక లోకపు ఆలోచన అని అందరూ నమ్మాల్సిన విషయం. మూడో రూపం నిజానికి శిఖరాగ్రంలో సూక్ష్మ రూపంలో ఉందంటారు. అక్కడ దీపం పెడితే చుట్టుపక్కల గ్రామాలకు కనిపిస్తుందిట.

మంగళగిరి గోపురాన్ని అతిపెద్ద గోపురాల్లో ఒకటిగా చెప్పవచ్చు. దీని ఎత్తు 159 అడుగులు, వెడల్పు 49 అడుగులు. 11 అంతస్తులతో ఈ గాలిగోపురాన్ని నిర్మించారు. తూర్పు, పడమరల వేపు ద్వారాలు ఉన్నాయి. ఈ గాలిగోపురాన్ని నిర్మించేటపుడు ఎన్నో ఒడిదుడుకులు ఎదురయ్యాయిట. గోపురం ఎంతకీ నిలవకపోవడంతో పెద్దలు ఆ గోపురానికి దగ్గరగా ఒక బావిని తవ్వించమని సలహా ఇచ్చారట. అలా బావిని తవ్వి, ఆపై గోపుర నిర్మాణాన్ని కొనసాగించి, పూర్తిచేసారని అంటారు.

ఈ ఆలయంలో విగ్రహాలు తయారైన తీరు గురించి కూడా ఒక కథ ప్రచారంలో ఉంది. ఆలయంలో విగ్రహాలను తయారుచేయడానికి నియమితుడైన కంసాలి పంచలోహాలను కరిగించి, మూసలో పోసాడట. అయితే ఆ లోహాలన్నీ వేటికవే వేరుపడిపోయాయట. అది చూసి నిరాశచెందిన ఆ శిల్పి విచారవదనుడై కాలం గడిపాడట. కొన్నాళ్ల తర్వాత 'నరబలి' ఇస్తే అతని పని సాధ్యమవుతుందని అశరీరవాణి పలికిందట. సరిగ్గా అదే సమయంలో మంచి నీరు కావాలని శిల్పి కొడుకు అక్కడకు రావడం, కరుగుతున్న పంచలోహాల్లోకి పడిపోవడం - తర్వాత విగ్రహాలన్నీ తయారవ్వడం చకచకా జరిగిపోయాయట. ఆ శిల్పి నిర్వికారంగా కొడుకును పేరుపెట్టి పిలవడంతో ఆ విగ్రహాల నుంచి బయటకు వచ్చాడట. ఇలా ఎన్నెన్నో



విశేషాలు మంగళగిరి నరసింహుని గురించిన కథలు ప్రచారంలో ఉన్నాయి.

నరసింహస్వామి విగ్రహం ప్రక్కన లక్ష్మీదేవి విగ్రహం ఉంది. ఈ రెండూ రాతి విగ్రహాలు. స్వామి మెడలో 108 సాలగ్రామాలతో తయారైన ప్రత్యేకమైన దండ ఉంది. స్వామి ఊరేగింపు కోసం వాడే రథం కూడా ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. ఆ రథంపై భారత, భాగవత, రామాయణ కథా శిల్పాలను చెక్కారు. తిమ్మరాజు దేవరాజు అనే విజయనగర రాజుల సేనాధిపతి ఈ దేవాలయాన్ని బాగా అభివృద్ధి చేసాడు. ఈ గుడికి ప్రాకారాన్ని, మండపాలను, గోపురాలనూ నెలకొల్పాడు. బావులు, సరస్సులు, పూదోటలనూ ఏర్పాటు చేసాడు. లోహపు ఉత్సవ విగ్రహాలను తయారు చేయించాడు.

ఈ గుడికి ఉత్తరంలో రాజ్యలక్ష్మి దేవాలయం, దక్షిణాన సీతారామ దేవాలయం, పడమటి దిక్కున వాహనశాల ఉన్నాయి. కొండ అంచులో నిజానికి ఎలాంటి విగ్రహాకృతీ లేదు. అక్కడ కేవలం ఒక దీపం మాత్రమే ఉంచుతారు. కష్టాలలో ఉన్నవారు అక్కడికెళ్లి ఆవు నెయ్యితో దీపాన్ని వెలిగిస్తే వారి కష్టాలన్నీ పటాపంచలైపోతాయట.

ఈ నరసింహ దేవాలయం గురించి మరో కథ కూడా ప్రచారంలో ఉంది. నముచి అనే రాక్షసుడు బ్రహ్మ కోసం ఘోరమైన తపస్సు చేసి, తనకు తడినుంచి, వేడినుంచి చావు





లేకుండా వరాన్ని పొందాడట. దాంతో రెచ్చిపోయి ఇంద్రాది దేవతలను హింసించనారంభించాడు. మహావిష్ణువు సాయంతో ఇంద్రుడు నముచి సైన్యాన్ని సంహరించనారంభించాడు. విష్ణుమూర్తి స్థూలరూపానికి బదులుగా సూక్ష్మ రూపం ధరించి, ఎవరికీ కనిపించకుండా ఈ గుడిలో ఉండి ఆ కార్యక్రమాన్ని ఆరంభించాడట. విష్ణువు నముచి నడుము భాగంలో నిలబడి, అతగాడికి ఊపిరి సలపకుండా చేసి సంహరించాడట. ఆ సమయంలో ప్రవహించిన రక్తం కొండ పాదాల వద్ద మడుగై నిల్చిపోయిందట. స్వామిని శాంతించి, ప్రసన్నం కమ్మని దేవతలంతా ప్రార్థించాక, ఆ స్వామి అమృతం తాగి, శాంతించాడని కథనం. ఇది కృతయుగం నాటి కథ. అమృతం తాగి, శాంతించిన ఆ స్వామి త్రేతాయుగంలో నెయ్యితాగి, ద్వాపరంలో పాలు తాగి, కలియుగంలో పానకం తాగి శాంతిస్తానని చెప్పాడని, అందువల్లే ఆయనకు పానకాలస్వామి అని, పానకాల నరసింహ స్వామి అనీ పేరొచ్చిందంటారు.

శ్రీకృష్ణదేవరాయల కాలంలో మహామంత్రి తిమ్మరుసు ఈ మంగళగిరిని దర్శించి విజయ స్తూపాన్ని నిర్మింపజేసాడు. కొండవీటి మంత్రి సిద్ధరాజు తిమ్మరాజు ఈ గుడిని ఎంతో అభివృద్ధి చేసాడు. మంగళగిరి మధ్యలో అర్ధ ఎకరం స్థలంలో ఒక కోనేరు ఉంది. దాన్నే కళ్యాణ పుష్కరిణి అని పిలుస్తారు. 1558 ప్రాంతాల్లో విజయనగర రాజులు తీన్ని తవ్వించారట. 1832 సంతవత్సరంలో ఈ కోనేరు ఎండిపోతే అందులో 9840 తుపాకులు, 44 గుళ్లూ బైటపడ్డాయని, అవన్నీ పిండారీలకు చెందినవని అంటారు.

మంగళగిరి పానకాలస్వామి బ్రహ్మోత్సవాలు ఏటా ఫాల్గుణ శుద్ధ షష్ఠి నుంచి వరుసగా 11



రోజులు జరుగుతాయి. రామనవమి, నరసింహ జయంతి, హనుమజ్జయంతి, వైకుంఠఏకాదశి వేడుకలే కాక వాటితోబాటు మహాశివరాత్రిని కూడా వైభవంగా జరపడం ఇక్కడి విశేషం. ఈ మంగళగిరిని దర్శించే సమయంలో సమీపంలో ఉండే విజయవాడ ఇంద్రకీలాద్రి, అమరావతి, ఉండవల్లి ప్రాంతాలనూ దర్శించవచ్చు.

ప్రహ్లాదవరదుడైన నరసింహస్వామి ఇప్పటికీ 'పానకం' స్వీకరిస్తూ అందరినీ కొండపై ఉండే రక్షిస్తున్నాడు. ఇది ఆస్తిక లోకానికి అనుభవంలో ఉండేదే! నమ్మకపోవడమంటూ ఉండదు. నమ్మనివారు ఎలాగూ నమ్మరు. ●

# విజయవాడలో
# అంతర్జాతీయ తెలుగు మహాసభలు




'ప్రపంచ తెలుగు సమాఖ్య' ఆధ్వర్యంలో 8వ 'అంతర్జాతీయ తెలుగు మహాసభలు' జనవరి 9, 10, 11 తేదీలలో విజయవాడలో జరుగనున్నాయి. గతంలో ఈ సభలు చెన్నై, హైదరాబాద్, న్యూఢిల్లీ, విశాఖపట్టణం, సింగపూర్, బెంగుళూర్, దుబాయ్‌లలో నిర్వహించబడ్డాయి.

భారతదేశంలోను, విదేశాలలోనూ ఉన్న పలు తెలుగు సాంస్కృతిక సంస్థలను, సమాఖ్యలనూ సంఘటితపరిచి, వాటి మధ్య స్నేహ, సద్భావ, సామరస్యాలను పెంపొందించడం వంటి లక్ష్యాలతో ఆవిర్భవించిన ప్రపంచ తెలుగు సమాఖ్య ప్రతి రెండు సంవత్సరాలకొకసారి ఈ సభలను నిర్వహిస్తోంది.

ప్రపంచ తెలుగు సమాఖ్య అధ్యక్షురాలు శ్రీమతి వి.ఎల్. ఇందిరా దత్ అధ్యక్షతన, ప్రముఖ పారిశ్రామికవేత్త శ్రీ గోకరాజు గంగరాజుగారి సహాధ్యక్షతనా ఏర్పడిన ప్రత్యేక కమిటీ ఈ తెలుగు మహాసభల నిర్వహణ కోసం విస్తృతమైన ఏర్పాట్లు చేస్తోంది. తెలుగువారి సంస్కృతి, సాంప్రదాయాలు, కళలు, భాషా సౌందర్యం ఈ తరం వారికి చక్కగా తెలిసేలా, మన వారసత్వ కళా సంపద ముందు తరాల వారికి అందించేలా, తెలుగు జాతికి సంబంధించిన అన్ని కళాప్రక్రియలనూ ఆయా రంగాలలో లబ్ధప్రతిష్టులైన కళాకారులచే ప్రదర్శించే ఏర్పాట్లను చేయడం జరుగుతోంది.

విజయవాడ - కానూరులోని 'వెలగపూడి సిద్ధార్థ ఇంజనీరింగ్ కాలేజి, ఆవరణలో జరుగనున్న మహాసభలకు దేశవిదేశాల నుంచి అనేక మంది తెలుగు ప్రముఖులు అతిథులుగా, ప్రతినిధులుగా హాజరుకానున్నారు. ఈ మహాసభలకు ప్రతినిధులుగా తమ పేర్లను రిజిస్టర్ చేసుకోవలసిందిగా తెలుగు భాషాభిమానులు, కళాభిరుచి ఉన్న రసహృదయులను మహాసభ నిర్వాహకులు ఆహ్వానిస్తున్నారు. ఎప్పుడోగాని రాని ఈ అవకాశాన్ని ముఖ్యంగా విజయవాడ ప్రాంతవాసులు తప్పక వినియోగించుకోవాలని, విజయవంతమయ్యేలా తమ సహకారాన్ని అందించాలనీ వారు కోరుతున్నారు.

డెలిగేట్ రిజిస్ట్రేషన్స్, ఇతర వివరాల కోసం కె. రామకృష్ణ (98496 97821) గారిని సంప్రదించవచ్చు. లేదా ramakrishna.k@kcp.co.in కి ఇ-మెయిల్ చేయడం ద్వారా వివరాలు పొందవచ్చు. ●

## రాష్ట్రస్థాయి కవితల పోటీ

హరివిల్లు - సాహితీ సాంస్కృతిక సంస్థ (చిలకలూరిపేట) 5వ వార్షికోత్సవం సందర్భంగా రాష్ట్రస్థాయి కవితల పోటీ నిర్వహిస్తోంది. వివిధ సామాజిక అంశాలపై 30 లైన్లకు మించని వచన కవితలను జనవరి 30, 2009 లోపుగా ఈ పోటీకి పంపించవచ్చు. అత్యుత్తమ కవితకు 'హరివిల్లు - 2009' అవార్డుతో పాటు రు. 1,000/- నగదు, మరో పది ఉత్తమ కవితలకు రు. 100/- నగదు, మెమెంటో, ప్రశంసాపత్రం బహుకరిస్తారు. వివరాలకు పి.వి. రమణ కుమార్, అధ్యక్షులు, పొన్నంవారి వీధి, కె.బి. రోడ్, చిలకలూరిపేట - 522 616 (ఫోన్: 93464 58994) ని సంప్రదించవచ్చు.

# ప్రతి అవసరానికీ ... ఎన్నెన్నో ... CD లు

| తెలుగులో కంప్యూటర్ జాతకం | 55 పేజీల పూర్తి జాతకం రూ.50 ఇ-మెయిల్ రూ.30 | తెలుగులో: ఈ-కుండలి రూ.999, హోరోస్కోప్ రూ.1250, పరాశర రూ.3500, ప్రోఫెట్ రూ.1950, వాక్యం రూ.1950, లియోగోల్డ్ రూ.5500, లాల్ కితాబ్ రూ.1750, రెడ్ ఆస్ట్రో రూ.2500, టారెట్ రూ.999, ముహూర్తా ఎక్స్‌ప్లోరర్ 650, డైలీ ఆస్ట్రాలజీ రూ.650 |
|---|---|---|

కంప్యూటర్ జాతకం తెలుగుతో సహా అన్ని భారతీయ భాషలలో లభించును పేరు, పుట్టిన తేదీ, సమయం, పుట్టిన ఊరు వివరాలు వ్రాసి రూ.50+పోస్టేజి ఛార్జీల నిమిత్తం రూ 20 కలిపి ఎం.ఓ. చేయండి.

## State / CBSE

| | |
|---|---|
| మన విశ్వం 6th-12th | Rs.199 |
| Bio Technology 10th-12th | Rs 299 |
| **Botany 6th-12th** | **Rs.299** |
| **Chemistry 6th-12th** | **Rs.299** |
| **Electronics 10th-12th** | **Rs.299** |
| **Geography 6th-12th Eng/Tel** | **Rs.299** |
| **Human Body Vol 2. Eng/Tel** | **Rs.299** |
| **Human Body 6th-12th Eng/Tel.** | **Rs.299** |
| **Master Brains G.K. 2 Vol. each** | **Rs.199** |
| **Micro Biology 10th-12th** | **Rs.299** |
| **Physics 6th-12th** | **Rs.299** |
| **Vitamins & Minerals Eng/Tel** | **Rs.299** |
| **Zoology 6th-12th** | **Rs.299** |
| AP State Inter [illegible] Eng/Tel | |
| Maths DVD | Rs. 299 |
| Physics DVD | Rs. 299 |
| Chemistry DVD | Rs 299 |
| 6th to 10th Tel EM each | |
| Maths/Phy/Chem/Bio | Rs 199 |
| CBSE Class 1 to 5 | |
| Maths VCD | Rs. 99 |
| English VCD | Rs 99 |
| ScienceVCD | Rs 99 |
| EVS VCD | Rs 99 |
| Gen Knowledge VCD | Rs. 99 |

| | |
|---|---|
| యోగా ఫర్ ఆల్ | రు.99 |
| యోగా ఫర్ కిడ్స్ | రు 99 |
| యోగా ఫర్ ఒబేసిటీ | రు.99 |
| యోగా ఫర్ డయాబెటిక్స్ | రు.99 |
| హోమ్ మసాజ్ | రు.99 |
| మీ ఇల్లే వ్యాయామశాల | రు.99 |
| యోగ నిద్ర, ధ్యానం ఆడియో | రు.99 |

## కంప్యూటర్స్ తెలుగులో

| | |
|---|---|
| Computer Hardware | Rs 199 |
| XP Setup Guide | Rs.199 |
| Flash 8 | Rs 299 |
| Photoshop CS 2 | Rs 299 |
| 3d Studio Max | Rs 499 |
| Maya | Rs.499 |

| | |
|---|---|
| గీతా మహాయజ్ఞము 70గం | రు.299 |
| రామాయణ కథా సుధ | |
| *బాలకాండ 22 గం.* | *రు.199* |
| *అయోధ్యకాండ 29 గం* | *రు.199* |
| *అరణ్యకాండ 22 గం* | *రు.199* |
| *సుందరకాండ 24 గం.* | *రు.199* |
| *కిష్కింధాకాండ 18 గం* | *రు.199* |
| *యుద్ధకాండ 18 గం* | *రు.199* |
| సౌందర్యలహరి 18 గం. | రు.199 |
| దత్తాత్రేయ చరిత్ర 9 గం. | రు 99 |
| గాయత్రీ మంత్రము 9గం | రు.99 |
| గురు తత్వము 9 గం | రు.99 |
| దేవీ సప్తశతి 12 గం | రు.99 |
| ఉపనిషద్దర్శనము 13 గం | రు.99 |
| బ్రహ్మసూత్రాలు 12 గం | రు 99 |
| శివారాధన 11 గం | రు 99 |
| శ్రీచక్ర ప్రవచనము 4 గం | రు.99 |
| లలితా సహస్రము 11 గం | రు.99 |
| శ్రీకృష్ణలీలామృతము 15 గం | రు 99 |
| శ్రీకైవల్యసారధి 12 గం | రు 99 |
| దేవీ భాగవతము 12 గం | రు.99 |
| సాయి చరితము 12 గం | రు.99 |
| ఆత్మసాక్షాత్కారము 10 గం | రు 99 |
| భావనోపనిషత్తు 1 గం | రు.49 |
| సీతాకళ్యాణము 1 గం | రు.49 |
| వనదుర్గా 1 గం | రు.49 |

## డివోషనల్

| | |
|---|---|
| మానస సరోవర యాత్ర VCD | రు 99 |
| కనకదుర్గమ్మ వైభవం VCD | రు.99 |
| మనో వికాసం | రు.99 |
| శ్రీవేంకటేశ్వర సుప్రభాతంDVD | రు.99 |
| దేవీ స్తవార్చన Audio | రు.49 |
| Temples of India PC cdrom | రు 199 |

## సంగీతం, నృత్యం

| | |
|---|---|
| త్రివేణి సాధన | రు 199 |
| 72 మేళకర్త రాగాలు | రు 199 |
| సంగీత సాధన సుధ(సర్టిఫికేట్) | రు.199 |
| సంగీత సాధన సుధ (డిప్లమో) | రు.199 |
| కర్నాటిక్ మ్యూజిక్ థీరీ(సర్టిఫి) | రు 199 |
| కర్నాటిక్ మ్యూజిక్ థీరీ(డిప్లమో) | రు 199 |
| మనోధర్మ సంగీతము | రు.199 |
| తంబూరా శ్రుతులు | రు. 99 |
| కీ బోర్డ్ ఇండియన్ | రు 199 |
| కీ బోర్డ్ వెస్టన్ | రు 199 |
| కీ బోర్డ్ పై మేళకర్త రాగాలు | రు.199 |
| [illegible] - 1 | [illegible] |
| [illegible] - 2 | [illegible] |
| [illegible] | [illegible] |
| [illegible] 2 [illegible] | [illegible] |
| [illegible] | [illegible] |

## [illegible]

| | |
|---|---|
| తెలుగు రైమ్స్ సిరిసిరిమువ్వలు | రు. 99 |
| తెలుగు రైమ్స్ యానిమేషన్ | రు. 99 |
| సిరిసిరిమువ్వలు 4 సి.డి.ప్యాక్ | రు.299 |
| విక్రమాదిత్య 2 సి.డి. | రు.149 |
| ఫ్రూట్ రైమ్స్ యానిమేషన్ | రు. 99 |
| యానిమల్ రైమ్స్ | రు. 99 |
| చిన్నారి లైవ్ వీడియో | రు. 99 |
| English Rhymes Live | Rs 99 |
| Kindergarten Live Video | Rs 99 |
| KG 4 cds Combo Pack | Rs 299 |
| Painting World PC Soft | Rs 199 |
| My ABCD PC cdrom | Rs 249 |
| My 123 PC cdrom | Rs 249 |

## Competitive Exams

| | |
|---|---|
| Toefl IBT | Rs 399 |
| GRE | Rs.299 |
| GMAT | Rs 299 |
| Brain Teasers | Rs 399 |
| Psychometric Tests | Rs 495 |
| Test your IQ | Rs 495 |

## [illegible] Test Runner Series [illegible]

BITSAT, AIEEE, EAMCET Eng., Med, PMT, GRE, PG Medical

Test Runner Series features Unlimited simulated Model & Practice Tests, Strong & Weak Area Analysis, Test Review with more than 25,000 MCQ's in each CD

## English Learning

| | |
|---|---|
| English Nerchukondi 2 vol each | Rs 149 |
| Learn Grammar Basics | Rs 149 |
| Learn Grammar Adv | Rs.149 |
| Spoken English VCD | Rs.199 |
| Learn to Speak Eng | Rs 249 |
| Cafe English 6 CDs | Rs 750 |
| Telephone English | Rs 295 |
| Good Hand Writing | Rs.199 |
| Oxford Talking Dict. | Rs 399 |
| Cambridge Adv Dict. | Rs.399 |
| English Hindi Dict. | Rs 150 |
| Effective Resumes | Rs 149 |
| 1001 Business Letters | Rs.149 |
| Word Yo | Rs 99 |
| Flip Words | Rs 99 |
| Power Vocabulary | Rs 149 |

| | |
|---|---|
| వేమన నీతి పద్యాలు 2 సి.డి. | రు 199 |
| సుమతి పద్యావళి 2 సి.డి | రు.199 |
| వేమన, సుమతి 4 సి డి ప్యాక్ | రు 299 |
| డ్రాయింగ్ 2 సి.డి | రు 199 |
| చదరంగం | రు.199 |
| తెలుగు వ్యాకరణము 3 సి.డి. | రు.299 |
| మేజిక్ | రు 199 |
| కరాటే | రు 199 |
| కుంగ్-ఫూ | రు.199 |
| వ్యక్తిత్వ వికాసం | రు.199 |

## మహిళలకు

| | |
|---|---|
| బ్యూటీ-హోమ్ బ్యూటిషియన్ | రు.199 |
| ఎంబ్రాయిడరీ 2 సి.డి. | రు.199 |
| మగ్గం ఎంబ్రాయిడరీ | రు 199 |
| ఫ్యాబ్రిక్ పెయింటింగ్ 2 సి.డి | రు 199 |
| పాట్ పెయింటింగ్ | రు.199 |
| టైలరింగ్ కిడ్స్,లేడీస్,జంట్స్ | రు.199 |
| హోమ్ నర్సరీ | రు.199 |
| వంటలు బిర్యానీ స్పెషల్ | రు. 99 |
| వంటలు వెజిటేరియన్ | రు. 99 |

## CHANDU Cliparts & Images

| | |
|---|---|
| Telugu Cliparts & Image15 cds | Rs 1500 |
| Images Collection Each CD | Rs.250 |

**త్వరలో: వాస్తు, ఆస్ట్రాలజీ, పామిస్ట్రీ నేర్చుకోవడానికి యానిమేషన్‌తో కూడిన లెసన్స్**

Published and Marketed by





8, Surya Satya Apartments, Hotel Fortune Murali Park Road,
Revenue Colony, Mogalrajapuram, Beside HP Gas, Vijayawada -10, A.P.
Ph: 0866 6666677, E-Mail. sphoorthipublications@gmail.com


BCI



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA101M122 |
| పుస్తకం పేరు | కథాకేళి |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 101 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | sharmila |
| పరీక్ష చేసినది | hema |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |